# ఫీల్ గుడ్, మేరా భారత్!

భారత్ వెలిగిపోతోంది!
బతుకు రగిలిపోతోంది!!

సబర్మతీ శోకానల
మారణహోమం సాక్షిగ
రామమందిరం పేరున
రావణ కాష్టం సాక్షిగ

ఆత్మహత్యకొడిగట్టిన
అన్నదాత వ్యధ సాక్షిగ
వల్లకాడులై పోయిన
పల్లెల జనతే సాక్షిగ

భారత్ వెలిగిపోతోంది
బతుకు రగిలిపోతోంది!

వీడియోటేపుల కెక్కిన
వికృత చరితల సాక్షిగ
అమర జవాన్ శవపేటిక
సాగిన బేరం సాక్షిగ

వేదసంస్కృతీ వేదిక
డిస్కో దాన్సుల సాక్షిగ
భావస్వేచ్ఛ బలిచేసే
బర్బర దాడుల సాక్షిగా

భారత్ వెలిగిపోతోంది

కాషాయం కార్పొరేట్
కాక్‌టైల్ ప్రచారాల
రాజకీయ రథయాత్రల
రసవత్తర ప్రసంగాల

స్వర్గం అరచేత చూపు
స్పాన్సర్డ్ చిరునవ్వులలో
మహిళను సరుకును చేసే
మార్కెట్ మంత్రోచ్చారణలో

భారత్ వెలిగిపోతోంది
బతుకు రగిలిపోతోంది!

స్వతంత్రాన్ని కబళించే
అంకుల్ శ్యామ్ కనుసన్నల
స్టాక్ మార్కెట్ సంబరాలు
మల్టీ నేషనల్ వన్నెల

కరోడ్‌పతుల కేరింతలు
బడాచోర్ల తుళ్లింతలు
కోట్లకొలది బీద ప్రజ
ఆకలి చావుల కేకల

భారత్ వెలిగిపోతోంది!
బతుకు రగిలిపోతోంది!!



PRSVM02A111

సాహిత్య
ప్రస్థానం
జనవరి-మార్చి 2004

సంపుటి :1 సంచిక : 1

# సాహిత్య ప్రస్థానం

ప్రస్థానం కొత్త రూపంలో, కొత్త పేరుతో మీ ముందుకొచ్చింది. సాంకేతిక అవసరాల కోసం 'సాహిత్య' పదం జతపరచవలసి వచ్చింది. సౌలభ్యం కోసం సైజు మారింది. ఇది వరకటి సైజు కొంత ఇబ్బందిగా వుందని పలువురు సూచించారు. 'సాహిత్య ప్రస్థానం' అనే పేరుకే రిజిస్ట్రేషన్ లభించిన సందర్భంలో సంపుటి, సంచికలు కూడా కొత్తగా మొదలుపెట్టాల్సి వచ్చింది. ఇప్పుడే సైజు కూడా మార్చడం సముచితంగా వుంటుందని భావించాము. ప్రస్థానంకు ఆదరణ అమితంగా వున్నా ఆ మేరకు అందుబాటులో వుండటం లేదనే ఫిర్యాదు కూడా త్వరలోనే తొలగిపోతుంది. ఆ వివరాలు వచ్చే సంచికలో.

ఈ సందర్భంలోనే ప్రస్థానం మెరుగుదలకు సంబంధించిన మీ అభిప్రాయాలు, సూచనలు, సలహాలు, ఆకాంక్షలు అన్ని వివరంగా రాసి పంపవలసిందిగా మరీ మరీ మనవి. మా సూచనలు కొన్ని చివర వున్నాయి. సాహితీ సంస్థలు, మిత్ర బృందాలు పత్రికపై ప్రత్యేకంగా చర్చించి అభిప్రాయాలు రాస్తే మరీ సంతోషం.

❖❖❖

భారత్ వెలిగిపోతోందని, అంతాబాగుందనుకోమని ఊదరగొట్టే ఫీల్‌గుడ్ నేపథ్యంలో దేశం మరోసారి ఎన్నికలకు సిద్ధమవుతోంది. అయోధ్య కల్లోలం నుంచి గుజరాత్ హత్యాకాండ వరకూ సాగిన మతోన్మాద రాజకీయం మరోసారి అధికారం చేపట్టేందుకు హంగామా చేస్తోంది. దాని హంగుదారులైన రాష్ట్ర పాలకులు కూడా ముందస్తు ఎన్నికలు తెచ్చిపెట్టి ప్రచారార్భాటాలు సాగిస్తున్నారు. ముందెన్నటి కన్నా ఈనాడు మీడియా మిలమిలలు, ప్రచారపుటెత్తులు ప్రజలపై వలలు విసురుతున్నాయి. లౌకికతత్వం, ప్రజాస్వామ్యం కాపాడుకోవడమే ఈ ఎన్నికల సందర్భంలో ప్రధాన కర్తవ్యంగా వుంది. మతోన్మాద శక్తులు కవులు, రచయితలు కళాకారుల భావప్రకటనా స్వేచ్ఛపైన కూడా దారుణమైన దౌర్జన్యం సాగిస్తున్న తీరు అందరికీ తెలుసు. సమాజంలో భాగంగా, ఆలోచనా పరులుగా రచయితలు కవులు ఈ పరిస్థితిలో తమ బాధ్యతలు తాము నిర్ణయించుకోవాలి, నెరవేర్చాలి. సాహిత్య రంగం కూడా సమాజంలో పరిణామాలకు అతీతంగా వుండలేదని దీన్ని బట్టి స్పష్టం. నోబుల్ బహుమతి పొందిన వి.ఎస్.నైపాల్ ఇటీవలనే బిజెపికి వంతపాడారు. కాని విస్తారమైన ప్రగతిశీల సాహిత్య కళా బృందాలు అభివృద్ధి నిరోధక పోకడలను వమ్ముచేసి ప్రజాస్వామిక లౌకిక విలువలను కాపాడుకోవాలని భావిస్తున్నాయి. ఇందుకు సంబంధించి తెలుగు సాహిత్యలోకంలో కూడా చర్చ జరగాలి. ఈ సందర్భంగా ప్రజలను చైతన్యపరచే పాత్ర కవులు, రచయితలు తప్పక నిర్వహించాలి. ❖



## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లి రవి

ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య

మేనేజర్
కె. లక్ష్మయ్య

అడ్రస్ :
సాహిత్య
ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోను : 27660013, 27635136

## అభినందనలు ప్రాయాలు



'ప్రస్థానం' 2003 చివరి సంచిక ఎక్కువ పేజీలతో, అందంగా, ఆకర్షణీయంగా, అర్థవంతంగా వెలువడటం నాకెంతో ఆనందం కలిగించింది. అలనాటి సాహిత్య పత్రిక 'భారతి'ని గుర్తు చేస్తోంది మన 'ప్రస్థానం'. ఇది ఇలాగే వర్ధిల్లుతూ మహా ప్రస్థానం సాగించాలని నా ఆకాంక్ష!

ఇక, ఈ సంచికలోని కొన్ని రచనల గురించి నా అభిప్రాయాలు పుప్పాల కృష్ణమూర్తి కథానిక 'ఒంటరి గుడిసె' బుడిగ జంగాల దారుణమైన వ్యదార్ధ గాథ. 'జనసాహిత్య సమ్మేళనానికి సంబంధించిన కథనాలు ప్రత్యక్షానుభవాన్ని కలుగజేశాయి. జాతశ్రీ కథానిక 'చలివేంద్రం' కుమ్మరి వెంకన్న దయనీయ జీవితాన్నే గాదు, మైత్రీ సంఘాలు, చలివేంద్రాల తతంగాలు నడిపినా, మారని పోలీసు దైత్యాన్ని వాస్తవికంగా చిత్రించింది.

డాక్టర్ సీతారాం 'కవితావతరణం'లో ఇచ్చిన ఇంటర్ మొదటి సంవత్సరం విద్యార్థుల 'ఖాళీ ఊయెల' కవితలు నిజంగానే ఎంతో హృద్యంగా ఉన్నాయి. నిఖిలేశ్వర్ వ్యాసం 'విప్లవ కవిత్వం' ఒక సరియైన విమర్శనాత్మక పరిశీలన. మరోప్రముఖ కవి జ్వాలాముఖి కోటి స్వగతాలు పోరాడందే ఉన్నత సమాజం ఆవిర్భవించదని ఎలుగెత్తి చాటడం - వీరిద్దరూ విప్లవ సాహిత్యపు ఒంటెత్తు పోకడను దర్శింప చేయడం ముదావహం.

జిలుకర శ్రీనివాస్ "నిర్మాణవాద" భాషా శాస్త్ర అంశాలు" నాలాటి సామాన్య పాఠకులకు గులకరాళ్ళుగానే నిలిచిపోయాయి. భాషాశాస్త్రానికి సంబంధించి సరళమైన వ్యాసాలు ప్రచురిస్తే బాగుంటుంది. ఉమ కథానిక ఓ పాలబుగ్గల చిన్నిరైతనా చదువుతున్నంత సేపూ నా బాల్యమంతా నా కళ్ళెదుట కదలాడి కన్నీరు ఉబుకుతూనే ఉంది. శభాష్ ఉమగారూ, మీ కథానికా ప్రయోజనం నెరవేరింది!

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత సుభాష్ ముఖోపాధ్యయను పరిచయం చేసిన జ్వాలాముఖిగారి వ్యాసం ఇతర భారతీయ భాషల సాహితీవేత్తల గురించి తెలుసుకొని స్ఫూర్తి పొందటానికి తోడ్పడింది.

'ప్రస్థానం' పత్రికాభివృద్ధికి నా ఈ రెండు సూచనలను ఆలోచించాలని కోరుతున్నాను.

1) పత్రికలో ముద్రారాక్షసాలు రుచికరమైన విందులో పంటి కింద రాళ్ళలా గున్నాయి. పరిహరించగలరు.

2) పత్రిక మార్కెటింగ్ విషయంలో మరింత శ్రద్ధ వహిస్తే మంచిది. సంవత్సర చందాలు తప్పనిసరిగా స్వీకరించి, దృఢమైన రేపర్‌తో పత్రికలను పోస్ట్ చేయాలి.

-**ఎ.జి. యతిరాజులు**, చిత్తూరు

ముఖ చిత్రం

**మిమి రాధాకృష్ణన్**

లోపలి చిత్రాలు

**మోహన్, చంద్ర, రమణజీవి, శేఖర్, శ్రీరామ్**

ఒకసారి నల్లగొండలో నడుస్తూ వెళ్తూ ప్రజాశక్తి బుక్ షాప్‌లో ప్రస్థానం సాహిత్య ప్రత్యేక సంచిక-2002 చూసి కొని ఆసాంతం చదివి చాలా సంతోషించాను. తర్వాత సూర్యాపేటలో ప్రజాశక్తి బుక్ ప్రదర్శనశాలలో 'ప్రస్థానం' పేరుతో 3వ మరియు 4వ సంచికలు చూసి త్రైమాసిక పత్రికగా వెలువడుతున్న విషయం తెలుసుకొని ఎంతో ఆనందపడ్డాను.

సాహిత్య లోకంలో ఎన్నో పత్రికలు వస్తున్నాయి. జనాల చేతులలోకి చాలా తేలికగా వెళ్తున్నాయి. కాని పూర్తి సాహిత్యంతో, సృజనాత్మకతతో వెలువడుతున్న "ప్రస్థానం" కేవలం కొందరికే తెలియటం బాధాకరం.

ఫ్యాషన్‌తో వెర్రితలలు వేస్తున్న సంస్కృతికి, భాష మారుతున్న సాహిత్యానికి ఈ "ప్రస్థానం" కావాలి నిజంగా ఓ కర దీపిక.

ఈ పత్రిక నిరంతరం కొనసాగాలని, దీనికి ప్రతి ఒక్కరి ఆర్థిక, హార్థిక ఆశీస్సులు అందాలని కోరుకుంటున్నాను.

"యిలా కొనసాగే ఈ సాహితీ స్రవంతికి
ప్రతి సాహిత్య అభిమాని యివ్వాలి హారతి!"

ఈ ప్రస్థానం మంచి అభిరుచికల సాహిత్యాభిమానికి మరో వరప్రసాదం.

3వ సంచికలో ఓల్గాగారి "సారీజాఫర్" కథ చదువు తున్నప్పుడు హైదరాబాద్ పాత బస్తీ కర్ఫ్యూ నీడలో వుండటం నిజంగా కాకతాళీయమా? నేటి యువతరం ఆలోచనలు ప్రజాస్వామ్యంలో ప్రజా ప్రతినిధుల పాలనా ఎత్తుగడలా? కథలోలా రామారావు జాఫర్ అలీ లాంటి స్నేహ లోపాలా?

ఏదీ ఏమైనా నిజంగా యిది బాధాకరం.

యిలా, అలా అన్నింటిని కలబోసి కలగూర గంపలా సాహిత్యాన్ని వడబోసిన సాహిత్య సంచిక ప్రస్థానం ముందుకు వెళ్ళాలని, అందరి ముంగిళ్ళలోకి వెళ్ళాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ఈ పత్రికకు, కర్తలకు అభినందనలు తెలియచేస్తున్నాను.

- నాగార్జునపు **శ్రీనివాస్**, అడ్వకేట్, కోదాడ, నల్గొండ.



తెలుగు విశ్వవిద్యాలయం తరపున కవి అడిగోపుల వెంకట రత్నంకు పురస్కారం అందజేస్తున్న స్వామిరంగనాథానంద (పక్కన) కవి, నిర్మాత ఎం.ఎస్.రెడ్డి, వైస్ ఛాన్సలర్ డా. జి.వి. సుబ్రహ్మణ్యం

కె. వరలక్ష్మి



# అతడు-నేను

కాంపౌండు వాల్ పక్కన వేపచెట్టు విరగబూసింది.
ఫాల్గుణ మాసపు సాయంకాలం నులివెచ్చని గాలి చిరుచేదు సుగంధాన్ని కిటికీలోంచి గదిలోకి మోసుకొస్తోంది.

కిటికీకి చేరబడి పశ్చిమాకాశంలో మారుతున్న రంగుల్ని చూస్తున్నాను. నీలి ఆకాశం మీద తెల్లని మచ్చుతునకొకటి రూపాల్ని మార్చుకుంటూ అక్కడే నిలిచి నిలిచి హఠాత్తుగా మాయమైంది. కిటికీలో సగం తెరిచి పెట్టిన మార్క్‌టల్లీ పుస్తకం 'ఇండియా ఇన్‌స్లోమోషన్' కొత్త పేజీలు గాలికి రెపరెపమంటున్నాయి - మన గురించి మనకి పూర్తిగా తెలీదు. మనల్ని మనం తెలుసుకునే క్రమంలోనే జీవితం కాస్తా వెళ్ళిపోతుంది. ఇతరుల్ని అధ్యయనం చేసినంత లోతుగా ఆత్మపరిశీలన సాధ్యంకాదు.

ఠక్...ఠక్... వెనకనించి కర్ణకఠోరమైన శబ్దం -

అసంకల్పితంగా వెనక్కి తిరిగేను.

మంచం పట్టెమీద శబ్దం చేసిన ఇనప ఊచని పక్కన పెట్టి ఎడమ చేతిని కొంత పైకెత్తి ప్రయత్నం మీద చిటికెన వేలు విడదీసి చూపించాడతను.

నేను తొందర తొందరగా అటు నడిచి యూరిన్ మగ్గులోకి యూరిన్ పట్టేను. అలా చేయడం ఏ కొంత ఆలస్యమైనా పక్క తడిసిపోతుంది. టాయ్‌లెట్లో వంపేసి, మగ్గుని డెట్టాల్తో కడిగి తెచ్చి యథాస్థానంలో ఉంచాను.

నేను తిరిగొచ్చేసరికి అతను నోరుతెరిచి తినడానికేమైనా కావాలని సైగ చేస్తున్నాడు.

వంకరపోయిన నోరు, రెప్పపడని ఒక కన్ను - ముఖాకృతి వికృతంగా గుర్తుపట్టలేని విధంగా - కదలకుండా నిలిచిపోయిన కుడిచెయ్యీ, కాలూ, మూగపోయిన గొంతు -

నేనలా నిశ్చలంగా నిలబడి అతన్నే పరిశీలిస్తున్నాను. ఒక్కసారిగా ఉధృతంగా వచ్చిన పెరాలసిస్ స్ట్రోక్ నలభై అయిదేళ్ళ ఈ బలమైన వ్యక్తిని ఎంత నిస్సహాయుడిగా మార్చేసింది!

ఉన్నట్టుండి క్షణంలో అతని మొహంలో కోపఛాయలు నిండి పోయాయి. ఆ కోపపు ఉధృతికి మనిషి మొత్తం కంపించిపోసాగేడు.

ఎంత కోపం ఇప్పటికింకా! అతనన్నది క్షణాల్లో జరిగిపోవాలి. అతని మాటకి ఎప్పుడూ ఎదురు చెప్పకూడదు. చెప్పేనో... ఇప్పుడు కదలకుండాపోయిన ఆ కుడి చెయ్యి ఆ రోజుల్లో బలంగా నా చెంపని ఛెళ్ళుమన్పించేది.

అతడి ఆ కంపన చూసి నాకే జాలేసింది.

జార్‌లోంచి కొన్ని బిస్కెట్స్ తీసి ప్లేట్లో వేసి, గ్లాసుతో పాలు తెచ్చి పాలల్లో ముంచి తిన్పించసాగేను. రెండు మూడు బిస్కెట్స్ తిన్నాక అతని షివరింగ్ తగ్గింది.

గత ఏడాది కాలంగా ఇదంతా అలవాటైపోయింది. మొదట్లో అతని కన్నా ముందు నేను భయంతో వణికిపోయేదాన్ని.

అతను పని చేయించే చోట ఎవరి మీదో కోపం తెచ్చుకుని, అవతలి వ్యక్తిని చితక్కొట్టి, గొంతు చించుకుని అరిచేసరికి ఇలా స్ట్రోక్ వచ్చింది. రెండు రోజులపాటు ఎవరూ పట్టించుకోక ఏదో సాధారణ వైద్యం చేయడంతో, ఇన్‌టైంలో సరైన వైద్యం అందక ఆ తర్వాత ఎన్నెన్ని వైద్యాలు చేయించినా స్ట్రోక్ బారి నుంచి పూర్తిగా కోలుకోవడం కష్టమైంది.

తన కోపమే తన శత్రువు -

కానీ అతని కోపం నాకూ శత్రువే. అతనివల్ల నేనూ

అందరికీ శత్రువునయ్యాను.

భర్తతోడిదే భార్యలోకం కదా!

అవును, మాపల్లెల్లో అది ఉత్త నానుడి మాత్రమే కాదు, తు.చ తప్పకుండా ఆచరించాల్సిన నీతి, న్యాయం. భార్యలకి వ్యక్తిత్వాలుండవు. సొంత గుర్తింపులుండవు.

అతనిలో ఎప్పటికైనా ఏదో ఓ గొప్ప మార్పు రాక తప్పదని, ఆనందం అంతా అప్పుడే వెల్లువెత్తి నన్ను ముంచేస్తుందని, మీరుతున్న వయసు అతనికి నన్ను, నాకు అతన్ని సన్నిహితం చేస్తుందని ఓదార్పు కలలు కన్నాను. అవన్నీ కొంతసేపటి క్రితపు ఆకాశంలోని మబ్బుతునక లాగే కరిగిపోయాయి.

ఇదిగో ఇతడిలా మంచం పట్టేడు. నేనిలా ఆజాన్మాంత సేవకురాలిగా మిగిలిపోయేను.

కొత్తలో ఎందరెందరో చుట్టాలు పక్కాలు వచ్చి చూసి ముఖం మీద సానుభూతి చూపించి, వెనక్కెళ్ళి వ్యంగ్యంగా నవ్వుకుని వెళ్ళేవారు. 'అబ్బో అంతా బాగున్నప్పుడు వీళ్ళిద్దరికీ ఎవరైనా కళ్ళకి కన్పించేరా? ఎంత గర్వం, ఎంత పొగరు మోతుతనం, ఇప్పుడిలా బాగా జరిగింది'- నాకిప్పుడిక ఈ పడమటి కిటికీయే నేస్తం, కొంచెం తీరిక దొరికితే చాలు - రంగులు మారే ఆకాశం, దాని అంచులనించి నేలకి దిగినట్లన్పించే దూరపు కొండలు, కొండ పాదాలకీ నాకూ మధ్య బారులు తీరిన సైనికుల్లా నిలిచిన తాటిచెట్ల వరసలు, ఆ చెట్ల మొవ్వుల్లోంచి ఉన్నట్టుండి గుంపులుగా పైకెగిరే రామచిలకలు, అడవి పావురాలు, అప్పుడప్పుడూ కొండసానువుల్లోని అడవినించి దారి తప్పిపోయి వచ్చి పెరట్లోని కరివేప చెట్టు మీద వాలి కొత్తకొత్త గొంతుల్తో వీనుల విందుచేసే పేరు తెలీని రంగురంగుల పక్షులు - అన్నిట్నీ చూసే భాగ్యాన్ని ఈ కిటికీయే నాకు ప్రసాదిస్తోంది.



దూరంగా కొండపాదంలో కన్పించే తామరపూల చెరువు ఎంతో దయగా నా బాల్యాన్ని నాకు గుర్తు చేస్తూ ఉంటుంది. ఎప్పుడూ కొద్ది పాటి నీళ్ళనైనా మిగుల్చుకొనే ఆ చెరువు ఈ ఏడాది ఎండి నెరియలు విచ్చి నాలాగే కళతప్పి వెలవెలపోతోంది.

బాల్యం అనే మాటే నాకెంతో మధురంగా తోస్తుంది. అడవి మధ్యలో అప్పుడప్పుడే వికసిస్తున్నట్టు ఎదుగుతున్న మావూరు, ఆ పచ్చని చెట్ల పరిసరాలు నాకిష్టం. ఊహ తెలిసీ తెలీని రోజుల్లోనే పెళ్ళి అనే మాటంటే నాకెంతో ఇష్టం. అది ఎవరి పెళ్లైనా కానీ పెళ్ళిలోని రంగురంగుల చీరలు, మామిడాకుల పచ్చతోరణాలు, అడవిపూల దండలు, తాటాకు పందిళ్ళ చల్లదనాలు, పచ్చని అరిటాకుల్లో వడ్డించే వేడివేడి బూరెలు ముద్దపప్పు-నెయ్యి ఇవేవీ కావు నాకిష్టమైనవి - ఇప్పటికీ ఒక మధుర భావ వీచికలా నా మనసులో రూపు దిద్దుకొని నర్తించేది పల్లకీ ఒక్కటే. రంగురంగుల గాజుపూసలు, ముత్యాల జాలర్లు అలంకరించుకుని పెళ్లిలో ఓ గొప్ప ఆకర్షణై నిలిచిపోయే పల్లకీ, పెద్దయ్యాక క్రిష్ణశాస్త్రిగారి పల్లకీ కవిత చదివి ఒకటే మురిసి పోయేదాన్ని. ఇంటి ముందు నుంచి ఏ పెళ్ళి ఊరేగింపు వెళ్ళినా నన్నూ పల్లకీలోకి ఎక్కించమని ఒకటే పేచీ పెట్టేదాన్ని, ఊరేగింపులోని ఎవరో ఒకళ్ళు నన్నెత్తి పల్లకీలో కొత్త జంట మధ్య కూర్చోబెట్టేవాళ్ళు. లయబద్ధంగా ఊయలూగే పల్లకీలో కూర్చుని ఒకటే మురిసిపోయేదాన్ని. నాలుగిళ్ళ అవతల వరకూ మానాన్న పల్లకీ వెంట నడిచి దిగనని మారాంచేసే నన్ను పల్లకీలోంచి దించి ఎత్తుకుని ఇంటికి తీసుకొచ్చేవాడు. ఇంకా చిన్నప్పుడు వీధిన పోయే వాళ్ళెవరైనా 'పల్లకీ ఎక్కిస్తాను వస్తావా' అంటే చాలు చేతులు చాచి వాళ్ళ మీదికి ఊరికే దాన్నట, మా అమ్మ చెప్పేది. నా బలహీనత కనిపెట్టి మామయ్య వరసయ్యే వాళ్ళు కొందరు మా వీధి వెంటవెళ్తూ 'పిల్లా, నన్ను పెళ్ళాడతావా పల్లకీ ఎక్కిస్తాను' అంటూండే వాళ్ళట. నేను వెంటే ఇంట్లోంచి పరుగెత్తుకొచ్చి "సరే సరే" అనేదాన్నట. వాళ్ళు నవ్వుకుంటూ వెళ్ళిపోయేవాళ్ళు. ఆ తెలిసీ తెలీని బాల్యంలోనే కాదు పెద్దయ్యాక కూడా స్త్రీల భావుకత్వాన్ని, బలహీనతల్ని ఎగతాళి చేసి ఏడిపించే వాళ్ళుంటారని పెళ్ళయ్యాక అర్థమైంది.

నా పదిహేనేళ్ళ వయసులో నన్ను ఇష్టపడ్డానని కోరి పెళ్ళాడిన ఇతడు నేను 'పల్లకీ' అనగానే "ఛీ, అదేం కోరిక, పాతచింతకాయ పచ్చడి కోరిక" అన్నాడు.

నేనింకా పట్టుపడితే అతడు నన్ను పెళ్ళాడనంటాడేమోనని మా వాళ్ళకి భయం. అలా నా చిరకాల వాంఛ ఛిద్రమైపోయింది.

పల్లకీ పాతబడిపోయినా చాలా కాలం వరకూ చాకలి నర్సయ్య ఇంటి వీధరుగు పల్లకీ గూట్లో అలంకారాలు లేని బోసిపల్లకీ ఉండేది.

నేనెప్పుడు మావూరికెళ్ళినా మంచినీళ్ళ చెరువు నానుకుని ఉన్న చాకలి వీధికెళ్ళి పల్లకీని చూసి, ఏదో ఓ వంకతో దాన్ని నిమిరి, దాని పూర్వవైభవాన్ని కళ్ళల్లో నింపుకొని వచ్చేదాన్ని, ఓసారలా వెళ్ళినప్పుడు బోసిపోయిన గూడుని చూసి అడిగితే "ఏవుందమ్మా, వాడకం లేక పల్లకీకి చెదలు పెట్టేసేయి. ఏ ముక్కకాముక్క ఇరిగిపోయింది" అన్నాడు నర్సయ్య కళ్ళు తుడుచుకుంటూ. నాకూ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆ తర్వాత ఇంకెప్పుడూ అవసరమైనా ఆ వీధిలోంచి వెళ్ళలేదు.

బాల్యం నాటి ఆ చిన్నచిన్న తీపి స్మృతులు తప్ప పాతికేళ్ళ నా వైవాహిక జీవితంలో ఏనాడైనా గుర్తు చేసుకొనే మధురస్మృతులున్నాయా?

మా అటవీ ప్రాంతాల్లో వరుడికి కట్నం ఇచ్చే సాంప్రదాయం లేదు. ఇష్టపడి వచ్చిన వాడికి పిల్లనిచ్చి పెళ్లి జరిపించడమే. పెళ్ళిలో లాంఛనాలైనా జరిపించలేదని బతికున్నన్నాళ్ళూ ఇతని తల్లి నావైపు ఎంత చీదరగా చూసేదో! అవకాశం దొరికితే చాలు "ఇంతోటి అందగత్తె ఎక్కడా దొరకదని ఈ అడివి మొహాన్ని కట్టుకున్నాడు" అంటూండేదావిడ

అసలితనికీ నాకూ పెళ్ళి జరగడమే గొప్ప ఆశ్చర్యం.

ఆడా మగా భేదాలు పాటించడం, మగవాళ్ళని చూసి తలుపు వెనక దాక్కుని మాట్లాడడం, అక్కర్లేనంత మర్యాదలు బొలకబొయ్యడం నాకు తెలీదని వీళ్ళ మొదటి ఫిర్యాదు.

నేను హైస్కూల్లో చదువుతున్నప్పుడు అతను బస్తీ నుంచి మా ఊరి మీదుగా ఎక్కడికో వెళ్తూ స్కూలుకెళ్తున్న నన్ను చూసేడట. తన తరపున పెద్దలెవరూ లేరని, తన తల్లి ఉన్నా ఆవిడకేం తెలీదనీ చెప్పి మా పెద్ద వాళ్ళతో మాట్లాడి పెళ్ళి నిశ్చయం చేసుకున్నాడు. ఒక బస్తీ యువకుడు, సొంత ఇల్లు వ్యాపారం ఉన్నవాడు తమ కూతుర్ని కోరి పెళ్ళాడతానన్నందుకు మా అమ్మ నాన్న ఒకటే మురిసిపోయేరు.

ఆ తర్వాత పెళ్ళి జరిగేలోపల ఎన్నోసార్లు మాక్లాస్‌రూమ్ దగ్గరకొచ్చి నన్ను బైటికి పిల్చి ఓ గులాబి పువ్వు నా చేతికిచ్చేవాడు. ఆ టైంలో అతని ముఖంలో ఏం భావముండేదో నేనెప్పుడూ గమనించలేదు. నేను తిరిగి క్లాసులో కొస్తుంటే క్లాసులో అందరూ నన్ను చూసి నవ్వేవాళ్ళు. నేను అవమానంతో కళ్ళనీళ్ళ పర్యంతమయ్యేదాన్ని.

అడవితల్లి ఒడిలో పుట్టిన మా బతుకులు పూర్తిగా చెట్టుపుట్టలతో మమేకమై ఉండేవి. కొండవాలుల్లోని పోడు వ్యవసాయం, ఊరి మార్గాలన్నింటి పక్కన బారులుతీరి నిల్చున్న తురాయిచెట్లు, అడవి మల్లెవృక్షాలు. ఊరి బైట గట్లంట పుట్లంట కాసిన కొండ మామిడి కాయలు

అతి పులుపుదనాలు. బడినించి ఇంటికెళ్ళే దారి నిండా రాసులుగా రాలిపడిన కుంకుడు కాయల్ని, ఉసిరికాయల్ని పుస్తకాల సంచుల్లో నింపుకొని మొయ్యలేక మోసుకెళ్ళడాలు తప్ప ఇలా గులాబీపూల ప్రణయం తెలీని వాళ్ళం.

పదిహేనేళ్ళకే తలవంచుకుని ఇతని సహచరిగా ఇతని ఇంటికొచ్చాను.

మళ్ళీ ఠక్...ఠక్...

టైం చూసాను, ఆరున్నర. టీ.వీ. ఆన్ చేసి ఆంధ్రావని ట్యూన్ చేశాను.

గోధుమ జావలో పప్పుపులుసువేసి స్పూనుతో కలిపి తెచ్చాను.

అతను కష్టం మీద నోరు తెరిచాడు. ఒక్కొక్క స్పూను జావ నోట్లో వేస్తూంటే నమలకుండానే మింగుతున్నాడు.

నా దృష్టి టీ.వీ. మీద నిల్చింది.

ఇంటర్మీడియేట్ పరీక్షలకి క్లోజ్డ్ సర్క్యూట్ కెమెరాలు అమరుస్తారట. ఎందుకు చదువులకి ఇంతంత ప్రదర్శనలు పటాటోపాలు? నిజంగా కష్టపడి చదివినా ఉద్యోగాలెక్కడున్నాయని? డబ్బుతో పోటీపడి కొనుక్కునే సీట్లకోసం ఈ వడపోత షో లెందుకో...

కోట్లలో జనం డబ్బు మింగేసి ఏడాదైపోయిన సందర్భంగా ఏడుస్తున్న జనానికి కంటితుడుపుగా యాభైవేల డిపాజిట్లు ఒకటొకటిగా ఎప్పుడో ఒకప్పుడు ఇస్తానని హామీ ఇస్తున్నాడు ఓ ప్రైవేటు బ్యాంక్ ఎం.డి. ఆ మొహంలో ఎక్కడా గిల్టీ అనేదేలేదు. పైగా ఏదో ఘనకార్యం చేసిన గర్వం తొంగి చూస్తోంది.



ఆటోలు బేన్ చేస్తారట. ఇకపై అందరూ ఆర్టీసీ బస్సుల్లోనే ప్రయాణం చెయ్యాలట. ఎందరి నోళ్ళు కొట్టే ప్రయత్నమిది! ఎందరికి ఇబ్బంది! ప్రొద్దుట పేపర్లో నేను చదివిన డా॥ సి. రంగరాజన్ వ్యాసంలోని వాక్యాలు గుర్తుకొచ్చాయి : ఆర్థిక ప్రపంచీకరణ జరుగుతున్న సందర్భంలో సాంస్కృతిక ప్రపంచీకరణ గురించి కొంత భయాన్ని వ్యక్తం చేశాడు. 'ఆర్థిక ప్రపంచీకరణ ధనవంతుల్ని ఇంకా ధనవంతులుగా, పేదవారిని ఇంకా పేదవారుగా చేస్తుంది. భారతదేశ ఆర్థిక వ్యవస్థను పరిశీలిస్తే దిగువ కులాలకు చెందిన వారు కులవృత్తుల మీద ఆధారపడి జీవించే వారు. ప్రపంచీకరణ సాంప్రదాయక కులవృత్తుల్ని నాశనం చేసింది. వారి ఉనికిని దెబ్బతీసింది. సామాన్య ప్రజలకి వృత్తి మార్పిడి కొన్ని నిబంధనల్ని సృష్టించింది' అంటాడు. నేను చదివిన చదువుతో సంబంధం లేకుండా నాలో ఈ జిజ్ఞాస అన్నీ తెలుసుకోవాలనీ, అన్నీ చదవాలనీ - ఎలా ఏర్పడిందో నాకు తెలీదు. అది కూడా ఇతని కంటగింపుకి కారణమైంది.

నా అదృష్టమేమో నేను అక్షరాలు నేర్చుకొనే టైంకి మా ఊరికి బడి వచ్చింది. నేను ధారాళంగా చదవగల్గిన టైంకి మా ఊరికి లైబ్రరీ వచ్చింది. చందమామ కథల్తో ప్రారంభించిన నేను త్వరలోనే పుస్తకాల పురుగునైపోయాను. బడిలో మా తెలుగు మాస్టారు వేయించిన సంస్కృత నాటకాలు, హిందీ నాటకాలు నాకు కొంత ఉచ్చారణాపటిమని, భాషా జ్ఞానాన్నీ ఇచ్చాయనుకుంటాను.

అతను నన్ను చూసేవేళకే ఇవన్నీ జరిగిపోయాయి.

పైకి చూడడానికి అమాయకమైన బాలికలా కన్పిస్తే నేనేం చెయ్యను? కొత్తలో హుషారుగా అతన్తో నా భావాలన్నిట్నీ పంచుకోవాలనుకునేదాన్ని.

"జీవితంలో పల్లకీ ఎక్కడం తప్ప మరో కోరికలేని, ఏమీ తెలీని అడివి మాలోకానివి, చెప్పినట్టల్లా వింటావు తోచినట్టల్లా మలుచుకోవచ్చు అనుకుంటే నువ్విలా కొరకరాని కొయ్యలా తయారయ్యావేంటి?" అనేవాడు. "నీ నాలెడ్జంతా నా దగ్గిర వొలకబొయ్యకు" అని ఈసడించుకునేవాడు.

ఎంతో ఇష్టపడి పెళ్ళి చేసుకుంటున్నాను అని చెప్పిన ఇతనిలో ఈ ద్వైదీ భావం ఏమిటో, ఈ అకారణ ద్వేషం ఏమిటో మొదట్లో నాకర్థమయ్యేది కాదు. కాని, అతను నా రూపాన్ని మాత్రమే ఇష్టపడ్డాడు తప్ప నన్ను నన్నుగా ప్రేమించలేదనీ, నా వ్యక్తిత్వాన్ని భరించలేక పోతున్నాడనీ త్వరలోనే అర్థమైంది.

చదువుకోడానికి ఒక్క పుస్తకమైనా దొరక్క విలవిలలాడి పోయేదాన్ని.

"అమ్మా, దీని చేత గిన్నెలు తోమించి పాచిపనంతా చేయించు, దీనికి పైత్యం ఎక్కువైంది" అనేవాడు హాస్యమాడుతున్నట్టు మొహంపెట్టి, అడవిబిడ్డలం అయిదేళ్ళ వయసు నుంచే పనులన్నిట్లో ఆరితేరతాం అని తెలీని వెర్రివాడు.

ఒకసారేం జరిగింది? - ఆదృశ్యం ఇప్పటికీ పచ్చిమాయక కళ్ళ ముందుకొచ్చి నన్ను గొప్ప అవమానాగ్నిలో దహించేస్తుంది. పెళ్లైన కొత్తల్లో మా అమ్మావాళ్ళనీ, మా ఊరినీ చూడాలని చాలా అన్పించేది. ఏకాస్త అవకాశం దొరికినా ఊరెళ్ళిపోయేదాన్ని. ఓసారి - నెమలి కన్నుల్ని తలపైన జుట్టుముడిలో అలంకరించుకొచ్చే కోయదొరమామ, మాకులంవాళ్ళ ఇళ్ళకి మాత్రమే యాచనకొచ్చే పొడపోతల తాత, ఆ తాత మొసుకొచ్చే దేశదేశాల కథలు కబుర్లు అన్నీ మరీ మరీ గుర్తుకొచ్చాయి. రెండు రోజులుగా ఇతనికి చెప్తున్నాను. ఆ రోజుల్లో మా ఊరికి ఇన్ని బస్సుల్లేవు. బస్తీ నుంచి రోజూ ఉదయాన్నే ఓ బస్సు ఉండేది. నేను తయారై ఉన్నాను. రాత్రి ఏదో పని మీద వెళ్తున్నానని బైటికెళ్ళిన అతనింకా ఇంటికి రాలేదు. నాకు ఆత్రం ఆగలేదు, నేనొక్కదాన్నే వెళ్ళలేనా!

సంచిలో ఒక జత బట్టలు పెట్టుకుని మా అత్తగారికి చెప్పి ఆ ఇంట్లోంచి బైటపడ్డాను. బస్టాండులో బస్సు వచ్చి ఇక ఎక్కుదామనుకునేంతలో అతనొచ్చాడు. రగిలిపోతున్న అతని ముఖాన్ని గమనించకుండా అతని దగ్గరకి పరుగెత్తాను. అంతే, పొడవైన నా జడని చేతికి చుట్టుకుని చెంపలు వాయగొట్టి ఈడ్చుకెళ్ళి రిక్షాలో కుదేసాడు. రిక్షా ఇల్లు చేరగానే కిందికిలాగి, కాళ్ళతో కుమ్మి...

మా ఊళ్ళో గ్రామ దేవతకి బలి ఇచ్చేవేళలో అమాయకమైన మేకపిల్ల ఎందుకలా వణికిపోతుందో నాకప్పుడర్థమైంది. "బరితెగించిన అడివి వేషాలు నా దగ్గిరెయ్యకు, చంపేస్తాను జాగ్రత్త" అన్నాడు.

"కుక్కని తీసుకొచ్చి సింహాసనం ఎక్కిస్తే ఏమవుద్దిమరి" అంది వాళ్ళమ్మ. నేనేం తప్పు చేసానోనాకర్థం కాలేదు.

అడవిలో పుట్టడం నాతప్పా? కట్టుబొట్టు నాగరీకతల్లో వీళ్ళతో సమానంగా ఉండకపోవడం నాతప్పా? బస్తీ బస్తీ అంటున్నారు, వీళ్ళ ఆలోచనలెందుకింత సంకుచితంగా ఉంటున్నాయి? మా ఊళ్ళో అయితే ఒక ఆడపిల్ల పుట్టింటి కెళ్ళడానికి ఎవరి అనుమతి తీసుకోనక్కర్లేదు. మావూళ్ళో మగవాళ్ళు మాట పట్టింపు కోసం ప్రాణాలు వదుల్తారు తప్ప ఇలా అకారణంగా ఎవర్నీ హింసించరు.

అనుకోకుండా తను విసిరిన కర్రతగిలి తను పెంచుతున్న గొర్రెపిల్ల కాలు విరిగితే మా పక్కింటి పుల్లిగాడు ఎంత ఏడ్చాడనీ!

ఇక ఆ ఇంట్లో ఉండడం నావల్లకాదనిపించింది. ఎవరికీ చెప్పకుండా మా ఊరి బస్సెక్కేసేను. దురదృష్టవశాత్తూ మా ఊరిని

అప్పుడప్పుడే బ్రాహ్మణ సంస్కృతి గుప్పెట్లోకి తీసుకుంటోంది. చిత్రంగా మా ఇంట్లో రాముల వారి ఫోటోలూ పూజలూ మొదలయ్యాయి. 'ఇష్టంలేని బతుకు ఎందుకు బతకాల' అని అందరికీ ధైర్యం చెప్పే మా అమ్మ రామాయణంలో సీతాదేవిని అత్తింటి కంపేటప్పుడు చెప్పిన నీతుల్ని వల్లించి 'కట్టమో సుకమో అక్కడే బతకాల' అని నన్ను వెనక్కి పంపించింది, మానాన్న వచ్చి ఇతన్ని కాళ్లూ కడుపూ పట్టుకుని బతిమలాడి నన్ను దిగబెట్టి వెళ్ళేడు.

ఇతడికి సొంతంగా గ్రాఫైటు మిల్లు ఉండేది. నిరంతరం అది కఠోరమైన చప్పుడు చేస్తూ రాళ్ళను పిండిగా చేస్తూ ఉండేది. మిల్లు కానుకొని ఇల్లు. నన్ను ఆ మిల్లుకి డ్రైవర్ని చేశాడు. డ్రైవరంటే ఏంలేదు – స్విచ్ ఆన్ చెయ్యడం, డబ్బులు వసూలు చెయ్యడం, రాళ్ళెత్తి పొయ్యడం, పొడర్ని బస్తాలకెత్తడం అన్నీ పని కుర్రాడు చంటి చూసుకొనేవాడు. బతుకు తెరువు వెతుక్కుంటూ వాడూ మా ప్రాంతం నించి వచ్చిన వాడే. పదిహేనేళ్ళ వాడు కష్టం చేసి డబ్బులు పట్టుకెళ్తే తప్ప వాళ్ళింట్లో అందరూ పస్తులుండే పరిస్థితి.

నేను యజమానురాల్ని, వాడు పనివాడు అన్నభేదం తప్ప సాయం కాలానికి ఇద్దరం నల్లని గ్రాఫైటు పొడరు తలనించి కాలిగోరు దాకా పట్టేసి చందమామ కథల్లో భూతాల్లా తయారయ్యేవాళ్ళం. మా పళ్ళు కళ్ళు మాత్రం తెల్లగా మెరుస్తుండేవి. ఒకళ్ళని చూసి ఒకళ్ళం పగలబడి నవ్వుకునేవాళ్ళం. ఆ నవ్వునీ బంద్ చేయించడానికి వీళ్ళకెంతో కాలం పట్టలేదు. పనోడితో నవ్వులేంటని ఇతడు నా మీద చెయ్యి చేసుకున్నాడు.

ఆ పొడరు ఊపిరితిత్తుల్లోకి పోకుండా నేను ముక్కుకి పైట కొంగు అడ్డం పెట్టుకునే దాన్ని, పాపం చంటికి కొన్నేళ్ళకి టి.బి. వచ్చేసింది. ఎప్పుడూ జ్వరంతో దగ్గుతూ ఉండేవాడు. అప్పటికి నా దగ్గరుండే కొద్దిపాటి చిల్లరా వాడి చేతిలో పోసేదాన్ని మందులు కొనుక్కోమని, క్రమంగా నీరసించిపోసాగేడు. ఆ తర్వాత పనిలోకి రాలేకపోయాడు. ఆపైన వాడూ వాడి కుటుంబం ఏమయ్యారో!

వెంటనే పని వాళ్ళు దొరక్క చంటి వేసే పని కూడా నేనే చెయ్యాల్సి వచ్చేది.

ఠక్…ఠక్…

గిన్నెలో జావ ఎప్పుడో అయిపోయింది. టీవీ తనంతటికి తను ఏదో పిచ్చి ప్రోగ్రామ్ని ప్రసారం చేసుకుంటోంది.

ఇప్పుడిక ఛానల్ మార్చి మరేదో సీరియల్ పెట్టాలి. మంచం మీది నుంచి కదలలేకపోతున్న ఇతనికి టి.వి. గొప్ప కాలక్షేపం అయిపోయింది. కాలకృత్యాల్తో సహా అన్నీ మంచం మీదే ఉండి చేయించుకుంటూ టీవీని చూస్తూ కాలాన్ని దొర్లించేస్తున్నాడు. తలలో నెర్వస్ సిస్టమ్ దెబ్బతినడంవల్ల స్క్రీన్ మీద పాత్రలు ఏడిస్తే తనూ ఏడుస్తాడు. వాళ్ళు నవ్వితే తనూ వెర్రిగా నవ్వుతాడు. అరచేతి నిండా ఆయుర్వేద తైలం పోసుకుని అతని కాలికీ చేతికీ చర్మంలోపలికి ఇంకేలా మర్దనా చేసాను. ఆవుపాలతో అతడికివ్వాల్సిన మందులన్నీ మింగించి, పనులన్నీ ముగించి, అతనికి దుప్పటి కప్పి, నేను నా మంచం మీద వాలేను.

బెడ్లైటు వెలుగులో పక్కకి తిరిగి అతన్ని పరిశీలించడం మొదలు పెట్టేను. నేనెప్పుడూ అతన్నింత పరిశీలనగా చూసిన గుర్తులేదు. మందుల ప్రభావం వల్లకాబోలు నోరు తెరిచి పెద్దగా గురక పెడుతున్నాడు. నిద్రలోనూ మూతపడని కన్ను నిశ్చలంగా చూస్తోంది. జబ్బువలన చెంపలు లోతుకుపోయి బైటికి చొచ్చుకొచ్చినట్టు కన్పిస్తున్న ముందుపళ్ళు, మొదట్నుంచీ నన్నేమాత్రం ఆకట్టుకోలేకపోయిన అతని వ్యక్తిత్వం –

ఏనాడైనా ఇతను నా జీవన సహచరుడనే తీయని భావం నన్ను అలుముకుందా? జీవిత మాధుర్యం నన్నెప్పుడైనా పలకరించిందా? ఇవాళ వెనక్కి తిరిగి ఆలోచించుకుంటే నేనెందుకు వీళ్ళకిలా అంకితమైపోయాను? జీతం బత్తెంలేని సేవకురాలినని వాళ్ళనుకున్నారు సరే, నాలోని ఏ పిరికితనం నన్నీ జీవితం నుంచి పారిపోకుండా పట్టి ఆపింది? నేను తినే గుప్పెడు మెతుకులు ఎక్కడ దొరకవని? అదేంకాదు, ఇక్కడ దొరికే సాంఘిక భద్రత కోసం నేనీ జైలుకి అంకితమైపోయాను. జీవిత కాలాన్ని చేజార్చుకున్నాను.

పిల్లలు పుట్టలేదనే నెపంతో మరో స్త్రీతో మరో ఇంట్లో కాపురం పెట్టాడని తెల్సినప్పుడు కూడా నాకు ఏ మాత్రం బాధకలగలేదు. ఒక గొప్ప రిలీఫ్ అన్పించింది. పాపం అక్కడా అతని ఆశ నెరవేరలేదు. 'ఇలాంటి మారెమ్మకి పిల్లలెలా పుడతార్రా' అంటూ నా మీద ద్వేషం కురిపించే ఇతని తల్లి తర్వాత ఆ మాట అనడం మానేసింది. చచ్చిపోయే ముందు నెల రోజులు మంచం మీద ఉన్నప్పుడు నా చేత సేవలు చేయించుకుంటూ ఆవిడ గొప్ప మార్పుకి లోనైంది. ఒక[illegible] హఠాత్తుగా నా చెయ్యిపట్టుకుని "అమ్మా, నా కొడుక్కి బోలెడంత కట్నం వచ్చేది, నీ మూలంగా అది తప్పిపోయిందనే కసితో నిన్ను కాల్చుకుతిన్నాను. అయినా ఇవేళ నువ్వు నాకిదంతా చేస్తున్నావు, నీ రుణం ఎలా తీర్చుకోను తల్లీ" అంది ఏడుస్తూ.

ఏదో మొక్కుబడిగా అయిష్టంతో నేను చేస్తున్న ఈ పన్లు ఈమెకింత ఊరట కల్గించడం నాకు ఆశ్చర్యమన్పించింది. అప్పుడే నాకు సేవలోని గొప్పతనం అర్థమైంది.

మనుషులెవ్వరూ పూర్తిగా చెడ్డవాళ్ళు కారనీ, మనుషులనైజాల్లో సహస్రముఖాలుంటాయనీ నేను చదివిన సాహిత్యం నాకెప్పుడో నేర్పింది. నేనూ నా నడవడికా కొందరికి మంచిగా అన్పించొచ్చు. మరికొందరికి నచ్చకపోవచ్చు. నాలో ఈ తల్లీ కొడుకులకి నచ్చనిదేదో ఉంది. ఈవిడ తెల్లవారి లేచి ఆ శరీరాన్ని తోమితోమి గంటలు గంటలు స్నానం, మరోకొన్ని గంటలు పూజలూ చేసేది. కాని, ఎంగిలి చేతిని కాకికి కూడా విదిలించి ఎరగదు. ఈమె పూజించిన దేవుళ్ళెవరూ ఈమెని మంచం పట్టకుండా కాపాడలేకపోయారు. ఈమె పూజలకి చేసిన ఖర్చులు, ఆలయాలకిచ్చిన చందాలు కలిపితే కొందరు అనాథలు హాయిగా బతికేసేవాళ్ళు.

ఇప్పుడు ప్రభుత్వ విధానమూ అలాగే ఉంది కదా! పల్లెల్లో జనం ఇంటి పన్ను, నీటి పన్ను, కరెంటు బిల్లు కట్టుకోలేక, చేద్దామంటే పనుల్లేక, కడుపునిండా తిండిలేక సతమతమౌతుంటే మండలానికో పాతిక లక్షలు శాంక్షన్ చేసి ఆలయాలు నిర్మిస్తారట. పాతిక లక్షలు చాలలేదని చందాలిమ్మని జనం మీద తప్పకుండా పడతారు కార్యకర్తలు. అప్పుడు కరువులో అధిక మాసం అన్నట్టవుతుంది. గ్లాసు నీళ్ళ కన్నా పెప్సీ–కోక్ చవగ్గా ఉంటున్నాయి జనానికి అలవాటయ్యేవరకూ.

ఠక్…ఠక్…

లేచి కూర్చున్నాను. అతడు మామూలుగా నిద్రపోతూనే ఉన్నాడు. అలవాటు ప్రకారం నిద్రలో చప్పుడు చేస్తున్నాడు.

ఇతని తల్లిపోయాక ఈ మధ్యకాలంలో నాకు దొరికిన తీరికతో వందలకొద్దీ పుస్తకాలు నేను ఎన్నుకున్న సాహిత్యం చదివే అవకాశం చిక్కింది. రేడియోకి, పత్రికలకి చిన్నచిన్న వ్యాసాలు రాయడం, సేవా సంస్థల్లో పని చెయ్యడం అలవాటైంది.

మనకి దొరికిన ఈ జీవితం ఏడ్వడానికి, అంతం చేసుకోడానికి కాదని నాకో గొప్ప నమ్మకం ఏర్పడింది. మనల్ని ప్రేమించే వాళ్ళనే ప్రేమించనీ, ప్రేమించకపోతే పోనీ - నువ్వు మాత్రం నిస్సహాయుల్ని ప్రేమిస్తూనే ఉండు. వివేకానందుడు చెప్పినట్లు స్మారకమందిరాల్లో తాజ్‌మహల్‌లాగా మానవ శరీరమే అత్యుత్తమ దేవాలయం.

కాంట్రాక్టు బిజినెస్ మొదలుపెట్టేక ఇతడు ఆర్థికంగా ఎదగడం మొదలు పెట్టేడు. ఆ డబ్బును ఎంజాయ్ చేస్తున్నాననుకుని అలవాట్లు పెంచుకున్నాడు.

రాజకీయ నాయకుల్తో స్నేహం, పార్టీలు, పార్టీకి ఫండ్సివ్వడం అంతా స్టేటస్ సింబల్ అనుకున్నాడు. అలవాట్లు ఒంటిని గుల్లచేస్తే, రాజకీయ పరిచయాలు ఇంటిని గుల్ల చేశాయి. ఇంకొన్నాళ్ళుంటే తన దగ్గరేం మిగల్చడనుకుందో ఏమో తనకి అందుబాట్లో ఉన్న బంగారం, డబ్బు తీసుకుని ఆమె ఇతన్ని వదిలేసి వెళ్ళిపోయింది. గత్యంతరం లేక తిరిగి ఇంటికొచ్చాడు.

బెల్లంతోపాటు చీమలూ మాయమయ్యాయి. అలవాట్లకి చిహ్నంగా శరీరంలో జబ్బులు మిగిలాయి. కోపం కోపం - మనిషి ఎప్పుడూ కోపంతో రగిలిపోతూ ఉండేవాడు. అది అతని శారీరక లక్షణం. అతని నైజం.

ఆ నైజమే ఉన్నట్టుండి దెబ్బకొట్టి మంచాన్నెక్కించింది.

ఉన్న ఇంటిని అమ్మి ఇతనికి వైద్యం చేయించవలసొచ్చింది. ఆ సమయంలో సేవాశ్రయం వాళ్ళు ఆదుకుని ఈ కాటేజ్‌ని ఇచ్చి ఉండక పోతే ఇవాళ నిలువ నీడలేకపోయేది. ఆశ్రమంలో నేను చేస్తున్న ఉచిత సేవలకి ప్రతిఫలంగా ఆశ్రమం వాళ్ళే మాకు కాస్త తిండి పెడుతున్నారు.

✣ ✣ ✣

సేవా సంస్థ కార్యకర్త నా మిత్రురాలు షరీఫా వచ్చిందో రోజు మా కాటేజ్‌కి. ఆమెకి నా జీవితం మొత్తం తెల్సు.

కొన్ని గంటలు నన్ను గమనిస్తూ ఉండిపోయింది -

"యుద్ధం మొదలయ్యేలా ఉంది" అంది హఠాత్తుగా "ఓ పక్క కరువు మరో పక్క యుద్ధం మధ్యతరగతి నుంచి అట్టడుగు వర్గాల వరకు మనిషి మనుగడ కష్టమైపోతుంది"

నేనేం మాట్లాడలేదు. ఏదో అడగాలని మరేదో అడిగి సంభాషణ మొదలుపెట్టడం షరీఫాకి అలవాటు, తర్వాత మాట్లాడబోయే విషయానికి నాందిగా పొంతనలేని ఇంకేదో విషయం మాట్లాడుతుంది. "అవునూ, అతను నీకేం చేశాడని నువ్వతనికంతగా సేవలు చేస్తున్నావు?"

"షరీఫా, ఈ ప్రశ్న మామూలు వాళ్ళు అడిగితే బావుండేది. సేవాశ్రమంలో ఎవరెలాంటివాళ్ళో తెలీకుండానే మనం వాళ్ళకి సర్వీసు చెయ్యడం లేదూ? ఇతన్నీ అలాగే అనుకుని నేనిదంతా చెయ్యగల్గుతున్నాను. మనిషి నిస్సహాయస్థితిలో ఉన్నప్పుడు ఆదుకోవాలని కదా మనం నేర్చుకున్నది" అన్నాను. "మనం జీవించడానికి కావాల్సిన ముఖ్యమైన లక్షణం జీవితం మీది ప్రేమ. ఇతరుల్ని జీవింప చెయ్యడానికి కావాల్సిన ముఖ్యమైన లక్షణం మనుషుల మీది నమ్మకం, జాలి, దయ, ప్రేమ. ప్రపంచాన్నీ మనుషుల్నీ నమ్మలేని ప్రేమించలేని స్థితి విషాదకరమైంది"

షరీఫా నా వైపు నిశ్చలంగా చూసిందో నిమిషం, ఆ చూపులో ఉన్నది జాలో, మెచ్చుకోలో నాకు తెలీలేదు.

తర్వాత మాటమాటా కూడదీసుకుంటూ అంది -

"ఈ లోకంలో అందరూ నీలా ఆలోచించగల్గితే దేశాల మధ్య అసలు యుద్ధాలేరావు"

**(2003 తానా కథల పోటీలో బహుమతి పొందిన కథ)** ❖

---

# మౌనహింస...

మందరపు హైమవతి



సంభాషణల్లో మర్యాదా తీరాలతిక్రమించడు
సంస్కార పరిధుల్ని ఉల్లంఘించడు
కానీ అదేమి జబ్బో
మాటలాడుతున్నంత సేపూ
మిఠాయిల మీద ముసురుతున్నట్లు
చూపులెప్పుడు అక్కడే
నిర్లజ్జగా నిర్మోహమాటంగా
... ... ...
అప్పుడు నాకు జ్ఞప్తికి వస్తాయి
ఐరావత ద్విపకుంభకుచకుంభ
పర్వతస్తని అని
ప్రబంధకవుల వర్ణనలు
పండితులకు తప్ప
... ... ...
పామరులకబోధంగదా
సహస్రాక్షుని నేత్రాల్లాటి
చూపుల్ని భరించలేక
ఎంత తప్పించుకోవాలనుకొన్నా
ఆదాయప్పన్ను లెక్కలో
అత్యవసర విధుల ధర్మాలో
అవసరాల కత్తులెపుడు
మెడ మీద వేలాడుతుంటాయి
... ... ...
నోటితో మాటలాడుతున్నా
చూపుల చేతులు
ఒంటి మీద బట్టల్ని చీలుస్తూ నగ్న శరీరాన్ని ఆబగా తడుముతుంటే

నిండుసభలో
నీచ దుశ్శాసనుడు
వస్త్రాపహరణం చేస్తున్నపుడు
ద్రౌపది అవమానాంతరంగం తలపుకొచ్చి
ఏ కాలం మారినా
స్త్రీల కాలం మారలేదనిపిస్తుంది
పదునైన శూలాల్లా
చురుకైన సూదుల్లా
చూపులు గుండెల్లో గుచ్చుకొంటుంటే
దీనికంటే
అత్యాచారమే నయం గదా
... ... ...
సమానత్వం సర్వత్రా నిషిద్ధమైనా
సమానంగా ఉద్యోగించడం
అవశ్యమైన ఆధునిక యుగంలో
నిర్బంధ మౌనహింస
నరాలు తెగిపోయే
ఒత్తిళ్ళ ప్రపంచంలో
క్షణక్షణ మరణాలు తప్ప
సహజ మరణాలెక్కడివి

వాళ
నిషి మీద మనిషికి
మ్మకం మరణించిన తర్వాత
క్కడైతేనేం - ఎప్పుడైతేనేం
న్ని బలహీనతలు - కొన్ని వ్యామోహాలు
ర్థం ముసుగు వేసుకొని
నుగ పంటలను పండిస్తాయి
క్తసిక్త దృశ్యాలై గజ్జెకడతాయి
అంతర్గత యుద్ధ రచనా రాజకీయం
ంపడమే సిద్ధాంతమనే తీవ్రవాదం
మాన్యుడ్ని గాయపరుస్తుంది.
మూహంలో అనాధ శవమై మిగులుతుంది
రక్త చారికల పర్వంలో
వరికో ఒకరు దూరమయి
వరికో ఒకరు కరువవుతారు
క్కు బిక్కుమనే కాలం అడుగుల మధ్య
ళ్ళు శేషంగా మిగిలిన అనాధ ముఖ చిత్రాలు
ళ్ళు చైతన్యం ఘనీభవించిన జీవచ్ఛవాలు
యం స్రవిస్తూనే వుంటుంది...
స్తూ బ్రతుకుతూ... బ్రతుకుతూ ఛస్తూ
టాడే శత్రువు గురించి కలవరం
ంటాడే గాయం గురించి కలవరం



# యుద్ధంకాని యుద్ధంలో...

బొల్లిముంత వెంకట రమణారావు

ఈ దాగుడుమూతల ఆట
రక్తపు ముద్దల సారాంశం పతాక శీర్షికయి వేధిస్తుంటే
గుండె చెరువవుతుంది...
మాట మూగపోతుంది...

యుద్ధంకాని యుద్ధంలో
చర్య ప్రతి చర్య మధ్యన
గెలిచిందెవరు? - వోడిందెవరు?
శవాలు శవాలుగా ప్రశ్నలు
అంతర్గత శత్రువును తరిమి తరిమి కొడతాయి

ఇప్పుడిక
శాంతి వచనం పల్లవిస్తుంది
స్వేచ్ఛ స్వాతంత్ర్య సాక్షిగా
సత్యం -శివం - సుందరం అని
చరిత్రలో సరికొత్త అధ్యాయం ఆరంభం

లుగు దిక్కుల్ని చూస్తున్న
ంగుల కాగితానికి
దురు బద్దను చీల్చి
మ్మ గమ్మును పులిమి
న్ను పూసలా అతికించా
ండంత తాపత్రయాన్ని వెల్లగక్కి
డ్డంగా మరో ఆధారాన్ని కూడా
కాశంలో పొడుచుకున్న
ంద్ర ధనుస్సులా!
నందపు పొగుల్ని పేని
రంగా మలిచి బంధించా
న్ను వీడి పోవద్దనే ప్రేమతో
ప్పుడే రెక్కలొచ్చిన పక్షిలా
డుతూ లేస్తూ పైకెగిరినపుడు
ధాతలా పొంగిపోయా
రి తప్పిన విహంగంలా నువ్వు
క్కులు చూస్తున్నప్పుడు
గుండె గదుల్లలో తచ్చాడుతున్న వ్యధ



# ప్రియమైన గాలిపటం

కటుకోఝ్వల రమేష్

నువ్వు గిరికీలు కొడుతూ
అడ్డదిడ్డంగా ఎగురుతున్నపుడు
క్రమ గమనం కోసం
కట్టిన ఆధారాలను
చేతితో లాగి చరకతో చుట్టి
తోకపెట్టి కన్నుకట్టి
మళ్ళీ అంబరంలోకి
సంబరంగా జారవిడిచినపుడు
గాలి వీచి గమ్యం తప్పి
చిటారు కొమ్మన చిక్కి
చిరుగు ముఖం పట్టి
అస్థిపంజరంలా
నువ్వు మిగిలినపుడు
సర్వం కోల్పోయిన దుఃఖం

# పుస్తక ప్రియులకు విందు భోజనం ప్రపంచ పుస్తక మహోత్సవం

**గుడిపూడి విజయరావు**

*"పుస్తకాల కోసం తరలివస్తున్న ఈ క్రిక్కిరిసిన జన సందోహాన్ని చూస్తుంటే ఈ రంగంలో నా మనుగడకు ఏమీ ఢోకా లేదన్న ధీమా కల్గింది."*

ఢిల్లీలో ఫిబ్రవరి 15-23 తేదీల్లో జరిగిన 16వ ప్రపంచ పుస్తక మహోత్సవాన్ని వీక్షించిన ఓ ప్రముఖ తెలుగు ప్రచురణ కర్త స్పందన ఇది. ప్రచురణ కర్తగా ఆయన అలా ఉత్సాహపడటం సహజమే. ఈ స్పీడుయుగంలో, ఎలక్ట్రానిక్ ఎంటర్‌టైన్‌మెంట్ ఆధిపత్యం చెలాయిస్తున్న రోజుల్లో పుస్తక పఠనం పట్ల ఆసక్తి సన్నగిల్లుతున్నదేమోనని ఆందోళన చెందుతున్న సాహిత్యాభిమానులకు ఈ పుస్తక మహోత్సవం అంతకు మించిన ఉత్సాహాన్ని కల్గించింది.

ప్రగతి మైదానంలో 8 సువిశాలమైన హాళ్ళలో 2000 స్టాళ్ళతో వారం రోజులపాటు జరిగిన ఈ మహోత్సవంలో 1210 మంది ప్రచురణకర్తలు పాల్గొన్నారు. మన రాష్ట్రంలో ఏటా విజయవాడలో జరిగే పుస్తక మహోత్సవంలో 250 స్టాళ్ళు, హైదరాబాద్‌లో జరిగే పుస్తక మహోత్సవంలో 200 స్టాళ్ళు ఉంటాయని గుర్తు చేసుకుంటే 16వ ప్రపంచ పుస్తక మహోత్సవం పరిమాణం తేలిగ్గా అర్థమవుతుంది.

భారతదేశం బహుభాషలు మాట్లాడే 100 కోట్ల జనాభా కల్గిన దేశం. బహుశా ప్రపంచంలో ఏ దేశంలోనూ లేని విధంగా 24 భాషల్లో ఇక్కడ పుస్తక ప్రచురణ జరుగుతున్నది. ఆంగ్ల భాషా ప్రచురణల్లో సైతం అమెరికా, ఇంగ్లాండ్‌ల తర్వాత భారత్‌దే అగ్రస్థానం. భారతదేశంలో ఏటా 70 వేల నూతన టైటిల్స్ ప్రచురించబడుతున్నాయి. వీటిలో 20 వేల టైటిల్స్ ఆంగ్ల భాషకు చెందినవే.

అలాంటి చోట ఈ భారీ పుస్తక మహోత్సవం చోటు చేసుకోవడం అంతగా ఆశ్చర్యం కల్గించే విషయం కాదు. 2003-04లో ఢిల్లీ నగరాన్ని 'ప్రపంచ పుస్తక రాజధాని'గా 'యునెస్కో' ప్రకటించిన సంగతి కూడా ఈ సందర్భంగా గమనార్హం. 'నేషనల్ బుక్ ట్రస్ట్' రెండేళ్ళకోమారు నిర్వహించే ఈ పుస్తక మహోత్సవం ఆఫ్రికా, ఆసియా ఖండాల్లో జరిగే పుస్తక ప్రదర్శనలన్నింటి కన్నా పెద్దది. 2002లో జరిగిన 15వ ప్రపంచ పుస్తక మహోత్సవంలో 23 దేశాల నుండి 1065 మంది ప్రచురణకర్తలు 1645 స్టాళ్ళలో పాల్గొన్నారు. ఆరున్నర లక్షల మంది పుస్తక ప్రియులు ఈ మహోత్సవాన్ని సందర్శించారు. ఇప్పుడు 16వ మహోత్సవం అంతకన్నా భారీగా జరిగింది. పుస్తకప్రియుల స్పందన కూడా బాగా పెరిగింది.

పాల్గొన్న వారిలో ప్రథమస్థాన
ఆంగ్ల ప్రచురణ కర్తలదే. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్
పెంగ్విన్, టాటా మెక్‌గ్రాహిల్, మనోహర్ లాం
ప్రముఖ ఆంగ్ల ప్రచురణ కర్తలతోపాటు, ప
అభ్యుదయ ప్రచురణకర్తలతో సహా మొత్తం 80
మంది ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు. ఆ తర్వా
స్థానం సహజంగా హిందీదే. 300 మం
ప్రచురణకర్తలు ఇందులో పాల్గొన్నారు. మూ
హాళ్ళలో ఆంగ్ల భాషా విభాగం ఉండగా, పిల్ల
విభాగం, హిందీ భాషా విభాగం, ప్రాంతీ
భాషా విభాగం వివిధ హాళ్ళల్లో ప్రత్యేకం
ఏర్పాటు చేయబడ్డాయి.

పుస్తక ప్రదర్శన తీరుతెన్నులి
ఉండగా, అక్కడి విశేషాలు అనేకం ఉన్నా
ఆరంభంలోనే చెప్పుకున్నట్లు అశేష జనం
ప్రదర్శనను సందర్శించడం అన్నింటికన
ముఖ్యమైన విశేషం. ఢిల్లీ బాలలు టి.వి
ఇంటర్నెట్‌ల కన్నా పుస్తక పఠనానికే అధ
ప్రాధాన్యతనిస్తున్నారన్న ఒక సర్వే వివరాల
'హిందుస్థాన్ టైమ్స్' పత్రిక ఈ రోజుల్లో
ప్రచురించింది. ఆ సర్వే అక్షర సత్యమని పుస్
మహోత్సవం రుజువు చేసింది. అయి
పాఠకులు తాము కొనుగోలు చేసే పుస్త
తమకు ఎంత ప్రయోజనకరం అన్న అంశా
బేరీజు వేసుకొనే ఎంపిక చేసుకుంటున్నా
కాలక్షేపం పుస్తకాల కన్నా, మేధస్సును పెం
కెరీర్ డెవలప్‌మెంట్‌కు దోహదపడే పుస్తకా
వైపే పాఠకులు మొగ్గు చూపుతున్నా
అందువల్లనే ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి, పెంగ్విన్ లాం
ప్రచురణకర్తల స్టాళ్ళు అన్నింటికన్నా అధికం
పుస్తకాభిమానులతో కిటకిటలాడిపోయాం




16వ ప్రపంచ పుస్తక మహోత్సవంలో ఓ హాల్ ముఖద్వారం

కొన్ని సమయాల్లో లోపలి వారు కొందరైనా బయటకు వచ్చే వరకు కొత్త వారిని అనుమతించలేదంటే ఆ స్టాళ్ళ వద్ద రద్దీని వూహించుకోవచ్చు. వ్యక్తిగత అవసరాల కోసం పుస్తకాలు కొనుగోలు చేసేందుకు, తిలకించేందుకు ప్రతి రోజు వేల సంఖ్యలో విచ్చేసిన పుస్తకాభిమానులకే కాదు, దేశం వివిధ ప్రాంతాల నుండి పెద్ద సంఖ్యలో తరలి వచ్చిన పుస్తక విక్రేతలకు కూడా ఈ పుస్తక మహోత్సవం వేదికయింది. తమకు కావలసిన పుస్తకాలను కొనుగోలు చేయడానికి, ప్రచురణ కర్తలతో సంప్రతింపులు జరిపి, అనుబంధాన్ని పెంపొందించుకోవడానికి ఈ మహోత్సవం వారికి అవకాశం కల్పించింది.

సమకాలీన అభ్యుదయ, మార్క్సిస్టు సాహిత్యానికి కూడా ఈ మహోత్సవంలో మంచి ఆదరణే లభించింది. లెఫ్టవర్డ్, బుక్స్‌ఫర్ ఛేంజ్, మాధ్యం, తులికా, కాళి ఫర్ వుమన్ లాంటి ప్రముఖ అభ్యుదయ ప్రచురణ కర్తలు ఈ మహోత్సవంలో పాల్గొనడమే దీనికి నిదర్శనం. మిగతావాటంత కాకపోయినా కళా, సాహిత్య ప్రచురణ కర్తలకూ మంచి ఆదరణే లభించింది. కథ, కేంద్ర సాహిత్య అకాడమి లాంటి ప్రచురణ సంస్థల స్టాళ్ళు కవులు, రచయితలు, సాహిత్యాభిమానులతో కళకళలాడాయి.

పుస్తక మహోత్సవంలో ఏ పుస్తకమయినా చూడటానికి ఆకర్షణీయంగానే ఉంది, కాని వాటి ధరలు మాత్రం సాధారణ, మధ్య తరగతి ప్రజలకు అందనంత ఎత్తున ఉన్నాయి. ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకునే కాబోలు డి.కె. పబ్లిషర్స్, డిస్ట్రిబ్యూటర్స్ లిమిటెడ్ వారు

..........★..........

**ఈ పుస్తక మహోత్సవంలో అన్నింటికన్నా ఆశ్చర్యం, ఆనందం కల్గించింది హిందీ భాషా విభాగం. హిందీ అనగానే హిందూత్వ గ్రంథాలు ప్రముఖ స్థానం వహిస్తాయని సహజంగానే భావిస్తారు. కాని హిందీ విభాగం ఆరంభంలోనే కారల్ మార్క్స్, ఫిడెల్ కాస్ట్రో, చేగువేరా చిత్ర పటాలతో అలంకరించిన స్టాల్ దర్శనమిచ్చింది. ఆరంభంలోనే కాదు లోపల సైతం ఈ ధోరణి కనిపించింది.**

..........★..........

ప్రత్యేకంగా 'లో ప్రైస్డ్ బుక్స్ ఫర్ ఆల్ ఒరిజినల్స్' అనే విభాగాన్ని ఏర్పాటు చేశారు. ఈ విభాగం ప్రచురించిన చరిత్ర, అర్థశాస్త్రం, లింగ్విస్టిక్స్ లాంటి ప్రామాణిక సామాజిక శాస్త్ర గ్రంథాలు అత్యధికం రు.50 నుండి 100కే లభిస్తున్నాయి. న్యూఢిల్లీకి చెందిన స్వాబ్ పబ్లిషర్స్ సంస్థ దాదాపు పూర్తిగా వంటల పుస్తకాలనే ప్రచురించడం మరొక విశేషం. పిల్‌గ్రిమ్స్ బుక్‌హౌస్ అనే సంస్థ కేవలం తీర్థయాత్రీకులకు ఉపయోగపడే గ్రంథాలనే ప్రచురించడం ఆసక్తికరమైన అంశం. ఈ సంస్థ వారణాసిలో ఓ రెస్టారెంట్‌ను కూడా నిర్వహిస్తున్నది. "దేవుని కృపతో లభించిన పదార్థాలంటూ" వాటికి ఆకాశాన్నంటే ధరలు వసూలు చేస్తుంది. ఉదాహరణకు అక్కడ ఒక టీ ధర యాభై రూపాయలు మాత్రమే.




పుస్తక మహోత్సవంలో 'ఎమెస్కో' విజయకుమార్, 'ప్రజాశక్తి బుక్‌హౌస్' విజయరావు, శ్రీనివాస్

దేశంలో నెలకొన్న ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా హిందూ మతోన్మాదాన్ని ప్రేరేపించే ప్రచురణలు కూడా పుస్తక మహోత్సవంలో గణనీయంగానే కనిపించాయి. అయితే ముస్లిములను ద్రోహులుగా చిత్రించిన గ్రంథాలు ఆ పక్కనే ఇస్లామును బోధించే గ్రంథాలు కూడా కనిపించడం ఓ విశేషం. ఓషోలాంటి వక్రమార్గపు రచనలను ప్రదర్శించిన స్టాల్స్ కూడా సాధారణ ప్రజలకు భిన్నమైన విచిత్ర వ్యక్తులతో సమ్మర్దంగా కనిపించాయి.

ఈ పుస్తక మహోత్సవంలో అన్నింటికన్నా ఆశ్చర్యం, ఆనందం కల్గించింది హిందీ భాషా విభాగం. హిందీ అనగానే హిందూత్వ గ్రంథాలు ప్రముఖ స్థానం వహిస్తాయని సహజంగానే భావిస్తారు. కాని హిందీ విభాగం ఆరంభంలోనే కారల్ మార్క్స్, ఫిడెల్ కాస్ట్రో, చేగువేరా చిత్ర పటాలతో అలంకరించిన స్టాల్ దర్శనమిచ్చింది. ఆరంభంలోనే కాదు లోపల సైతం ఈ ధోరణి కనిపించింది. జనరల్ బుక్స్ ప్రచురించే సంస్థలు కూడా అభ్యుదయ, మార్క్సిస్టు సాహిత్యాన్ని విశేషంగా ప్రచురిస్తున్నాయి. ప్రేంచంద్, బీష్మ సహానీ లాంటి అభ్యుదయ రచయితల గ్రంథాలే కాదు చిత్రపటాలు కూడా ప్రముఖంగా ప్రదర్శించబడ్డాయి. మాక్సింగోర్కి, లూసన్, నెరుడా లాంటి ప్రపంచ సాహితీ వేత్తల రచనలు సైతం హిందీ భాషలో అధికంగా ప్రచురితమవుతున్నాయి. అన్నా లూయీ స్ట్రాంగ్ ఏభై ఏళ్ళ నాటి రచన 'స్టాలిన్ యుగం' హిందీ అనువాదాన్ని 2004 జనవరిలో ప్రచురించగా విశేషంగా అమ్ముడుపోతున్నదని ఆ ప్రచురణ కర్తలు చెప్పారు. కంచ ఐలయ్య 'నేను హిందువునెట్లయిత' హిందీ అనువాదం వెలువడటం కూడా ఓ ఆసక్తికరమైన అంశం. అంబేద్కర్, పూలే లాంటి వారి దళిత సాహిత్యం కూడా హిందీ భాషలో విపరీతంగా వస్తున్నది. హిందీ ప్రచురణ రంగంలో కన్పించిన ఈ ధోరణులు అభ్యుదయవాదులకు ఎంతో ఉత్సాహాన్నిచ్చేవిగా ఉన్నాయి. అయితే హిందీ పుస్తకాల ధరలు మాత్రం కాస్త అధికంగా ఉన్నాయన్న భావం వ్యక్తమవుతున్నది.

పుస్తక ప్రచురణరంగంలో ఇటీవల కాలంలో చోటు చేసుకున్న ఓ ప్రధాన పరిణామాన్ని తప్పనిసరిగా పేర్కొనాలి. కంప్యూటర్లు, సిడిలు, ఇంటర్నెట్ లాంటి ఐ.టి. రంగం, పుస్తక ముద్రణారంగం పూర్తిగా వేర్వేరని, పరస్పరం పోటీపడేవని కూడా భావిస్తుంటాము. కాని ఈ సాధారణ భావనకు భిన్నంగా ఈ రెండు ప్రక్రియలను మిళితం చేసిన

ధోరణి వ్యక్తమయింది. న్యూఢిల్లీకి చెందిన ఎకడమిక్ ఫౌండేషన్ అనే ప్రచురణ సంస్థ భారత పంచవర్ష ప్రణాళికలు, లేబర్ కమిషన్ నివేదికలు లాంటి వాటిని పుస్తకం, సి.డి.తో కలిపి ప్రచురిస్తున్నది. ఉదాహరణకు పది పంచవర్ష ప్రణాళికా పత్రాల సారాంశం పుస్తకం రూపంలోను, పూర్తి వివరాలు సి.డి.లోను ప్రచురించి ఎక్కువ మందికి అందుబాటులో ఉండే ధరలకే సరఫరా చేస్తున్నది. ఈ పత్రాలను పూర్తిగా పుస్తక రూపంలోనే సమకూర్చుకోవాలంటే వాటిని నిల్వ చేయడానికి ఓ పెద్ద గదే అవసరమవుతుంది. అలాంటి దాన్ని కేవలం ఓ పుస్తకం, సి.డి. రూపంలో అందించడం విశేషం. ఎల్సెవియర్ అనే సంస్థ మెడికల్ గ్రంథాలను సి.డి.తో కలిపి ప్రచురిస్తున్నది. అయితే ఈ సి.డి. ద్వారా ఆ పుస్తకాన్ని, సంబంధిత వెబ్‌సైట్‌కు అనుసంధించుకోవచ్చు. వెబ్‌సైట్ ద్వారా ఈ పుస్తకం ఎప్పటికప్పుడు కొత్త సమాచారంతో, విశ్లేషణలతో తాజా పరచబడటం దీనిలోని విశేషం. స్కూలు బ్యాగ్ బరువును తగ్గించడానికి కొన్ని పాఠ్యగ్రంథాలను సి.డి. రూపంలో అందించే సంస్థలు, పూర్తిగా సి.డి.లు, కంప్యూటర్ పుస్తకాలు ప్రచురించే సంస్థలు కూడా గణనీయంగానే పుస్తక మహోత్సవంలో కన్పించాయి. డి.కె. లాంటి సంస్థ తన వెబ్‌సైట్ ద్వారా పాఠకులకు, ప్రచురణ కర్తలకు సంధానకర్తగా ఉండి పుస్తకాలు సరఫరా చేస్తున్నది. ఆంగ్ల, హిందీ భాషలతోపాటు బెంగాలీ తెలుగు లాంటి ప్రాంతీయ భాషా గ్రంథాలను కూడా ఇలా అందిస్తుంది.


**ఈ పుస్తక మహోత్సవానికి మకుటంగా ఉన్న థీం స్టాల్లో 'అన్నీ వేదాల్లోనే ఉన్నాయి' అన్న రీతిలో అనేక ఆధునిక శాస్త్ర పరిశోధనలు భారతదేశంలో క్రీస్తుకు పూర్వమే జరిగాయని చెప్పే ప్రయత్నం జరిగింది. అసలు ఈ పుస్తక మహోత్సవాన్నే వేదమంత్రోచ్ఛారణతోను, సరస్వతీ వందనంతోను ఎన్.బి.టి. ప్రారంభించింది. ప్రస్తుత పాలకులు విద్యారంగంలోను, సాంస్కృతిక రంగంలోను ప్రవేశపెడుతున్న అవాంఛనీయ ధోరణులు ఇక్కడ కూడా వ్యక్తం కావడం దురదృష్టకరం.**


పుస్తకాభిమానుల్లో ఇంతగా ఆసక్తిని రేకెత్తించి, ఆనందం పంచిన ప్రదర్శన ప్రపంచ పుస్తక మహోత్సవం అయినప్పటికీ ప్రముఖ అంతర్జాతీయ ప్రచురణ కర్తలెవరూ పాల్గొనకపోవడం అసంతృప్తి కల్గిస్తుంది. విదేశాల నుండి వచ్చి పాల్గొనే వారి సంఖ్య గత ప్రదర్శన కన్నా తగ్గిపోయింది. ప్రపంచ బ్యాంకు, యునెస్కో, ఐ.ఎల్.ఓ. లాంటి సంస్థలతోపాటు పాకిస్తాన్, బంగ్లాదేశ్, శ్రీలంక, నేపాల్‌లాంటి దక్షిణాసియా దేశాలు, కొన్ని అరేబియా దేశాలు మాత్రమే పాల్గొన్నాయి. జర్మనీ, ఫ్రెంచి భాషా ప్రచురణ సంస్థలు కొన్ని ఉన్నప్పటికీ అవేవీ ప్రధానమైనవి కావు. అందువల్ల ఇది వాస్తవానికి భారత పుస్తక మహోత్సవం మాత్రమే.

ప్రాంతీయ భాషా విభాగంలో రాష్ట్ర తెలుగు పబ్లిషర్స్ అసోసియేషన్, విజయవాడ బుక్‌ఫెస్టివల్ సొసైటీలు స్టాల్స్ నిర్వహించాయి. ఆ స్టాల్స్‌లో ప్రదర్శించిన పుస్తకాలలో తెలుగు ప్రచురణ రంగం ఇంత నాసిరకంగా బాల సాహిత్యం, పర్సనాలిటీ డెవలప్‌మెంట్, జోతిష్యం, వాస్తు లాంటి గ్రంథాలే ప్రముఖంగా కనిపించాయి. సమకాలీన రాజకీయ సమస్యలపై ప్రచురించబడిన ఒక్క తెలుగు పుస్తకం కూడా ప్రదర్శనకు నోచుకోలేదు. ఇదొక లోపం.

ఈ పుస్తక మహోత్సవానికి మకుటంగా ఉన్న థీం స్టాల్లో 'అన్నీ వేదాల్లోనే ఉన్నాయి' అన్న రీతిలో అనేక ఆధునిక శాస్త్ర పరిశోధనలు భారతదేశంలో క్రీస్తుకు పూర్వమే జరిగాయని చెప్పే ప్రయత్నం జరిగింది. అసలు ఈ పుస్తక మహోత్సవాన్నే వేదమంత్రోచ్ఛారణతోను, సరస్వతీ వందనంతోను ఎన్.బి.టి. ప్రారంభించింది. ప్రస్తుత పాలకులు విద్యారంగంలోను, సాంస్కృతిక రంగంలోను ప్రవేశపెడుతున్న అవాంఛనీయ ధోరణులు ఇక్కడ కూడా వ్యక్తం కావడం దురదృష్టకరం.

పుస్తక మహోత్సవం జరిగిన ఏడు రోజులపాటు అదే ప్రాంగణంలోని వివిధ హాళ్ళలో పుస్తక ప్రచురణలపైన, వివిధ సామాజిక, సాహిత్య అంశాలపైన సెమినార్లు నిరంతరం జరుగుతూనే ఉన్నాయి. నోబెల్ బహుమతి గ్రహీత వి.ఎస్. నయిపాల్, సంచలన రచయిత్రి తస్లీమా నస్రీన్, రస్కిన్ బాండ్ లాంటి లబ్ధ ప్రతిష్టులు అనేక మంది ఈ సెమినార్లలో పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ నుండి ప్రముఖ కవి కె. శివారెడ్డి లాంటి వారు కూడా పాల్గొన్నారు. ఈ మహోత్సవం సందర్భంగా అనేక పుస్తకాలను మాజీ ప్రధాని ఐ.కె. గుజ్రాల్, ఇతర ప్రముఖులు ఆవిష్కరించారు. అయితే ఏ పుస్తకాన్నయినా ముందుగా అనుమతి పొందిన తర్వాతనే ఈ మహోత్సవంలో ఆవిష్కరించాలన్న ఎన్.బి.టి. నిబంధనతో అనేక పుస్తకాలు ఆవిష్కరణకు నోచుకోలేదు.

మొత్తంగా ఈ పుస్తక మహోత్సవం పుస్తక ప్రియులకు ఎంతో ఆనందాన్ని, ఉత్సాహాన్ని ఇచ్చింది. పుస్తక పఠనాభిలాష తగ్గకపోగా, మరింత పెరగటం, అంతే కాకుండా అభ్యుదయ సాహిత్యానికి ఆదరణ అధికమవడం స్ఫూర్తిదాయకం.



హిందీ విభాగంలో దేశ, విదేశీ అభ్యుదయ, మార్క్సిస్టు సాహిత్యాన్ని ప్రదర్శించిన ఓ స్టాల్





మీనాక్షి శ్రీనివాస్



# "విన్యాసం"

ఆ వీధిలోకి టర్న్ తీసుకోగానే లీలగా వినబడిన ఆ మృదంగనాదం అప్రయత్నంగానే నా స్కూటర్ స్పీడును తగ్గించింది.

ఒళ్ళు ఝల్లు మనిపించే మృదంగలయ విన్యాసం. అది లయ విన్యాసంలా లేదు ప్రచండ ఝంఝూ మారుతంలా, పరమశివుడి తాండవ నృత్య సంగీతంలా ఉంది.

అందులోని మార్దవం మైమరపిస్తున్నా... అందులోని అంతర్గత ఆవేశం భయపెడుతోంది.

అంతకు ముందు ఒకటి రెండుసార్లు ఆ మృదంగనాదం విన్నాను. బాగుంది ఎవరో చాలా బాగా వాయిస్తున్నారు. అనిపించిందే తప్ప పెద్దగా దాని గురించి ఆలోచించలేదు, పట్టించుకోలేదు.

ఆలోచిస్తూనే అలవాటుగా యిల్లు చేరానని నా శ్రీమతి ప్రశ్నతోగానీ గుర్తు రాలేదు.

ఏమిటంత దీర్ఘ ఆలోచనలో పడిపోయారు" ఘుమ ఘుమలాడే కాఫీ కప్పుతో ప్రత్యక్షమైంది శ్రీమతి నా ఆలోచనలను చెదరగొడుతూ "మధూ - ఆ మృదంగం ఎవరు వాయిస్తున్నారంటావ్... చాలా బాగుంది కానీ ఎంతో ఆవేశం... ఆవేదన కలగలిపినట్లు లేదూ" కాఫీ అందుకుంటూ అడిగాను.

"ఏమో రసజ్ఞులు, రచయితలూ అవన్నీ మీకే తెలియాలి నాకయితే రోజూ ఈ వేళకి అదో మోత... తలపోటు అసలూ సౌండ్ పొల్యూషన్ కింద పోలీసు కంప్లయింట్ యిద్దమనుకుంటున్నా" చిరాగ్గా అంది మాధవి.

"అంత పని మాత్రం చెయ్యకు - అయినా యజ్ఞ శాస్త్రిగారి ఏకైక 'మేకో'వి కదా ఆ మాత్రం ఈ మాత్రం సంగీత సాహిత్యాభిలాషా పరిజ్ఞానం ఉండకపోతాయా అనీను, అందమైన విగ్రహంలో అంతకన్నా అందమైన కళాత్మకమైన హృదయం, మల్లెలాంటి మనసూ ఉండకపోతుందా అనిన్నూ... సూదంటు రాయిలా లాగేస్తే అవేవీ తెలుసుకోకుండా తాళికట్టే తలంబ్రాలు పొయ్యడం నాది... నాది బుద్ధి తక్కువ "ఎంత వేళాకోళంగా అందామనుకున్న నా గొంతులో రవ్వంత నిరాశ.

"బానే వుంది సంబడం. అయిపోయిన పెళ్ళికి బాజాలన్నట్లు ఇన్నేళ్ళకు ఇన్నాళ్ళకు యిప్పుడనుకుని ఏం లాభంగానీ... నే సీరియస్‌గానే చెబుతున్న వేళాపాళా లేకుండా ఎప్పుడంటే అప్పుడు గుండెల్లో గాబరా పుట్టేలా ఆ గోలేమిటో, అర్ధరాత్రి మద్దెల దరువన్నట్లుగా ఆ భాజా భజంత్రీలేమిటో, మీకేం మీరు పొద్దస్తమనం హాయిగా ఆఫీసులో కూర్చుంటారు" విసురుగా సాగే ఆ వాగ్ధోరణికి ఆనకట్ట వేయకపోతే అది అలా అవిశ్రాంతంగా

ఎలా సాగిపోతుందో తెలిసిన నేను...

"అవును మధూ... అది సరే గానీ ఈ రోజు షాపింగ్‌కు వెళదాం త్వరగా రండి అన్న దానివి... యింకా తయారు కాకుంటే ఎలా... త్వరగా తయారవు... మళ్ళీ పిల్లలొచ్చేస్తారు" టాపిక్ డైవర్ట్ చేసా, "ఇదిగో చిటికెలో వస్తా... ఈ లోపుగా మీరు కాస్త ఫ్రెష్ అవండి" లోపలికెళ్ళింది మాధవి.

అప్రయత్నంగానే వెలువడింది. నాలో ఓ వేడి నిట్టూర్పు "ప్చ్" అంటూ. సంగీతం సాహిత్యం నా ఆరోప్రాణాలు... అవంటే యిష్టం మాట దేముడెరుగు తనకు చాలా చిన్న చూపు. పెళ్ళయిన మొదట్లో ఆ విషయం తలచుకునేందుకే నరకప్రాయంగా ఉండేది తనకు, యిప్పుడిప్పుడే సర్దుకుపోవడం, పట్టించుకోకపోవడం... తద్వారా ప్రశాంతంగా ఉండటం నేర్చుకొంటున్నా ఏ మాటకామాటే చెప్పుకోవాలి. ఒక్క సంగీత సాహిత్యాల విషయంలోనే మా ఆవిడ లేడీ ఔరంగజేబు. కానీ మిగతా అన్ని విషయాల్లో మాత్రం ఆదర్శపత్ని.

"ఏమిటీ అలా నిల్చునే ఆలోచనల్లో పడ్డారా అందుకే నాకు కళాకారులన్న కళలన్నా తగని ఒళ్ళుమంట - ఎక్కడ లేని సమయాన్ని భావుకతకే తగలేస్తారు, ప్రాక్టికాలిటీ యిసుమంతైనా వుండదు" జరీ చీర అంచులు సవరించుకుంటూ వచ్చింది శ్రీమతి.

ఆవిడ దృష్టిలో ఏ కళ అయినా వేస్ట్. ఈ పోటీ ప్రపంచంలో బతకడం చేతకాని వాళ్ళు ప్రతి సెకనుకీ వెలకట్టి సంపాదించడం చేతకాని వాళ్ళు మాత్రమే యిలా భావుకత. కళ.. కాకరకాయ అంటారు.

"ఏమిటి బెల్లం కొట్టిన రాయిలా ఉలకరు.. పలకరు... మళ్ళీ మనసు ఎటో వెళ్ళిపోయిందా" దీర్ఘం తీసింది మాధవి.

"సర్లే పద యింకా లేట్ అవుతుంది."

ఆవిడతో వాదించడం, ఆవిడను ఒప్పించడం యిసకపిండి తైలం తియ్యడం లాంటిదేమరి.

"ఎక్కడికొచ్చినా మీరు మీ ఆలోచనల్లోంచి మీ ప్రపంచంలోంచి బయటకు రారా....? ఖంగుమన్న మాధవి కంఠం నన్ను నా ఆలోచనలల్లోంచి యివతల పడేసింది.

"అబ్బే... లేదు... లేదు ఆలోచన లేదు... ఏం లేదు ఆ షోకేసులో ఉన్న చీరలు చూస్తున్నా చాలా బాగున్నాయి కదూ... తీసుకుందామా" కంగారుగా అడిగా

"నాకు తెల్సులే" అన్నట్లు నవ్వింది మాధవి.

పట్టుబడ్డ దొంగలా నేనూ నవ్వాను.

◇◇◇

ఆ తర్వాత వీలు చిక్కినప్పుడల్లా ఆఫీసు నుంచి త్వరగా రావడం మొదలు పెట్టాను. ప్రతి రోజూ కాకపోయినా తరచూ ఆ మృదంగ వాద్యగోష్టి జరుగుతూ ఉండేది. అందులో ఉన్న డెప్త్ నన్ను కదిలించేది. ఆ వాద్యకారుడిని చూడాలన్న కోరిక నాలో రోజురోజుకీ పెరిగిపోయింది.

ఆ రోజు...

ఆఫీసు నుంచి వచ్చేసరికి మాయింటికి తాళం వేసి ఉంది. సాధారణంగా నేను ఆఫీసు నుంచి వచ్చే టయిముకు మా మాధవి ఎక్కడకు వెళ్ళదే. తనకు కానీ పిల్లలకు కానీ ఏదైనా సుస్తీ చేసిందా.. ఏమై ఉంటుందీ...

యింతలో... "అంకుల్" పక్క యింటి అబ్బాయి చింటూ వచ్చాడు.

"అంకుల్... మాధవీ ఆంటీ ఫోను చేశారు బబ్లూ వాళ్ళ క్లాసులో అబ్బాయికి స్కూలు నుంచి వెళుతుంటే మన వీధి చివర్లో ఆటో గుద్దేసిందిట హాస్పిటల్‌కు తీసుకెళ్ళారట. ఆ హడావుడిలో తాళం చెవి యివ్వడం మరచిపోయాననీ, మీరొస్తే మా యింట్లో కూర్చోమన్నారు....

యిదే మంచి తరుణం ఎటూ మాధవి యింట్లో లేదు కాబట్టి నాకు నచ్చిన, తను మెచ్చిన ఆ మృదంగ వాద్య కారుడిని చూడటానికి...

"ఏంటంకుల్... ఆగిపోయారేం... రండి" కాస్త కాఫీ అయినా తాగి వెళుదురుగాని అమ్మ రమ్మంది" వాళ్ళ అమ్మగారు చెప్పమన్న చిలక పలుకులు వల్లించాడు చింటూ. 'లేదురా నానీ నాకు అర్జంటు పని ఉంది కానీ ఇదిగో చాక్‌లెట్ తీసుకో 'బబ్లూ కోసం తెచ్చినది వాడి చేతిలో పెట్టా. వాడు మొహమాటంగా అందుకున్నాడు 'వద్దంకుల్' అంటూనే. నేను ఉత్సాహంగా గబగబా ఆ వాద్యం వినబడే దిశగా వెళ్ళాను. రెండు మూడు యిళ్ళవతలకు వెళ్ళానేగాని ఎలా వెళ్ళాలో ఏ యింట్లో నుంచి ఆ వాద్యం వస్తుందో ఎవరిని అడగాలో అర్థం కాక నిలబడిపోయా. అక్కడే అరుగుమీద పడక కుర్చీలో కూర్చున్న ఓ పెద్దాయనను చూసాను. కులాసాగా పేపరు చదువుకుంటున్నాడు.



"ఇక్కడ ఎవరో మృదంగం..."

మాట పూర్తవకుండానే పక్కింటివైపు చూపించాడు.

"థాంక్స్" అంటూ ఆ వైపు నడిచాను. తలుపులు తీసే ఉన్నాయి.

"ఎవరండీ లోపల?" గట్టిగా పిలిచాను గుమ్మం యివతల నుండీ.

"మీరెవరండీ అవతల" గడుసుగా అడిగిందో అమ్మాయి.

"ఇక్కడెవరో మృదంగం వాయిస్తారు కదా... వారిని కలవాలని వచ్చాను. ఆయన యిల్లు యిదేనా?" సందిగ్ధంగా అడిగాను.

"యిల్లు ఆయనది కాదు ఆయన అద్దెకుంటున్నారు" మళ్ళీ అదే గడుసుదనం. జవాబిస్తూనే బయటకొచ్చిందో అమ్మాయి. సుమారు ఓ పాతికేళ్ళ వయసుంటుందేమో.. నాజూగ్గా అందంగా ఉంది.

"రండి లోపలికి.. అన్నయ్యకోసమా" లోపలికి దారితీస్తూ అంది.

మరీ పరిచయం లేనిచోట అలా లోపలికి వెళ్ళనా లేక వద్దా అనుకుంటూ తటపటాయిస్తున్న నన్ను.

"ఫర్వాలేదు... రండి లోపలికి అన్నయ్య పడుకున్నాడు చూద్దురుగాని" అంటూ లోపలికి తీసుకెళ్ళింది.

"పడుకున్నారు... ఈ వేళప్పుడు... ఒంట్లోబాగాలేదా?" అడిగాను.

"లేదు సెడేటివ్‌లో ఉన్నాడు" నిర్లిప్తంగా చెప్పిందా అమ్మాయి.

అదిరిపోయాను ఆ జవాబుకి. అదేమిటి అంత చక్కటి కుర్రాడికి సెడేటివ్ యిచ్చి నిద్ర పుచ్చారు. అంటే కొంపదీసి మెంటల్

షాక్ ఏదైనా తగిలిందా. ఆ మాట అనుకోగానే గుండె ఝల్లుమంది.

"మీరెవరో నాకు తెలియకపోయినా ఎందుకొచ్చారో తెలుసు అన్నయ్య మృదంగ విన్యాసమే మిమ్మల్నిలా తీసుకొచ్చింది.

కాస్తోకూస్తో సంగీతాభిమానం ఉన్న వారెవరైనా చేసేపనే అది.

"ఉండడి కాఫీ తెస్తా"... మాట మధ్యలో ఆపేసి లేచింది బహుశా తన దుఃఖం నేను చూడకూడదనేమో.

"అయ్యోయ్యో... అదేం వద్దు... నేను..."

"ఇప్పుడే తెస్తా... ఉండండి" గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

ఆ అబ్బాయి కేసి పరిశీలనగా చూసాను. సూదంటురాయిలా ఆకర్షించే అందమైన విగ్రహం.. చిన్నవాడేగా అంత సెడెటివ్ యిచ్చి నిద్ర పుచ్చాల్సినంత ప్రాబ్లమ్ ఏమిటో... బహుశా లవ్ ఫెయిల్యూర్ ఏవో... అందుకే అంత ఆవేశం... అంత విషాదం చోటు చేసుకున్నయేమో ఆ వాద్యంలో ఏమో... అంతకంటే యిప్పుడు మనం వింటున్న కొత్త విషయాలూ వింతలూ ఏముంటున్నయి గనక... ప్రేమించడం... అది గనక ఫెయిల్ అయితే తట్టుకోలేక అనర్థాలు. ఉసూరుమంది ప్రాణం. అంత చక్కటి లయవిన్యాసం వెనకనున్న కథ అంత సాదాసీదా ప్చ్... అంతలోనే నవ్వొచ్చింది... అసలు వాళ్ళెవరో... ఏమిటో కనుక్కుందామని వచ్చిన నన్ను నాలోని రచయిత ఏం జరిగి ఉంటుందో ఊహించి అల్లడానికి తాపత్రయపడిపోతున్నాడు. ఏమైనా వీళ్ళు ఈ ప్రాంతం వాళ్ళు కారు. ఆ అమ్మాయి మాట్లాడేది తెలుగే అయినా అది యిక్కడి మాండలీకం కాదు బహుశా నెల్లూరు... అనంతపురం అటువైపు వాళ్ళేమో...



◇◇◇

"కాఫీ తీసుకోండి... ఏమిటీ మా గురించే ఆలోచిస్తున్నట్లున్నారూ..."

"హలో... సార్ ప్లీజ్ తీసుకోండి" మళ్ళీ పిలిచిందా అమ్మాయి.

"ఆ..ఆ.. థాంక్స్... మీ పేరు..." అందుకుంటూ అన్నాను.

"మహతి" మెల్లిగా అంది.

అబ్బ మహతి నారదుడి తంబుర పేరు... ఎంత బాగా పెట్టారు బహుశా వీళ్ళది సంగీత కుటుంబమేమో అందుకే అంత గొప్పదనం కనబడుతోంది వాళ్ళలో.

"సర్" మళ్ళీ మెల్లిగా పిలిచింది మహతి.

"నేను... మీ యింటికి రెండిళ్ళవతల యింట్లో ఉంటాను... నేను ఇక్కడి టెలికాం ఆఫీసులో అకౌంట్స్ ఆఫీసర్‌గా చేస్తున్నాను. నేనూ మా శ్రీమతి మాధవి... ఒక్క కొడుకు బబ్లూ, ఓ పాప అదీ మా కుటుంబం. నాకు సంగీతం సాహిత్యం అంటే పంచప్రాణాలు... వీలయినంత వరకూ ఎక్కడ ఏ ప్రోగ్రాం జరిగినా చూస్తుంటాను... వింటుంటాను".

"మరి మీరు "బాల మురళి" అనే ఓ యువకుడి శాస్త్రీయ సంగీతం ఆడియో కెసెట్స్ వినలేదా సుమారు ఐదారు సంవత్సరాలు మొత్తం భారతదేశాన్ని తన సుస్వరాలాపనతో, వినూత్న శాస్త్రీయ శైలితో ఆకట్టుకుని ఎందరో సంగీత సామ్రాట్‌ల ఆశీస్సులందుకుని రెండేళ్ళ ముందట తన స్వరాన్ని శాశ్వతంగా కోల్పోయిన ఆ అభాగ్యుడి గురించి మీడియా చాలా కవరేజ్ యిచ్చింది..." ఆ అమ్మాయి కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"మైగాడ్... బాల మురళీ... అతి చిన్న వయసులో అతి తొందరగా జాతీయ స్థాయి గాయకుడిగా పెరిగిన ఆ బాల మురళీ... ఇతనా... అతని వాయిస్ ఏదో ఆపరేషన్‌లో యాక్సిడెంటల్‌గా దెబ్బతిందని, అస్పష్టమయ్యాడని తెలిసిన రోజు ఎంతగా బాధపడ్డానో...

"యాక్సిడెంటల్‌గా కాదు ఆ గొంతు మూగపోయింది. డాక్టర్స్ నిర్లక్ష్యం వలన, కేవలం డాక్టర్స్ ఆపరేషన్ టైంలో నిర్లక్ష్యంగా బాధ్యతా రహితంగా ప్రవర్తించడంవలనే అలా జరిగింది... అస్వస్థత కాదు, అసలు జీవితమే అంధకారం అయిపోయింది" ఆ అమ్మాయి రెండు చేతుల్లో ముఖం దాచుకుని కుమిలిపోసాగింది.

కాసేపటికి తేరుకుని తెప్పరిల్లింది.

"సారీ... మీరేదో అభిమానంగా మా గురించి వస్తే నేనిలా... ఏమనుకోకండి "కళ్ళు తుడుచుకుంటూ అంది.

"ఛ...ఛ... అలా అనుకోకు... నేనే అనవసరంగా మానుతున్న గాయాన్ని రేపేనేమో వచ్చి..." మెల్లిగా అన్నాను.

"... ఈ గాయం మానేది కాదులెండి... కానీ ఏమిటో మిమ్మల్ని చూడగానే ఆత్మీయుల్లా అనిపించి బాధ నిగ్రహించుకోలేక పోయాను.

"ఆత్మీయులు" అంటున్నావు కనుక నన్ను మీ అన్నయ్యలా భావించి అసలు ఏం జరిగిందో కాస్త వివరంగా చెప్పు... అతడిని ఇలా ఈ స్థితిలో వదిలేసి... సెడెటివ్స్‌తో నిద్రబుచ్చితే క్రమేణా పిచ్చివాడు అయిపోయినా ఆశ్చర్యం లేదు... ముందు నువ్వు... మీ వాళ్ళు అదే మీ పేరెంట్స్ వాళ్ళూ ఈ విషయం జీర్ణించుకోవాలి... ఏది ఏమైనా జరిగిన అన్యాయం, నష్టం తిరిగి పూడ్చలేనిది, తప్పు ఎవరిదయినా ఫలితం మాత్రం అనుభవించాల్సినది అతనూ... అతనితోబాటు మీ కుటుంబం..." ఆమెను చూస్తూ మెల్లిగా అన్నాను.

"ఎక్కడి కుటుంబం... విషయం విని తట్టుకోలేక షాకయి ఆర్నెల్లకే అమ్మా నాన్న యిద్దరూ పోయారు... వాడిని ఈ స్థితిలో చూడడానికి మిగిలింది యింక నేనే..." నిర్లిప్తంగా అంది మహతి.

వింటున్న నాకే గుండె నీరయిపోయింది. అంత చిన్న వయసులో అన్ని కష్టాలు నష్టాలు భరించిన ఆమెనేమనాలో... ఎలా అభినందించాలో కూడా అర్థంకాలేదు. కొంతసేపు నిశ్శబ్దంలో తనను తను సర్దుకుంది ఆమె.

'మాది అనంతపురం జిల్లాలో ధర్మవరం. నాన్నగారి పేరు అనంత రామశర్మ... ఆయనకు సంగీతం ప్రాణమే... ఆరోప్రాణం కాదు. పంచప్రాణాలూ సంగీతమే... ఆయన కర్నాటక... హిందుస్థానీ రెండింటిలోనూ నిష్ణాతులే అయినా కళను నమ్ముకోవడమే కానీ అమ్ముకోవడం, ప్రాచుర్యానికి పాకులాడటం లాంటివి ఆయనకు తెలియని విషయాలు. అందుకే ఆయన విద్య... విద్వత్తు ఆ ఊరు దాటి బయట ప్రపంచం చూడలేదు. అమ్మ కూడా చాలా బాగా పాడేది... ఆయనకు బాల మురళీకృష్ణ గారంటే ఆరాధ్య దైవమే... అందుకే అన్నయ్య ఆయనంతటి వాడు కావాలని ఆ పేరు పెట్టుకున్నారు. మా యిద్దరికీ ఊహ తెల్సినప్పటి నుండీ సంగీత ప్రపంచం మాత్రమే తెలుసు. సరిగమలతోనే ఆడాం.. పాడాం... అన్నయ్య అయితే మరీ.. వాడికి

సంగీతం తప్ప వేరే వ్యాపకం వుండేదికాదు... ఏదో డిగ్రీ ఉండాలి కదా అంటూ అందరూ బలవంతం చేస్తే డిగ్రీ వరకూ చదివాడు.

ఎందుకు కలిగిందో... ఎలా కలిగిందో ఆ సంకల్పం.. అన్నయ్య ఓసారి తంజావూరు త్యాగరాజు ఆరాధనోత్సవాలకు వెళతానని పట్టుబట్టి కూర్చున్నాడు. అన్నయ్య కోరిక తీర్చడానికి నాన్న చాలా అవస్థ పడాల్సి వచ్చింది... ఎవరి దగ్గరో అప్పు తీసుకుని అన్నయ్యను అక్కడకు పంపించారు. అదే వాడి జీవితంలో ఊహించని మలుపు తీసుకు వచ్చింది. అక్కడ అన్నయ్య పాడటం విన్న వైద్యనాథ్ అయ్యంగార్ అన్నయ్యలోని టాలెంట్‌ను, ఉత్సాహాన్ని, కృషిని గమనించి ఆయనతో తీసుకెళ్ళారు. నాలుగయిదు నెలల ప్రత్యేక తర్ఫీదుతో అన్నయ్య కచేరీలు ప్రారంభించాడు... కచేరీలు... ఆడియో కేసెట్స్... మ్యూజిక్ ఆల్బమ్స్... సుమారు ఐదారు సంవత్సరాలు అన్నయ్య యింక వెనుదిరిగి చూడలేదు. అమ్మా, నాన్నల ఆనందం అలివికాకుండాపోయింది. కానీ వాళ్ళు మాత్రం మా ఊళ్ళోనే ఉండిపోయారు. అన్నయ్యతోబాటుగా నేను మాత్రం తిరిగేదాన్ని.

ఓ రోజు ఇంకాసేపటిలో కచేరి ఉందనగా సడన్‌గా అన్నయ్య కడుపునొప్పితో గిలగిలలాడిపోయాడు... అపెండిసైటిస్ అనీ వెంటనే ఆపరేషన్ అవసరమనీ అన్నారు... ఆపరేషన్ చాలా మైనర్‌దనీ, కంగారు పడవలసిన అవసరంలేదని, జస్ట్ రెండు రోజులు హాస్పిటల్‌లో ఉంటే చాలని అన్నారు. అంతా బాగానే జరిగిందని రెండు రోజుల్లో యింటికి పంపేశారు. కానీ పది రోజుల తర్వాత అన్నయ్యకు గొంతులో విపరీతమైన నొప్పి, ఏదీ తినలేక తాగలేక పోవడం... కనీసంగా మాట్లాడటానికి చాలా యిబ్బంది పడవలసి రావడం మా అందరినీ కంగారు పెట్టింది.



వెంటనే ఆపరేషన్ చేసిన డాక్టర్ దగ్గరకే వెళ్ళాం. అదే మా పొరపాటయింది. జరిగిన పొరపాటు తెలిసినా అది ఒప్పుకుంటే తన పేరు, హాస్పిటల్ పేరు ఎక్కడ పడిపోతుందో అని ఆయన ఏదో చెప్పేసి ఏవో కొన్ని పెయిన్ కిల్లర్స్ రాసిచ్చి పంపేసారు. ముందుగానే చూసుకుంటే ఏమైనా ప్రయోజనం ఉండేదేమో కానీ స్వరపేటిక పూర్తిగా ఇన్‌ఫెక్ట్ అయ్యాక చేయగలిగింది ఏమి లేకపోయింది తీసెయ్యడం మినహాయించి.

ఊపిరి కూడా లయబద్ధంగా శ్రావ్యంగా ఉండాలనే అన్నయ్య స్వరాన్ని శాశ్వతంగా తీసేసి... ఆ డాక్టర్ ఏమన్నాడో తెలుసా.. "పొరపాటు జరిగిపోయింది ట్యూబ్స్ స్వరనాళాలకు రాసుకుంటూ వెళ్ళిపోవడంవలన అవి రప్చర్ అయి ఇన్‌ఫెక్ట్ అయిపోయాయి. ఏది ఏమైనా జరిగింది ఘోరమే... కానీ అల్లరి చేసుకోవడంవలన జరిగిన నష్టం పూడదు కనుక నష్టపరిహారంగా ఐదారులక్షలు యిస్తాను గొడవ చెయ్యద్దని." ఐదారు లక్షలు అదీ అన్నయ్యకు గనుక... యింత చిన్న పొరపాటుకు అంత పెద్ద పరిహారం ఎవరూ యియ్యరు తనకు పాట విలువ... తెలుసుకనక అంత పెద్ద మొత్తం యిస్తాననీ... అన్నాడు" ఆ అమ్మాయి ఏడవడం మొదలుపెట్టింది.

హతాశుడిని అయిపోయాను. ఎక్కడో అక్కడ చెదురుమదురుగా వింటూనే ఉన్నాం ఓ కన్నుకి బదులు యింకోటి ఆపరేట్ చేశారనో... అదనోయిదనో... కానీ సాటి మనుషుల ప్రాణాలతో వారి వారి జీవనాలతో ఆడుకునే హక్కు ఇలాటి వాళ్ళకి ఎవరిచ్చారు.

నేను నా ఆలోచనల్లో ఉండగానే ఆ అమ్మాయి కాస్త తేరుకుంది.. కాసిని మంచినీళ్ళు తను తాగి నాకూ యిచ్చింది.

"తరువాత ఏం జరిగింది..." ఏం మాట్లాడాలో తెలియని అయోమయ స్థితిలో అడిగాను.

"తను చేసిన తప్పు కప్పిపుచ్చుకోవడానికి అన్నయ్యకు లేని థ్రోట్ క్యాన్సర్ అంటగట్టాడు ఆ డాక్టర్. తన పలుకుబడి ఉపయోగించి.. యింకో పెద్ద డాక్టర్‌తో అన్నయ్య తన దగ్గిర థ్రోట్ క్యాన్సర్‌కు చాలా కాలంగా ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నట్లు రికార్డ్స్ సృష్టించాడు.

ఈ విషయాలన్నింటికంటే అన్నయ్య స్వరం శాశ్వతంగా మూగబోయింది. యింక పాడలేడు అన్న నిజమే అమ్మా నాన్నలను కృంగదీసింది. ఆ షాక్‌తోటే కొద్ది రోజుల తేడాతో వాళ్ళిద్దరూపోయారు..."

"ఒక ఏడాది వరకూ అన్నయ్య అస్సలు కోలుకోలేకపోయాడు దాదాపుగా సెడెటివ్స్‌లోనే ఉన్నాడు. తరువాత తనలో కసి... కోపం.. ఏదో సాధించాలనుకున్నది సాధించలేకపోయాననే పట్టుదల యివన్నీ కలిసి అన్నయ్యను ఏడాదికల్లా మృదంగవాద్యంలో మంచి పట్టు సాధించేలా చేశాయి.

అంతర్గతంగా అన్నయ్యలో ఉన్న ఆవేశం.. పాడాలనే కాంక్ష... పాడలేకపోతున్నాననే తపన అప్పుడప్పుడు ఉన్మాదిని చేస్తున్నాయి. అన్నయ్య సహకారం లేకుండా దానికి పూర్తి ట్రీట్‌మెంట్ కుదరదు అని డాక్టర్స్ ఖచ్చితంగా చెప్పేసారు కానీ జరిగిన ఘోరం చూసాక డాక్టర్ అన్న మాట వినబడితేనే అన్నయ్య ఉన్మాదిలా మారిపో తుంటాడు... డాక్టర్ సలహా మీద నేనే సెడెటివ్స్ యిస్తున్నాను యిలాంటప్పుడు" నిట్టూర్చింది మహతి.

"ఎన్నాళ్ళిలా" నా ప్రశ్న నాకే అర్థం కాలేదు. ఇంక ఆమెకేం అర్థం అవుతుంది.

"ఏమో..." అసహాయంగా అంది.

ఆమె అన్న ఆ రెండక్షరాల మాట నన్ను కదిలించివేసింది. లేదు అలా జరగకూడదు. ఆణిముత్యం లాంటి ఓ కళాకారుడి జీవితం అలా అర్థరహితంగా మారకూడదు. అతనిని ఆ డీప్ డిప్రెషన్ నుంచి యివతలకు లాగాలి. ఎలా...

"ఏదో సంగీతం మీద అభిమానంతో, అభిలాషతో మీరు వెదుక్కుంటూ వస్తే ఏవేవో చెప్పి మిమ్మల్ని యిబ్బంది పెట్టి బాధపెట్టినట్లున్నాను. సంజాయిషీగా అంది మహతి.

"ఛ...ఛ.. అలా అనుకోవద్దు.. ఈ సమస్యకు పరిష్కారం ఆలోచిస్తున్నాను" ఆలోచిస్తూనే చెప్పాను.

"నిజంగా..." ఒక్క అంగలో నా దగ్గరకు వచ్చి నా చెయ్యి పట్టుకున్న తీరే ఆమెలోని ఆత్రుతనీ... ఆవేదననీ తెలిపింది.

"నిజంగానే... జరిగింది సామాన్యమైన విషయం ఏం కాదు.. కానీ జరిగిపోయింది... యిప్పుడెవరెంతగా చింతించినా ఉపయోగంలేదు ఆ విషయాన్ని అతను జీర్ణించుకునేలా కొత్త జీవితాన్ని ప్రారంభించేలా చేయాలి. దీనికి అతని మనసుని సమాయత్తం చేయాలి. ఏ డాక్టరు

ట్రీట్‌మెంట్ అక్కరలేదు. నేను యిది సాధించగలననే అనుకుంటున్నాను. త్వరలోనే మనం మరో సరికొత్త బాలమురళీని చూస్తాం... నమ్మకంగా అంటూ మహతి చెయ్యి నొక్కి వదిలాను భరోసాగా.

"అమ్మో అప్పుడే పది అయింది... చాలా రాత్రయింది. సమయమే తెలియలేదు... మా మాధవి చాలా కంగారు పడుతూ ఉండి ఉంటుంది. నేను రేపువస్తాను, ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో ఆలోచించుకుని. నువ్వు వర్రీ అవకు నన్ను మీ అన్నయ్యలా అనుకో.. మీ అన్నయ్య బాధ్యత ఈ అన్నయ్యకు వదిలెయ్ సరేనా..." లేచాను వెళ్ళడానికి

◇◇◇

మాధవి గుమ్మంలోనే ఉంది. అప్పటికే తెల్సిన చాలా మందికి ఫోన్లు వెళ్ళాయి. ఎంత కంగారు పడిందో ఆమె మొహమే చెబుతోంది.

"ఎక్కడి కెళ్ళారు? ఏమైపోయారో అన్న టెన్షన్‌తో చచ్చిపోతున్నా" చూడగానే ఎటాకిచ్చింది.

అసలే డిస్టర్బ్ అయి వున్న ఆమెను అసలు విషయం చెప్పి అర్థరాత్రిపూట యింకా రెచ్చగొట్టి బలవదల్చుకోలేదు. అందుకే

"అరె మధూ... కంగారుపడ్డావా... మా కొలీగ్ వాళ్ళ అన్నగారికి హార్ట్ ఎటాక్ వస్తే అతనితోబాటు హాస్పిటల్‌కు వెళ్ళి అక్కడే ఉండిపోయాను. కనీసం నీకు ఫోను చేద్దామన్నా వీలులేని పరిస్థితి. ఏదో అప్పటికప్పుడు తోచింది చెప్పేశాను. "కానీ అంటూ మీరు అలా బజారులోకి వెళ్ళొస్తానని వెళ్ళారని చెప్పాడే" ఎంతటి వర్రీలోనూ, ఎలాటి పరిస్థితిలోనూ ఆవిడ క్రాస్ ఎగ్జామినేషన్ మాత్రం మరిచిపోదు.

"అదా... బజారుకే వెళ్ళాను... అతను కంగారుగా తోడు రమ్మంటే... బాగుండదని వెళ్ళా..." మరో డైలాగ్.

పెద్ద గొడవేం జరగకుండా మేనేజ్ అయిపోయింది. హాయిగా నిట్టూర్చాను.

"మధూ... ఎప్పటి నుంచో మీ అమ్మగారింటికి వెళతానంటున్నావు... దిగబెట్టనా వెళతావా" ఉదయాన్నే కాఫీ తాగుతూ అడిగాను.

"ఏం మహానుభావా... ఏం రాచకార్యం వెలగబెడతారు మీరు.." తనని అడిగి మరీ పంపుతున్నానంటే నాకు నచ్చేది... తను మెచ్చునిదీ ఏదో విషయం ఉందని తనకర్థం అయిపోతుంది.

"అబ్బే... అదేం కాదు.. పాపం నీకు మీ వాళ్ళను చూడాలనుందనీ..." నెమ్మదిగా నసిగాను.

"సరే... ఏదో అఘోరించండి... ఏదో సంఘసేవ ఉండే ఉంటుంది...

అయినా నే వద్దంటే మాత్రం మానతారా... మీ యిష్టం... ఆరోగ్యం మాత్రం జాగ్రత్త... ఆదివారంగా రేపు దిగబెట్టండి నన్నూ బబ్లూనీ, బేబీని" యిన్నేళ్ళ సాహచర్యంలో నన్ను బానే అర్థం చేసుకుంది.. పోట్లాడుకోకుండా నాకు నచ్చినవి నేనూ... ఆవిడకు నచ్చినవి ఆవిడా చేసుకుందుకు మేం పెట్టుకున్న పద్ధతియిది.

అమ్మయ్య... లైన్ క్లియరయింది. హుషారుగా అనుకున్నాను.



మొదట నాలుగు రోజులు ఆఫీసుకు సెలవు పెట్టాను. మొదటిసారి నే అతనిని చూడటానికి వెళ్ళినప్పుడు ప్రశాంతంగానే ఉన్నాడు... ఏదో సంగీతానికి సంబంధించిన పుస్తకం చదువుతున్నాడు. నిన్న నేను వచ్చి వెళ్ళినట్లుగా, అతని కథ నాకు తెల్సినట్లుగా చెప్పకుండా వెళ్ళి పరిచయం చేసుకున్నా.

నాకున్న సంగీత సాహిత్య పరిజ్ఞానం, మాట నేర్పుతో అతని తొందరగానే యింప్రెస్ చెయ్యగలిగాను.

అతను బాగానే కల్సిపోయాడు, నాతోబాటుగా యోగా క్లాసులకు తీసుకెళ్ళడం మొదలుపెట్టా... అతని ఫ్లాష్‌బాక్ అంతా చెప్పి మా ఆఫీసులో జరిగిన ఓ ఫంక్షనులో అతని మృదంగ విన్యాసం ఏర్పాటు చేశాను. అతనికి నా సిన్సియారిటీ, అతని గురించి, అతని కెరీర్ గురించి నేను పడే తపన అర్థం అయ్యాక త్వరగానే పాజిటివ్‌గా రెస్పాండ్ అవడం మొదలుపెట్టాడు. అదెలా జరిగిందంటే...

... అతనిని డిప్రెషన్‌లోంచి బైటికి లాగి ఎలాగయినా మామూలు మనిషిని చేయాలని, అంతకంటే ఎక్కువగా అతనిలోని మరో కళని బతికించాలని నిర్ణయించుకుని ఆ శుభ సంకల్పానికి నాందిగా మర్నాడే చాలా కాజువల్‌గా వాళ్ళింటికి వెళ్ళాను లక్కీగా ఆ రోజు అతను మామూలుగా ఉండి మృదంగం వాయిస్తున్నాడు. "చాలా చక్కగా ఉంది మీ మృదంగ విన్యాసం" అనే నా కాంప్లిమెంట్ అతనిలో నూతన ఉత్సాహాన్ని కలిగించింది. అంతకంటే అదృష్టం... ఆ రోజు పేపర్లో ఓ వార్త నాకు మంచి అవకాశం కలిగించింది.

చిన్నప్పటి నుండీ వెయిట్ లిఫ్టర్‌గా ప్రపంచ ఖ్యాతి నార్జించాలన్న ఆశతో ఆశయంతో పెరిగిన, తండ్రి అడుగుజాడలలో నడిచి అంతకంటే ఘనుడయిన అతను అనుకోకుండా ఓ యాక్సిడెంట్‌లో వెన్నెముక విరిగి మంచం నుంచి లేవలేని స్థితికి రావడం... అయినా అతనిలోని ఆత్మస్థైర్యం, త్వరగా కోలుకుని పోటీకి నిలబడతానన్న విశ్వాసం.. ఆ వార్త చదివిన అతను చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు... జరిగిన దానికి బాధపడుతూ అలాగే జీవితాన్ని వృథాగా వదిలెయ్యడం ఎంతటి తప్పో... అవాంఛనీయమో తెలుసుకున్నాడు.

ఇంక చెప్పేదేముంది, కృషి, పట్టుదల, దేన్నైనా సాధించాలనే ఆకాంక్ష, సాధించగలననే ఆత్మవిశ్వాసం... యివన్నీ వున్న వాళ్ళకు... అందులోనూ సహజసిద్ధమైన సంగీత జ్ఞానం ఉన్నవాడికి ఇక అడ్డేముంది.

"ఇదంతా మీ చలవే... మీరే గనక అన్నయ్యకు ధైర్యాన్ని, ఉత్సాహాన్ని యియ్యకపోతే అన్నయ్య అదే డిప్రెషన్‌లో ఉండిపోయి బహుశా పిచ్చివాడయిపోయినా సందేహంలేదు" ఎమోషనల్‌గా అంటుంది మహతి.

"నిజమే కష్టంలో ఉన్న వాళ్ళనీ, బాధ పడేవాళ్ళనీ... ఓసారి వాళ్ళ బాధని గుర్తు చేసి సానుభూతి చూపడమో జాలిపడటమో, కాక గేలి చెయ్యడమో కాదు చెయ్యవలసింది వాళ్ళకు మానసిక స్థైర్యాన్ని యివ్వాలి. చేయూతనియ్యడం, వాళ్ళలోని నిరాశా నిస్పృహలను తరిమికొట్టడం చేయాలి, అది చేసిన మీరు రియల్లీ గ్రేట్" అంటుంది మా మాధవి. అవునండోయ్ సందట్లో సడేమియా అని ఈ హడావుడిలో మా మధుకి సాహిత్యం సంగీతం కళలూ మీద ఉన్న చిన్నచూపు పోయింది.

❖

# అనుస్మృతి వెంబడిస్తూంది

అడిగోపుల వెంకటరత్నమ్



హృదయం జ్ఞానోదయం కానప్పుడు
ఉదయం తిమిరం ఒడిలో వున్నప్పుడు
అక్కున చేర్చుకున్న విశ్వవిద్యాలయం
హాస్టల్ అశోకలో నన్ను చేర్పించింది
తలంటి అభ్యంగన చేయించి
కడుపు నింపి క్లాసుకు నడిపించింది!
సూర్యుణ్ణి వొళ్ళో ఆడించే తూర్పు తల్లిని చూశాను
అవసానంలో సపర్యలు చేసే పశ్చిమాన్ని చూశాను
తూర్పు పడమరల్ని చూసి ఓర్వక
ద్వేషం రగిలిన ఉత్తర దక్షిణాల్ని చూశాను
ఒక వేలికి రెండు ఉంగరాల్ని చూశాను
ఒక మాట రెండుగా చీలటం చూశాను
ఒక మతం ఘనీభవించటం చూశాను
ఒక కులం 'క్షత'గాత్రమౌటం చూశాను!
విజ్ఞానానికి చెలియల కట్టలుండవు
ప్రతిభను కొలిచి డిగ్రీ ప్రసాదించి
విశ్వవిద్యాలయం వీడ్కోలు పలికింది నాకు
సుమధుర జ్ఞాపకాలు చుట్టుముట్టాయి
మెరుపుల ఉరుములు మననమౌతున్నాయి
ఆగ్నేయాన హాస్టలు గదిలో
అతడు కలమెత్తితే కవిత్వం
అది ఝంఝూ మారుతం
విప్లవ 'విమో'చనోద్యమ భావజాలం!
విశ్వవిజ్ఞాన దర్శనం
ఈశాన్యం గదిలో వెల్లివిరుస్తుంది
సమస్త సమస్యల సంశీతిపై
అతడు గళమెత్తితే వక్తృత్వం!
బాధకు మనసు చెదరని
చిరునవ్వుల చంద్రుడు అందరికీ అప్తుడు
నైరుతి దిశ గది నివాసిది
తరగని సహృదయత్వం!
నీతి అవినీతి మధ్యనడుస్తూ
దుర్నీతి అక్రమాలు ఎదుర్కొంటూ
వాయవ్య గది విద్యార్థిది
విలక్షణ వ్యక్తిత్వం!
ఊహల వరదలో మనసు ఊయలై
కాలుపెగలదు జ్ఞాపకం ఆగదు
విద్యాలయం పొమ్మంటుంది
అనుస్మృతి రమ్మంటూంది!
ఇలలోకి నడకసాగింది
ఇరుకు దారుల గుండా
ఇరుకిరుకు మనసుల గుండా-

# గాయాల కూడలి

వసునూరి రవీందర్



మార్కెట్టు విసిరిన విష వలయంలో
మట్టి పేగు బంధం మాసిపోతుంటే
దిక్కులేని వాడై అన్నదాత
దినగండపు సుడిగుండంలో... కొట్టుమిట్టాడుతున్నాడు
అతనికి సాయమెప్పుడూ,
మసిపూసిన మారేడు కాయే
ఏ అభయహస్తాలు
కనుచూపు మేరలో కనిపించవు
భూ తల్లి పుత్రుల -పోషణ బాధ్యత
భుజానేసుకొని
పుట్టెడు శోకాన్ని దిగమింగుకుంటాడు
ఆకాశ శిఖరాలకెత్తె
అభినందనల ముసుగులో
ఆత్మహత్యల చిత్రణా వ్యూహాలు
కనిపెట్టలేక మోసపోతుంటాడు
అతడికి ప్రశ్నించే హక్కే లేదంటుంది రాజ్యం
హద్దులు గీసి, దమన నీతిని పాటిస్తుంది
ప్రశ్నించే గొంతులను
నులిమేయడమే... పాలకుని నీతి,
ప్రజాస్వామ్య రాజ్యాన
పరిహసించబడడమే అన్నదాత గతి
అన్నదాత మనసుకో, దేహానికో
ప్రకృతో, పాలకుడో
చేసిన గాయాల గుర్తులు మానకముందే
మరెన్నో గాయాలు...
యెప్పుడు అతనికి గాయాలేం కొత్తకాదు

# మహా కథకుడు చాసో : దశమ వర్ధంతి

చాసో సాహిత్య సమీక్ష చేసిన ఇ.బి. పద్మావతి చాసో మాస్టర్ ఆర్టిస్ట్ అనీ, ఎడ్గార్ ఎలెన్‌పో, ఆస్కార్‌వైల్డ్, ఒ. హెన్రీ లాంటి మాస్టర్ కథకుల కథలతో తులనాత్మకంగా పోల్చి చూస్తూ వారందరూ ఎలా మాస్టర్ ఆర్టిస్టులు అయ్యేరో అదే విధంగా చాసో కూడా మాస్టర్ ఆర్టిస్టు అనీ, అలా అని ఆయా రచయితల ప్రభావం చాసో మీద లేదనీ స్టైలిస్టిక్స్ ఆఫ్ చాసోని వివరించారు. ఈనాటి యువకథకులు చాసోస్ఫూర్తితో కథారచన చేసి, కథా సాహిత్యాన్ని ముందుకు తీసుకు వెళ్ళడానికి, సృజనాత్మక యోగ్యతను పెంపొందించుకోవాలంటే స్టైలిస్టిక్స్ స్టడీ చెయ్యాలని, నొక్కి చెప్పారు.

**డా॥ చాగంటి తులసి**

చాగంటి సోమయాజులు (చాసో) మార్క్సిస్టు దృక్పథంతో అపూర్వ శిల్ప నైపుణ్యంతో అద్భుతమైన కథలు రాసిన గొప్ప కథకుడు.

మానవ జీవితం భూగోళంలో ఎక్కడైనా ఒక్కటే. నా కథలు విశ్వమానవ జీవితం అంతటికీ వర్తిస్తాయి అనే సంపూర్ణ విశ్వాసంతో అంకితభావంతో ఆధునిక సాహిత్యాన్ని పరిపుష్టం చేసిన విశ్వకథకుడు. మానవుని ఆస్థాన కథకుడు.

తాను నమ్మిన విలువలపట్ల, ఆదర్శప్రాయమైన నిబద్ధతకు, వేలెత్తి చూపలేని సమగ్రతకు, గొప్ప సృజనాత్మక ప్రతిభకు పెట్టింది పేరైె తన మరణానంతరం తాను మానవ శ్రేయస్సుకు తోహదపడాలని తన శరీరాన్ని వైద్య పరిశోధనకు, తన కళ్ళను అంధులకు దానం చేసిన అపూర్వ రచయిత.

నాలుగు తరాల రచయితల గుండెల్లో విశిష్టమైన స్థానం పొందిన కథాశిల్పి. జీవితం, సాహిత్య, వ్యక్తిత్వం ఒకటిగా ఉందాగా, నిరాడంబరంగా నిప్పులా బతికిన విలక్షణమైన మనిషి. ఆయన వరవడి అందరికీ బోధార్యం.

చాసో 1915 జనవరి 17న శ్రీకాకుళంలో పుట్టి విజయనగరంలో జీవితమంతా గడిపి 1994 జనవరి 2న మద్రాసులో కన్నుమూసారు.

ఆయన ఆదర్శాలను, ఆశయాలను, నిరాడంబర జీవిత విధానాన్ని ఆ వారసత్వాన్ని కొనసాగించడానికి, సృజనాత్మక సాహిత్య కృషికి ఆయన స్ఫూర్తిని కరదీపికగా చేసుకోవాలని చాసో స్ఫూర్తి సాహిత్య ట్రస్టు 1994లో ఏర్పడింది.

1995 జనవరి 17 నుండి ప్రతి ఏటా సృజనాత్మక సాహిత్య వికాసానికి నిబద్ధతతో విశిష్టమైన కృషి చేసిన అభ్యుదయ రచయితలలో ఒకరికి చాసో స్ఫూర్తి సాహితీ పురస్కారాన్ని (పది వేల రూపాయలు, శాలువా, జ్ఞాపికలతో) యివ్వడం జరుగుతోంది.



'వాయిస్ ఆఫ్ చాసో' ఆడియో సి.డి. ఆవిష్కరణ సభలో ఇ.బి. పద్మావతి, ప్రొ. కాత్యాయినీ విద్మహే, కె. వరలక్ష్మి, కాశీపట్నం రామారావు, డా. చాగంటి కృష్ణకుమారి, డా. చాగంటి తులసి, చీకటి దివాకర్

1995 జనవరి 17న హైదరాబాద్ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఏర్పాటు చేసిన తొలి సాహిత్య సభలో అభ్యుదయ రచయిత మహీధర రామమోహనరావు, 1996 జనవరి 17న మద్రాసులో కీర్తిశేషులు ప్రఖ్యాత నటులు ఎస్.వి. రంగారావు ఇంటి మేడ మీద సాహిత్య సభలో ఆరుద్రకు ఈ పురస్కారాన్ని అందజేశాము.

1997 జనవరి 17 నుండి చాసో ఊరు విజయనగరంలోనే ఈ పురస్కార ప్రదానోత్సవ సాహితీ సభలు వరసగా జరుపుకుంటున్నాము. 1997లో పి. సత్యవతి, 1998లో గంటేడ గౌరునాయుడు, 1999లో బోయ జంగయ్య, 2000లో కె.ఎన్.వై. పతంజలి, 2001లో చిలుకూరి దేవపుత్ర, 2002లో ముదిగంటి సుజాతారెడ్డి, 2003లో నామిని సుబ్రహ్మణ్యనాయుడు ఈ సత్కారాన్ని అందుకున్నారు.

ఈ సంవత్సరం 2004 చాసో భౌతికంగా మన మధ్య లేకుండా పోయి పదవ సంవత్సరం. ఈ పదవ చాసో స్ఫూర్తి పురస్కార ప్రదానోత్సవం విజయనగరంలో జనవరి 17న ఘనంగా జరిగింది. ఇది పదవ సంవత్సరం కాబట్టి దీనికొక ప్రత్యేకతా, విశిష్టతా ఉండడానికిగాను వాయిస్ ఆఫ్ చాసో అనే ఆడియో సి.డి. ఆవిష్కరణను ప్రధాన అంశంగా తీసుకోవడం జరిగింది. వ్యక్తిగా, గొప్ప కథకుడిగా, మాస్టర్ ఆర్టిస్టుగా చాసోను ఈ సి.డి. విని అవగాహన చేసుకొనడానికి వీలుగా దీనిలో చాసో అభిప్రాయాలతో నిండిన ఇంటర్వ్యూ, ఊళ్లో వానలేదు, చొక్కాబొచ్చు తువ్వాలు, పలుకులవాగు, మట్టి ఉన్నాయి. ఈ ఆడియో సి.డి.ని సభకు అధ్యక్షత వహించిన కాశీపట్నం రామారావు ఆవిష్కరించారు. సభకు సి.డి. ద్వారా చాసో వాయిస్‌ని, అభిప్రాయాలని కొద్ది సేపు వినిపించడం జరిగింది.

కుమారి పి. తులసి, కుమారి వి. పావని పాడిన గురజాడ 'దేశమును ప్రేమించుమన్నా' అనే దేశభక్తి గీతంతో సాహితీసభ ప్రారంభం

అయింది. డా. రామసూరి అతిథులను, పురస్కార స్వీకర్తను సభకు పరిచయం చేస్తూ వేదిక మీదకు ఆహ్వానించారు.

కాశీపట్నం రామారావు తమ తొలి పలుకులలో మనం ప్రధానంగా చెప్పుకోవలసిన కథకులలో గురజాడతోపాటు చాసో ఒకరనీ, ఆయన స్ఫూర్తితో ఆయన బాటలో ప్రజారచనలు రావాలని అన్నారు. కొన్ని కథలు చాసో మాత్రమే రాయగలరని అటువంటి గొప్ప కథలను ఆయన రచించారనీ, వాటిలో మాతృధర్మం ఒకటనీ చెప్పారు. నిజం కటువుగా అనిపించినా దీనిని నిర్భయంగా నిర్మొహమాటంగా చాసో తన కథల్లో వెలువరించారనీ, తక్కువ కథలు రాసినా ఆయన రాసిన కథలన్నీ మాణిక్యాలు అని కొనియాడుతూ కథాసాహిత్య చరిత్రను నిర్మించుకోవాలి అని పిలుపుని యిచ్చారు.

చాసో సాహిత్య సమీక్ష చేసిన ఇ.బి. పద్మావతి చాసో మాస్టర్ ఆర్టిస్ట్ అనీ, ఎడ్గార్ ఎలెన్‌పో, ఆస్కార్‌వైల్డ్, ఓ. హెన్రీ లాంటి మాస్టర్ కథకుల కథలతో తులనాత్మకంగా పోల్చి చూస్తూ వారందరూ ఎలా మాస్టర్ ఆర్టిస్టులు అయ్యేరో అదే విధంగా చాసో కూడా మాస్టర్ ఆర్టిస్టు అనీ, అలా అని ఆయా రచయితల ప్రభావం చాసో మీద లేదనీ స్టైలిస్టిక్స్ ఆఫ్ చాసోని వివరించారు. ఈనాటి యువకథకులు చాసోస్ఫూర్తితో కథారచన చేసి, కథా సాహిత్యాన్ని ముందుకు తీసుకు వెళ్ళడానికి, సృజనాత్మక యోగ్యతను పెంపొందించుకోవాలంటే స్టైలిస్టిక్స్ స్టడీ చెయ్యాలని, నొక్కి చెప్పారు.

ప్రొఫెసరు కాత్యాయనీ విద్మహే పదవ చాసో స్ఫూర్తి పురస్కార స్వీకర్త రచయిత్రి కె. వరలక్ష్మి సాహితీ సమీక్ష చేశారు. చాసో స్ఫూర్తిని కె. వరలక్ష్మి తన కథారచన ద్వారా ఎలా ముందుకు తీసుకు వెళ్తున్నదీ చెబుతూ చాసో మాస్టర్ రైటర్ అనీ అందుచేత ఆయన



అన్ని రకాల అసమానతలను వ్యతిరేకించారనీ, ఆయన తానే చెప్పుకున్నట్లుగా ఆయన రచనలకు ప్రధానమైన ప్రాతిపదిక మార్క్సిస్టు దృక్పథం అని వర్గచైతన్యం, వర్గ స్పృహతోపాటు తన కథలలో అంతర్వాహినిగా స్త్రీని జీవితాల్లోని వేదనని, విషాదాలని స్త్రీల పక్షాన నిల్చుని చెప్పారనీ, తన ప్రాంత సంస్కృతిని, జీవిత విధానాన్ని కథారూపంలో అక్షరబద్ధం చేశారని తెలియజేశారు. ఈ మూడు అంశాలు కె. వరలక్ష్మి కథా సాహిత్యంలో కనపడతాయని, చాసో తన కథారచన ద్వారా ఏ సంప్రదాయాన్ని, ఏ వారసత్వాన్ని అందచేశారో దానిని శ్రీమతి కె. వరలక్ష్మి సమున్నతంగా ముందుకు తీసుకువెళ్తున్నారని ప్రశంసిస్తూ వరలక్ష్మి కథలను వివరించారు.

డాక్టరు చాగంటి కృష్ణకుమారి చాసో కథ – "ఎందుకు పారేస్తాను నాన్నా!"ను భావయుక్తంగా సభకు చదివి వినిపించారు.

కె.వరలక్ష్మిని డాక్టర్ చాగంటి తులసి పది వేల రూపాయలు శాలువా, జ్ఞాపికలతో సత్కరించారు.

సత్కారం పొందిన తర్వాత కె. వరలక్ష్మి తన స్పందనను సభకు తెలియజేస్తూ చాసోకథల్లో క్లుప్తతని తాను కూడా పట్టుకుని రచన చేయాలని ప్రయత్నిస్తున్నానని చెప్తూ తన నేపథ్యాన్నీ తన పరిసరాల అట్టడుగు వర్గాల జీవితాలను పరిశీలించి స్పందించిన తీరుని ఎంతో చక్కగా వివరించి సభికుల మెప్పును పొందారు.

సభా ప్రారంభంలో డాక్టర్ చాగంటి తులసి దేశంలోని వివిధ ప్రాంతాల నుండి రచయితలు, అభిమానులు పంపిన సందేశాలను వివరించారు.

ఈ సభలో ఉత్తరాంధ్రలోని మూడు జిల్లాల నుండి రచయితలు కథలు, నటులు, నాటక కర్తలు, టీచర్లు సమాజ కార్యకర్తలు ముందు తరాల వారితోపాటు ఈనాటి యువత వరకూ అందరూ ఉత్సాహంగా పాల్గొన్నారు.

డా॥ రామసూరి వాయిస్ ఆఫ్ చాసో ఆడియో సి.డి.ని ఆవిష్కరణ సమయానికి అందేటట్టు కృషి చేసిన భరాగోకు కృతజ్ఞతలు అభినందనలు తెలియజేశారు. కథాశిల్పి చాసో అన్న విమర్శ పుస్తకానికి విజయనగరానికి చెందిన డా.యు.ఎ. నర్సింహమూర్తి ఈ సంవత్సరం తెలుగు విశ్వవిద్యాలయం వారి నుండి పురస్కారం అందుకున్నందుకు చాసో స్ఫూర్తి సభాముఖంగా అభినందనలు తెలియజేసింది.

కాశీపట్నం రామారావు తమ తుది పలుకులతో చాసో స్ఫూర్తి సాహిత్య సభలతో యువత చాసో వారసత్వాన్ని అందుకుంటారని ఆశాభావంతో ఆకాంక్షించారు.

డా. రామసూరి వందన సమర్పణతో సభా కార్యక్రమం ముగిసింది.





# ఆకుపచ్చని సజీవ సముద్రం

అద్దేపల్లి రామోహనరావు

గ్లోబుకి అన్ని వైపులా
క్షణాల బిందువులుగా
కాలం ప్రవహిస్తూనే ఉంటుంది
ఎక్కడి ఆకాశం అక్కడ
ప్రతిబింబిస్తూనే ఉంటుంది
ఎవరి ఆకాశాన్ని వారే మోసుకుపోవాలి
ఎవరి సంధ్యాదీపాన్ని వారే వెలిగించుకోవాలి

గ్లోబుకి అన్నివైపులా
ఆశల కొక్కాలు తగిలించుకుని
మనుషులు వేలాడుతూనే ఉంటారు
ఎవడి ఊపిరిని వాడు
ముఖంమీద ఆరేసుకుంటూనే ఉంటాడు
ఎవరి గుండెపొగల్ని వారే విశ్వసించాలి
ఎవరి మానవత్వాన్ని వారే విశ్వసించాలి
ఎక్కడి మట్టి అక్కడి గాలిని బతిమాలి
మబ్బుల పాటల్ని ఒంటినిండా పోసుకుని
గుండెలో నిద్రపోయే నిశ్శబ్ద బీజాల్ని కదిలించి
ఆకుపచ్చని సజీవ సముద్రాల్ని
నలువైపులా విస్తరిస్తుంది
ఎవరి పంటలు వారే పండించుకోవాలి
ఎవరి మట్టిని వారే ఒంటికి పూసుకోవాలి

ఎక్కడి మనుషులక్కడి సముద్రంలో
స్నానాలు చేస్తూనే ఉంటారు
ఎవరి సమస్యలు వాళ్ళవి
ఎవరి పరిష్కారాలు వాళ్ళవి
పరిష్కారం కోసం మరొకరి బానిసలైతే
పరిష్కారమే సమస్యగా మారుతుంది

గర్జించే కాలానికి
హింసకిరీటం
అసభ్యత చేలాంచలం
మతం ఒక మారణాయుధం
కులం ఒక రక్తపతాకం
ద్వేషం నుదుటిమీది దిక్సూచి
మోసం పెదవి మీది పిశాచి
ఇక్కడి బాల్యం ఇంట్లో కంటే
చెత్తకుప్పల మీదనే ఎక్కువగా
జీవితాన్ని వెదుక్కుంటుంది

ఇక్కడి యౌవనం జీవితం కంటె
మరణాన్ని ఎక్కువగా ప్రేమిస్తుంది
ఇక్కడి వార్ధక్యం
యౌవనాల రాళ్ళ దెబ్బలు తగిలి
వృద్ధాశ్రమాల్లో తలదాచుకుంటుంది
సంగీతం ఒక డాల్బీ తుఫానై నిన్ను చెవిటి వాణ్ణి
చేస్తుంది
నాట్యం ఒక పాపాత్మ దిగంబరమై
నిన్ను గుడ్డివాణ్ణి చేస్తుంది
కవిత్వం మాత్రమే కాలం చేతపట్టుకున్న
ధర్మామీటరై
సమాజానికి పట్టిన జ్వరాన్ని కొలుస్తుంది
వసంతుడు కోకిల నిశాసిస్తే
ముందుకు వచ్చి నిలుస్తుందా?
కొమ్మల్లో అణిగిమణిగి పలకక
ఆకాశంలో చేరి చేస్తుందా?
కొత్త చిగుళ్ళకే ఎప్పుడూ స్వాగతమిస్తుందిగాని
నిప్పుకణికలు చిగుళ్ళ వేషాలు వేసుకుని
తొంగిచూస్తుంటే
గొంతులోనిపాట
అడవుల్లోకి పారిపోతుంది
గ్లోబంతనీ చించి బట్టలు కుట్టించుకుందాం
గుండె పై మాత్రం దేశాన్నే అలంకరించు
కుందాం
ఎన్ని ఈ మెయిళ్ళనైనా దశ దిశలకీ పంపుదాం
కలంలోంచి రక్త స్పర్శగా జాలువారే
అక్షరాల్ని మాత్రం కాగితాలకి పంచుదాం
ఎన్ని భాషల ఎన్ని కంప్యూటర్లనైనా
మోసుకుపోదాం
తెలుగు భాషకి మాత్రమే నాలుక చివర ఒక
ఇల్లు కడదాం

# చాటర్ బాక్స్

మనోహర్ దూడం



అదెప్పుడూ
చెవులకి
గాలమేస్తుంది

దానికి
తాళమేయాలనుకుంటే
భంగపాటు తప్పదు

స్వరతంత్రులు
ఉక్కువో పాడో
మోగుతూనే వుంటాయ్

రేకుడబ్బాలోని
గులకరాళ్ళ శబ్దం
ఆగనే ఆగదు

గడియారం ముల్లులు
అలసిపోయి
చమట్లు కక్కుతాయి,
అయినా
ఆ నాలుక తడి ఆరదు

ఇక రెడీగా వుండాలి
'యుగానికొకటి చొప్పున'
'పనికొచ్చే' మాటని
పట్టేసుకోవడానికి!

# ప్రేమ్‌చంద్ 'గబన్'లో మధ్యతరగతి మిథ్యాబింబాలు



**శిలాలోలిత**

మధ్యతరగతి మిథ్యాబింబాల ప్రతిబింబం ప్రేమ్‌చంద్ నవల 'గబన్'. మనస్తత్వ విశ్లేషణతో ప్రయాణిస్తుంది. అన్నీ పాత్రలుగా కాక, మన మొఖమో, పక్కవాడిదో, మనలోపల దాక్కొని, గొంగళి, ముసుగేసుకుని, మనకే దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్న మనిషో, కాస్తంత తీరిక దొరికాక అంతరంగపు తవ్వకాల్లో బయటపడిన అస్థికలో ఆ పాత్రలు.

మనిషిని కదిలింపజేసి, మస్తిష్కానికి పని చెప్పే మేధావి ప్రేమ్‌చంద్.

'గబన్' నవలలో రామనాథం 1946 నాటి యువ పాత్రయినప్పటికీ ఈ 2003 వచ్చినా రామనాథానికి రూపురేఖలేం మారలేదు. ఒక క్రమబద్ధ జీవితంపట్ల అవగాహన లేకపోవడం, ఆకాశానికి నిచ్చెనలపైనే దృష్టికానీ, ఆ నిచ్చెన కొనలు నేలమీద లేవన్న జ్ఞానం కొరవడడం – ఇవన్నీ ఇవ్వాల్టికీ మన జీవితాల్లోని నిజాలే.

రామనాథాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటే, జి.వి. కృష్ణారావు నవల 'కీలుబొమ్మలు'లోని సుబ్బయ్య పాత్ర గుర్తొచ్చింది. అతనూ అంతే. ఒక అబద్ధాన్ని తప్పనిసరి పరిస్థితిలో 'నిజం'గా వాదిస్తాడు. అది నిజమని నమ్మించడానికి ఒక దాని తర్వాత ఒకటి అబద్ధాలమేడ కట్టాల్సి వస్తుంది. చివరాఖరికి సుబ్బయ్య మానసిక స్థితి ఏ దశకు చేరుకొంటుందంటే, అదే నిజమని నమ్మి పోరాడే స్థితికి చేరుకొంది. మొదట్లో ఉన్న అబద్ధం ఆడుతున్నాననే స్పృహ, అపరాధ భావాన్ని పూర్తిగా మరిచిపోతాడు.

ఇలా సుబ్బయ్య మనసులో ఏర్పడే పరిణామాల క్రమాన్ని ఆ రచయిత అద్భుతంగా చిత్రిస్తాడు.

ప్రేమ్‌చంద్ రామనాథమూ అంతే. కటిక దరిద్రంలో బతుకుతున్న బతుకుని, ఏవగించుకుంటూ, తండ్రి ఆదర్శవాది అయినందువల్ల కుటుంబం ఎదుర్కొంటున్న బీదరికంపట్ల నిరసనతో, అవన్నీ ఆలోచిస్తూ తలపాడు చేసుకోవడం కంటే జాలీగా బతకాలనుకుంటాడు. షటిల్, చదరంగం ఆడుకుంటూ ఏనాటికైనా లక్షాధికారి కాకపోతానా అని కలల గుడ్లు పెట్టుకొని పొదుగుతూ వుంటాడు.

'పెళ్ళి చేస్తే తిక్క కుదురుతుంది' అనే పాత సామెతను పట్టుకొనో, భార్య పోరువల్లో మెత్తానికి రామనాథం తండ్రి కొంత అయిష్టంగానే కొడుక్కి పెళ్ళి చేస్తే బాధ్యత తెలుసుకొంటాడనుకుంటాడు.

అసలు కథ అప్పుడే మొదలైంది. తన స్నేహితుడి కూతురితో పెళ్ళి నిశ్చయిస్తాడు. ఆ స్నేహితుడూ గొప్పలకోసం అప్పులు చేసే రకమే. తాహతుకు మించి కట్నమిచ్చి ఘనంగా పెళ్ళి జరిపిస్తాడు.

ఈ పరువు-ప్రతిష్టల సంకెళ్ళు, నిజానికి మధ్య తరగతి వాళ్ళే దగ్గరుండి చేయించుకుని మరీ వేయించుకుంటార న్పిస్తుంది. మనకి ప్రధానంగా ఉన్న మూడు వర్గాల్లో సంపన్న వర్గానికి లెక్క చేయకూడ దనుకున్న అంశాలన్నింటినీ ఖాతరే చేయని తత్వం కన్పిస్తుంది. ఇక ఏమీ లేనివాడికి, ఇవన్నీ పెట్టుక్కూర్చుంటే బతుకే వెళ్ళదు, కాబట్టి వాళ్ళ ప్రధాన సమస్యలైన తిండీ, బట్టా, నీడ వీటి మీదున్న దృష్టి ఈ పట్టింపుల పట్ల చూపించే ఓపికా, తీరికా, వెసులుబాటు ఉండవు. ఎటొచ్చీ తీరిక వర్గమైన ఈ మధ్య తరగతికే అన్ని పైత్యాలు, మధ్యతరగతిలో మళ్ళీ రెండు రకాలు కన్పిస్తారు. ఒకటి ఎగువ, మరొకటి దిగువ.

రామనాథం అత్యంత సౌందర్యవతి అయిన భార్య ముందు 'మేల్ఇగో'తో తామెంతో ధనవంతులమనీ, తోటలూ, దొడ్లూ, బ్యాంక్ బాలన్స్‌లూ వగైరా ఎన్నో వున్నాయనే కోతలన్నింటినీ 'గిరీశం' లాగా కోస్తాడు.

ఎదిగీ ఎదగని వయసులో, లోకం తెలియని పంజరపు చిలక అతని భార్య. ఆమె చిన్న నాటి కల 'చంద్రహారం' చేయించు కోవడం.

భార్యను సంతోషపెట్టడం, తద్వారా సుఖాల్ని పొందాలనే తత్వంతో రామనాథం పాకుడు మెట్ల మీద జారి జారి ఎలా నలిగిపోతాడో రచయిత చూపిస్తాడు.

అతను అన్ని విషయాలు భార్యతో చర్చించి ఉంటే, వాళ్ళ జీవితాల్లో అంత సంక్షోభం ఉండేది కాదు. అతడి భార్య అమాయకమైంది. భర్తపట్ల ఇష్టమూ ప్రేమా ఉన్న పాత్ర. ప్రారంభంలో అమాయకంగా వున్నా, పరిస్థితులూ, జీవితమూ ఆమె నెలా రాటుదేల్చాయో తెలుస్తుంది. నవల చివరికి వచ్చేసరికి ఆ క్రమపరిణామంలో ఆమె ఎదిగిన తీరు, ఆలోచనలలోని చిక్కదనం, బతుకుపట్ల అవగాహన, ఆమె ఉన్నత వ్యక్తిత్వం, కరుణ, దయ, ప్రేమాస్పదమైన ఆమె మనస్సు, తన భర్త ఇచ్చే సాక్ష్యంవల్ల 16 కుటుంబాల వ్యక్తులు జైలుకో, ఉరిశిక్షకో, యావజ్జీవ కారాగార శిక్షకో గురవబోతున్నారని తెలుసుకొని ఆమె పడిన ఆరాటం, భర్తను మార్చడానికి ఆ కలకత్తా మహానగరంలో ఆమె పడిన పాట్లు, మందుకీ, మగువకీ, పోలీసులకు లొంగిపోయిన భర్తపట్ల ఆమె ప్రవర్తన చాలా స్పష్టంగా చిత్రిస్తాడు.

ఆఖరికి, ఆమె చేసిన ప్రయత్నాలు విఫలం కాగా, భర్తవల్ల నష్టపోయిన కుటుంబానికి సేవ చేసి అతడి పాపానికి కొంతైనా నిష్కృతి చేయాలనుకుంటుంది.

ఆమె ఆత్మనిగ్రహం, పట్టుదల, కరుణ, త్యాగం, విలాసాలపట్ల చూపని మోజు – ఇవన్నీ రామనాథంలో మార్పుని తీసుకొస్తాయి.

ఇంకొక స్త్రీ పాత్ర 'రాణి' మనిషికి రెండు రూపాలు. బాహ్యరూపమొకటి, అంతరంగం మరొకటి. అందరికీ కన్పించే రాణి రూపం, అత్యంత ధనవంతురాలు. జాలీగా గడిపే తత్వం ప్రేమమూర్తి భర్త గొప్ప లీడింగ్ లాయర్.

లాయర్ పాత్రలో మంచి మనసున్న మనిషున్నాడు. మొదటి భార్య మీదగల అపారమైన ప్రేమతో, ఆమె మరణించగా, ఆ జ్ఞాపకాల వెలుగులోనే కొడుకుని పెంచి పెద్ద చేస్తాడు. చేతికందొచ్చిన కొడుకుని అకస్మాత్తుగా మృత్యువు లాక్కెళ్ళిపోతే ఒంటరివాడైపోతాడు. మానసికంగా కోలుకోలేకపోతాడు. ఆ ఒంటరితనాన్ని భరించలేక, వారసుడికోసం మానసికమైన తోడు కోసం పేద పిల్లను చూసి పెళ్ళి చేసుకుంటాడు.

రాణి కూడా ధ

వ్యామోహంతోకాక, ఆయన వ్యక్తిత్వాన్ని గౌరవించి, మానసికంగా బాగా దగ్గరవుతుంది.

లాయర్‌లోని ఆత్మ సంఘర్షణను ప్రేమ్‌చంద్ నేర్పుగా చిత్రిస్తాడు. అతని అనారోగ్యం ఎంత భయపెట్టినా, మృత్యుఛాయకిందే తానున్నానన్న నిజం తెలిసినా, దుఃఖించే రాణిని చూడలేక, అసలు నాకు ఏ జబ్బూ లేదని ఆత్మవంచన చేసుకుంటుంటాడు. వీలునామా రాస్తానని ఎప్పుడు ప్రస్తావించబోయినా, అది తమ ప్రేమకు విఘాతంగా రాణి భావించేది.

ఐతే, వాళ్ళిద్దరిలా ప్రపంచం ఉండదు. మనుషులుండరు. కాలచక్రం శిథిలమైన లాయర్ దేహాన్ని తన ఇరుసులో కలిపేసుకుంది. రాణికి ప్రపంచం శూన్యమైంది. లాయర్ అన్న కొడుకు రంగ ప్రవేశం చేసి, ఎక్కడి ఆస్తులక్కడ స్వాహా చేసి, ఉంటున్న ఇంట్లో నుంచి కూడా ఆమెను కట్టుగుడ్డతో బయటికి నడిచేట్లు చేస్తాడు. తెల్లబోయిన రాణి తేరుకొనేలోగా ఏమీ లేని స్థితి ఎదురౌతుంది. ఆమె అన్ని ప్రశ్నలకూ అతడిదొక్కటే జవాబు. ఇదంతా ఉమ్మడి ఆస్థి. చిన్నాన్న నీపేర రాసిన వీలునామా ఉంటే చూపించు. మన న్యాయ చట్టం ప్రకారం విధవరాలైన భార్యకు, సంతానం లేకపోతే, ఆమెకు ఆస్తిపైన ఏ విధమైన హక్కూ ఉండదు. కావాలని నువ్వు అడిగితే, జాలితో నెలకు కొంత జీతభత్యం ఇస్తాను' అంటాడు.

చట్టమూ, డబ్బుపట్ల ఒక స్పష్టమైన అవగాహన లేకపోవడంవల్ల ఆమె, రాణిపట్ల ఉన్న అపారమైన ప్రేమతో ఆమె మనస్సును కష్టపెట్టలేక వీలునామా రాయలేకపోయిన అతడి వల్ల ఆమె జీవితం అలా బజారు పాలైంది.

ఇక మూడవ స్త్రీ పాత్ర 'జోహర్' కలకత్తాలో డబ్బుకు శరీరాన్ని విక్రయిస్తూ పోలీసుల చేతుల్లో కీలుబొమ్మై, ఆడమన్నట్టాడే స్త్రీ. రామనాథాన్ని వశపర్చుకోమని ఆమెని పోలీసులు నియోగిస్తే ఆ పాత్రలో నటించడం కాక, అతడి మంచితనాన్ని చూసి జీవించడం మొదలు పెడ్తుంది.

తర్వాతి కాలంలో రామనాథం భార్యకూ, రాణికీ మంచి స్నేహితురాలిగా మిగిలిపోతుంది.

ఈ ముగ్గురు స్త్రీలూ మూడు దిక్కులకు ప్రతి రూపాలు. ఒకరు డబ్బుపట్ల అవగాహన లేకపోవడానికి, మరొకరు డబ్బుపట్ల నిర్లక్ష్యానికీ, ఉదాసీనతకీ, ఇంకొకరు డబ్బు శిథిలపరిచిన ఆకలి జీవితానికి ప్రతిరూపాలు. జోహార్ 'మధురవాణి'లా సంస్కర్త హృదయిని. 1946 ప్రాంతంలోని జీవితాల రేఖాచిత్రాలివన్నీ. ❖

# చారిత్రక వాస్తవాలు చెప్పే నశీర్ పుస్తకాలు

**సయ్యద్ ఖుర్షీద్**

మన దేశంలో దాదాపు 15 కోట్ల ముస్లిం జనాభా ఉంది. వారంతా ఈ దేశంలోనే పు[illegible]రు. ఈ దేశంలోనే పెరుగుతున్నారు. ఈ దేశంలోనే మరణిస్తున్నా[illegible]ప్పటికిని వారి 'దేశభక్తి'ని ప్రస్తుతం ప్రశ్నార్థకంగా మార్చేసారు కొందరు. విద్రోహుల జాబితాలో ముస్లింలను చేర్చి అడుగడుగునా వారిని అవమానాలకు, అపనిందలకు గురి చేయడంలో సఫలీకృతులైనారు. అలాంటి ప్రస్తుత పరిస్థితుల్లో "ఈ దేశపు ముస్లింలు 'దేశభక్తి'లో ఎవ్వరికీ తీసిపోరు. అందుకు చారిత్రక ఆధారాలు ఇవిగో" అంటూ సయ్యద్ నశీర్ అహ్మద్ రచనలు సాగిస్తున్నారు.

నశీర్ అహ్మద్ కవి, కథారచయిత, అంతకు మించి పాత్రికేయుడు."భారత స్వాతంత్ర్యోద్యమం - ముస్లిం మహిళలు" (1999), "భారత స్వాతంత్ర్యోద్యమం - ముస్లింలు" (1999), "భారత స్వాతంత్ర్యోద్యమం - ఆంధ్రప్రదేశ్ ముస్లింలు" (2001), "మూసూర్ పులి-టిపూసుల్తాన్" (2002), "షహీద్-ఏ-ఆజం అష్ఫాఖుల్లాఖాన్" (2002), "భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లిం మహిళలు" (2003) పుస్తకాలను అందించారు.

ముస్లిం మహిళలు దేశకాలమాన పరిస్థితులలో చోటు చేసుకున్న అన్ని సంఘటనల్లోను భాగస్వామ్యం వహించారని "భారత స్వాతంత్ర్యోద్యమం - ముస్లిం మహిళలు" చాటి చెపుతుంది. బ్రిటిష్ సైనికులను సవాలు చేసిన బేగం హజరత్ మహల్, జలియన్‌వాలా బాగ్ సంఘటనలో నేలరాలిన ఉమర్‌బీబీ, పోలీసులు గుర్రాలచే త్రొక్కించినా బెదరని హమీదా తయ్యాబ్జీ... తదితర 52 మంది ముస్లిం మహిళల పోరాట తీరును చదువుతుంటే, మన ఒళ్ళు గగుర్పాటుకు గురి అవుతుంది.

"భారత స్వాతంత్ర్యోద్యమం - ముస్లింలు" ఆయన రెండవ రచన. ఈ చిరు పుస్తకంలో భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలోని వివిధ ఘట్టాలలో పాల్గొన్న ముస్లిం పోరాట యోధుల వివరాలను పొందుపర్చారు. మూసాషా, చిరాగ్ అలీ, నూరుల్ మహ్మద్, మౌల్వీ అహ్మదుల్లా, అజీముల్లా, లియాఖత్ అలీ, మహ్మద్ బాకర్, సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్, అబ్దుల్ లతీఫ్, షౌకత్ అలీ, హసరత్ మోహనీ యూసుఫ్ మెహర్ అలీ తదితరులు... చరిత్ర పుటల్లో ఎక్కడో అడుగున పడిపోయిన యోధుల వివరాలను మనముందుంచారు. అయినప్పటికీని ఈ విషయంలో యింకా సమగ్ర సమాచారంతో విస్తృత గ్రంథం రావల్సిన అవసరం మిగిలే ఉంది. అదే కోవలోకి చెందిన గ్రంథం "భారత స్వాతంత్రోద్యమం- ఆంధ్రప్రదేశ్ ముస్లింలు". భారత స్వాతంత్ర్యోద్యమంలోని వివిధ దశలలో పాల్గొన్న ముస్లింలు షహ్ సుబేదార్ అహ్మద్, పఠాన్ తుర్రేబాజ్‌ఖాన్, అమానుల్లాఖాన్, షోయబుల్లా ఖాన్, మహ్మద్ ఇస్మాయిల్, మగ్బూల్ అహ్మద్, గాలిబ్, మహ్మద్ గౌస్ బేగ్, ఖాశింబేగ్, మున్నీమొహమ్మద్ మస్తాన్ తదితర మన రాష్ట్రానికి చెందిన వారి పూర్తి వివరాలు ఈ పుస్తకంలో వున్నాయి.

ఇక "మైసూర్‌పులి-టిపూసుల్తాన్", "షహీద్-ఏ-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్" పుస్తకాలు చారిత్రక ప్రాధాన్యత కల ఆయా వ్యక్తుల వ్యక్తిత్వాలకు చిత్రిక పట్టేవి. వారి వ్యక్తిత్వాల్లోని మరో కోణాన్ని మనముందు నిలిపేవి.

నశీర్ అహ్మద్ రాసిన ఈ పుస్తకాన్ని చదువుతుంటే టిపూసుల్తాన్ ఒక గొప్ప లౌకికవాది అని అర్థమవుతుంది. అంతే కాదు తన రాజ్యంలో వ్యాపారాభివృద్ధి కోసం నావికాదళాలను నిర్మించిన స్వదేశీపాలకుడుగా, గొప్ప పోరాట యోధుడిగా తెలుస్తుంది. 45 పుస్తకాలను రచించిన సాహితీవేత్తగా, 2 వేల పుస్తకాలతో స్వీయ గ్రంథాలయాన్ని నిర్వహించిన వ్యక్తిగా వెల్లడవుతుంది.

ఇక "షహీద్-ఏ-ఆజం అష్ఫాఖుల్లాఖాన్" విషయానికొస్తే, యితన్ని గురించి మనకు మన పాఠ్యపుస్తకాల్లో దొరికేది గోరంత మాత్రమే! అయినప్పటికినీ భారతదేశ స్వాతంత్రోద్యమ పోరులో "కాకోరి రైలు ఘటన" మరుపురానిది. మరుగు పర్చలేనిది. ఈ సంఘటనలో ప్రధాన పాత్ర అష్ఫాఖుల్లాఖాన్‌దే! నశీర్ అహ్మద్ రచించిన ఈ చిరుపుస్తకాన్ని చదివితే, "షహీద్-ఏ-ఆజం" గురించి మనకెంతో తెలుస్తుంది.

ఈ పుస్తకాలన్నీ హైస్కూల్ స్థాయి విద్యార్థులకు ఉపవాచకాలుగా పాఠ్యాంశాలుగా ఉంచతగినవి. ❖

22

# కథానికలు

పుప్పాల కృష్ణమూర్తి

## "అవార్డులు"



ఒక నల్లి, మరో దోమ కలిసి, సాహిత్య సంబరాలు ఏర్పాటు చేశాయి. నల్లి రాసిన పురాణాల గురించి, వేదాల విశిష్టత గురించి దోమ నల్లిని పొగిడింది. దోమ రాసిన క్షుద్ర నవలల గురించి, బూతు కథల గొప్పదనం గురించి నల్లి, దోమను ఆకాశానికెత్తింది. సభకు హాజరైన ఈగలన్నీ ఈలలు వేశాయి. ముఖ్యఅతిథిగా హాజరైన ఊసరవెల్లి ఆ ఏడాది కేంద్ర, రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డుల కోసం నల్లి, దోమల పేర్లు సిఫార్సు చేయబోతున్నట్లు ప్రకటించింది. ఈగలతోపాటు బొద్దింకలు కూడా చప్పట్లు చరిచి ఆనందం ప్రకటించాయి.

ఆశ్చర్య పడాల్సిందేమీ లేదు. ఆ మరునటి ఏడాదే నల్లికి కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు, దోమకు రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డులు ప్రకటింపబడ్డాయి.

దేవుడు లోకాన్ని రక్షించుగాక.

## "తప్పిపోయిన కొడుకు"

తెలంగాణాలో ఓ తల్లి పట్నాలు, పల్లెలు, కొండలు, కోనలు, అడవులు తిరుగుతోంది తప్పిపోయిన తన కొడుకు కోసం. ఎదురైన వారినల్లా అడిగింది. కనబడ్డ ఆఫీసుకల్లా వెళ్ళింది. ఎత్తైన కోర్టుల్ని, విశాలమైన పోలీస్‌స్టేషన్లనీ ఆశ్రయించింది. కాని కన్న కొడుకు జాడ ఎవ్వరూ చెప్పలేదు.

అడవి గుండా నడిచిపోతూ, అలసిపొయ్యి ఒక చెట్టు కింద కూలబడి, కనబడని కొడుకుని తలుచుకుని వలపోయసాగింది.

"ఎందుకు పెద్దమ్మ ఏడుస్తున్నావ్?" అడిగింది చెట్టు.

"నా ఉన్నొక్క కొడుకు పెద్ద సదువులు సదవనీకి పట్నం బోయిండు. మస్తు తెలివిగల్లోడు. అన్నేల వంటే గిట్టనోడు. రెండేళ్ళ బట్టి పత్తాలేదు కొడుకు. ఎవర్నడిగినా జాడ సెప్తలేరు. నా కొడుకునే ఏరు మింగిందో? దారి మింగిందో తెలుస్తలేదు" అంది, బొటబొటా కన్నీరు కారుస్తూ.

"ఏరు మింగినా, దారి మింగినా వెంటనే తెలుస్తది పెద్దమ్మా, రాజ్యమే మింగుంటుంది. అందుకే అడ్రసు తెలీడం లేదు" అంది స్వార్థమెరుగని చెట్టు.



## "దేవుడి రహస్యం"



ఒక మేకకు దేవుడి పట్ల పల్లమాలిన భక్తి. ఉదయం నిద్రలేస్తూ కళ్ళు తెరిచి, దేవుడి ఫోటోనే చూస్తుంది. దేవుణ్ని పూజించందే పచ్చి నీళ్ళు కూడా ముట్టేది కాదు. గుడిలోని దేవుణ్ని దర్శించుకునే అడవికి మేతకు వెళ్ళేది. వచ్చేప్పుడు అడవిలో దొరికే రకరకాల పూలను తెచ్చి పూజించేది. వారానికోసారి ఉపవాసముండేది. నెలకోసారి తన పిల్లల్ని పస్తులుంచి పాలతో క్షీరాభిషేకం చేసేది.

ఒక పండుగనాడు దాన్ని పూజారులు పట్టుకున్నారు. శుభ్రంగా స్నానం చేయించి, నుదుట పసుపు, కుంకుమలు చల్లి, మెళ్ళో పూలదండవేసి దేవుడి ముందు నిలబెట్టి మంత్రాలు చదవసాగారు. దానికి తనను బలివ్వబోతున్నారనే విషయం అర్థమైంది. "ఇదేం న్యాయం భగవంతుడా? నిన్ను మనసా, వాచా, కర్మణా నమ్మి కొలిచాను. అలాంటి నన్ను నీవే బలి తీసుకోబోతున్నావు. నన్ను ఈ మనుషుల బారి నుండి కాపాడి రక్షించు. భక్తులకు ఆపదల కలిగినప్పుడు రక్షించడం, భగవంతుం డ్యూటీగదా. యింత కాలం నిను కొలిచినందుకు ఈ ఒక్కకోరిక తీర్చు" అ మొరపెట్టుకుంది.

అప్పుడా దేవుడు "ఓసి పిచ్చిమేకా నన్ను సృష్టించింది వీళ్ళు. యిక్కడ నిలిపిం వీళ్ళు. గుడి కట్టింది వీళ్ళు. అందరు పూజించే దైవత్వాన్ని ఆపాదించి నాకో గుర్తింపు నిచ్చిం వీళ్ళు. వీళ్ళనికాదని నిన్నెలా కాపాడను. నువ పోతే నీలాంటి మరో భక్తుడు వస్తాడు. కా వీళ్ళను కాదంటే నా ఉనికే ఉండదు" అ జవాబు యిచ్చాడు.

చనిపోయే ముందు 'దేవు రహస్యం' ఆలస్యంగా తెలుసుకుంది. కా దానికే మాత్రం ఉపయోగం లేకపోయింది.

# తస్లీమా "ద్విఖండితో" వివాదం : పూర్వాపరాలు

**పీపీ**

కళాకారులు, రచయితలపై కొన్ని చోట్ల దారుణమైన దాడులు జరుగుతుండగా పశ్చిమబెంగాల్‌లో తస్లీమా నస్రీన్‌కు సంబంధించిన వివాదం అందుకు భిన్నంగా, ఆసక్తికరంగా సాగింది.

బంగ్లాదేశ్‌కు చెందిన తస్లీమా నస్రీన్ చాలా పుస్తకాలు రాశారు. వాటిలో చాలా భాగం కొల్‌కతలో కూడా ప్రచురించబడ్డాయి. ఆమె రచనల ప్రచురణ, అమ్మకం, పఠనం కూడా ఎలాటి ఆటంకాలు లేకుండా సాగింది. గత ఏడాది ఆమె పుస్తకం కెఎ(బెంగాలీలో) బంగ్లాదేశ్‌లో ప్రచురితమైంది. ఆ పుస్తక ప్రచురణకర్త రచయితతో సంప్రదించి మూలప్రతిని కొంత ఎడిట్ చేశారు. మతానికి సంబంధించిన వివాదాలు లేకుండా చూడటానికే ఈ విధమైన ఎడిటింగ్ అవసరమైంది. అయితే ఆ తర్వాత కూడా ఆ పుస్తకంపై బంగ్లాదేశ్‌లో తీవ్ర విమర్శ వచ్చింది. అనేక మంది ప్రముఖ రచయితలు, కవులు, మేధావులను ఆ పుస్తకం కించపరచిందనే ఆరోపణలు వచ్చాయి. బంగ్లాదేశ్ ఎడిషన్ భారతీయ మార్కెట్‌కోసం ఉద్దేశించింది కాదు. పశ్చిమబెంగాల్‌లో కొందరు రచయితలు తమను అవమానపరచా రంటూ కోర్టుకు వెళ్లారు.

ఈ పుస్తకం ఎడిట్ చేయని ప్రతి "ద్విఖండితో" పేరిట కొల్‌కతలో ప్రచురితమైంది. ఇతర విషయాలు పక్కన బెట్టి ఈ పుస్తకంలో మహమ్మద్ ప్రవక్తను కించపరచే ప్రత్యక్ష వ్యాఖ్యలు, వున్నాయి. ఏదైనా మతాన్ని లేదా మతాచారాలను విమర్శించడం ఇక్కడ సమస్య కాదు. దాని కవ్వింపు భాష, అవమానకరమైన ప్రయోగాలు చాలామంది హేతు వాదులకు కూడా దిగ్భ్రాంతి కలిగించాయి. ఈ విషయమై అనేక మంది వ్యక్తులు, సంస్థలు కూడా రాష్ట్రప్రభుత్వాన్ని కలిశారు. దీనిపై ప్రముఖ మేధావుల అభిప్రాయాలు తెలుసుకోవాలని ప్రభుత్వం భావించింది. ఈ విధంగా అభిప్రాయాలు తెలుసుకున్నాక,ఆ పుస్తకం వాస్తవంగా కలిగించే ప్రభావాన్ని అంచనావేశాక మాత్రమే రాష్ట్ర ప్రభుత్వం దాని అమ్మకం నిలిపేయాలని భావించింది. కొంతమంది మేధావులు, రచయితలు చిత్రిస్తున్నట్టు ఇక్కడ సమస్య సాహిత్య స్వేచ్ఛ కాదు. ఒక గౌరవనీయ మత ప్రతినిధిపై బురదజల్లడం, దాని వల్ల ఏర్పడే మతోద్రిక్తతలు, తద్వారా శాంతి సామరస్యాలకు భంగం వాటిల్లడం ఇక్కడ సమస్యలు. ఇతర సాహిత్య వేత్తల గురించి చేసిన వివాదాస్పద వ్యాఖ్యలతో రాష్ట్ర ప్రభుత్వానికి ఏమాత్రం సంబంధం లేదు. మతసామరస్యాన్ని కాపాడి, మతవిద్వేషాలు రగుల్కొనకుండా ఆపడం రాష్ట్ర ప్రభుత్వ బాధ్యత. ఇంతకు మించి ఎలాటి నైతిక సమస్యలు ఈ నిర్ణయం వెనక లేవని ప్రభుత్వ ప్రతినిధి వివరించారు.

ఇది ఇలా వుండగా కొన్ని మత సంస్థలు, మతగురువులు తస్లీమానస్రీన్‌పై ఫత్వా అనబడేది జారీ చేశారు. రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో ఆమెకు వ్యతిరేకంగా చెదురుమదురు ప్రదర్శనలు జరిగాయి. ఇలాటి చర్యలను రాష్ట్ర ప్రభుత్వం గట్టిగా ఖండించింది. రచయిత్రి తస్లీమా కొల్‌కత చేరుకున్నప్పుడు ఆమెకు గట్టి భద్రత కల్పించింది. సిపిఐ(ఎం), మహిళా సంఘం(ఐద్వా), ఇతర వామపక్ష సంఘాలు ఫత్వాకు వ్యతిరేకంగా ఎలుగెత్తాయి. తస్లీమా కొలకత్తాలో అనేక కార్యక్రమాలకు హాజరైనారు. ముఖ్యంగా బుక్‌ఫెయిర్‌లో పాల్గొని తన అభిప్రాయాలన్ని యధేచ్ఛగావెల్లడించింది. ఆమె వ్యాఖ్యలు కొన్ని మేధావులు విమర్శకు గురవడం వేరే విషయం. ❖

## రచయితలు, సమీక్షకులకు మనవి

1. త్రైమాస పత్రికగా ప్రస్థానం కు రచనలు పంపదలచిన వారు తదుపరి సంచిక మొదటి నెలలో పంపాలి. చివరి వరకూ పంపుతూ వుండటం ఆఖరి నిముషంలో పంపించి రావాలని కోరుకోవడం వల్ల ఇబ్బంది అవుతున్నది. రెండవ నెల 15 వ తేదీ తర్వాత పంపినవి సాధారణంగా ప్రచురించే అవకాశం వుండదు.
2. రచనలు పోస్టు లేదా కొరియర్ ద్వారా ప్రస్థానం కార్యాలయానికి పంపించండి. వ్యక్తులతో పంపడం, ముందే ప్రచురణకై హామీ తీసుకుని పంపాలనుకోవడం అనవసరమైన జాప్యానికి, చేరకపోవడానికి దారితీస్తాయి.
3. కథలు మరీ పొడుగ్గా వుండటం వల్ల ప్రచురణ సమస్య అవుతున్నది. కొంతమంది ఎడిట్ చేయడానికి కూడా ఇష్టపడటంలేదు. దీని వల్ల తక్కువ కథలే వేయవలసి వస్తుంది. దానికి తోడు పాఠకుల నుంచి కూడా విమర్శలు వస్తున్నాయి. మరీ అరుదైన సందర్భాల్లో తప్ప నాలుగు పేజీలకు మించిన కథలు ప్రచురించడం సాధ్యం కాదని గమనించి కథకులు సహకరించాలి. పెద్ద కవితలు కూడా పేజీకి మించి రాస్తే ప్రచురణ కష్టం.
4. ప్రస్థానంకు పంపిన కథలు ఇతరత్రా ప్రచురించబడితే వెంటనే ఆ వివరాలు తెలియజేయాలి. ఎప్పుడో పంపిన వాటిపై సమాచారం లేకపోతే నిర్ణయం తీసుకోవడం కష్టమవుతుంది.
5. పంపిన తర్వాత చాలాకాలానికి కూడా అచ్చుగాని వాటిని వేయించుకోవడంపై కాక నూతన రచనలపై దృష్టి కేంద్రీకరించడం మంచిది.
6. ప్రస్థానంలో ప్రతిసారీ కొందరు కొత్తవారికి ప్రాధాన్యత వుంటుంది. కనక వెంటవెంటనే రచనలు పంపనవసరం లేదు. సీనియర్లు తమ రచనలు పంపడంతో పాటు వస్తున్న కొత్త రచనలపై విశ్లేషణ, సూచనలు చేస్తే ప్రయోజనం కలుగుతుంది.
7. విస్తృత సంఖ్యలో వెలువడుతున్న కవితాసంపుటాలను,వాటి సాహిత్య విలువలను కవితాశిల్పాన్ని చర్చించే వ్యాసాలు తక్కువగా వస్తున్నాయి. అలాటివి పంపితే ప్రాధాన్యత వుంటుంది.
8. 'ప్రస్థానం'కు సహకరించే సమీక్షకులు చాలా మందే వున్నారు. కాని కొంతమంది సమీక్షలు రాయాలని ఉత్సాహపడి తీసుకెళ్లినా ఎంతకీ రాసివ్వడం లేదు. దీనివల్ల పత్రికకు ఇబ్బంది కలగడమే కాక ఆ రచయితలు కూడా నిరుత్సాహానికి గురవుతారని గమనించాలి.
9. సమీక్షలు మీరే రాయించి పంపితే ప్రచురించడం జరగదు. సమీక్షకుల అభిప్రాయాలలో జోక్యం వుండదు. రచయితలు కావాలంటే వాటిపై తమ స్పందనలు తెలియజేయొచ్చు.
10. జిల్లాల నుంచి లిఖితపూర్వకంగా అందిన నివేదికలకే డైరీలో చోటు వుంటుంది.

కథ

బి.వి.ఎన్. స్వామి



# కలుపు మొక్క

కరీంనగర్ జిల్లాలో "హుస్నాబాద్" ప్రాంతానికో ప్రత్యేకత ఉంది. ఆ ప్రత్యేకత రావడానికి అనేక కారణాలు. ఆ కారణాల్లో కరువు ఒకటి. ఇక్కడ కరువు కాటకాలు చెట్టాపట్టాలు వేసుకొని విహరిస్తుంటాయి. బతుకులన్నీ కాటకలుస్తుంటాయి. ఎటు చూసినా దుమ్ము, దుబ్బ, మన్నూమశానమే. అంతా ఎడారి. భయంకర నిశ్శబ్ద స్మశానం. ఇక్కడ కురవడానికి వానకు ఎనకా ముందు. ఇక్కడ ఆత్మహత్యలు సాధారణం. నీటి కరువు మనుషుల్ని సారాదరి చేర్చింది. ఇక్కడి భూమిపై మనిషితనం, భూమిలో విత్తనం చేష్టలుడిగి జీవిస్తుంటాయి.

ఇరవై ఎకరాల ఆసామి కరువు దెబ్బకు పదెకరాల ఆసామిగా మారడం ఒక సాక్ష్యం. పని చేయించుకునే పటేలు కూలిగా మారడం, కూలి - బికారిగా మారడం. ఇక్కడి జీవన క్రమం. వలస వెళ్ళడం ఇక్కడి అలవాటు. తల్లడిల్లడం ఇక్కడి ఆచారం. తెగింపు ఇక్కడి గుణం. అంతా వెరసి హుస్నాబాద్.

✣✣✣

మక్క కంకి విరిచే కాలం. అంతంత మాత్రంగానే కాచిన చేనుకు కూలీలను పెట్టే తాహతు ఆ కుటుంబానికి లేదు. మక్క కంకి ఇరవడానికి కుటుంబ సభ్యులు ఐదుగురు వంగారు. ఎవరి శక్తి కొలది వాళ్ళు చేనులో పని చేస్తున్నారు. విరిచిన కంకుల్ని బస్తాల కత్తి, భుజాన వేసుకొని జామ చెట్టు కిందికి చేరవేశాడతను.

"బాపూ! ఇగ చూడే" అంటూ గీరుకపోయిన భుజాలను, కంఠాన్ని చూపించాడతను. "ఏం చేద్దాం బిడ్డా! కాలం మారింది. కరువుగాల మొచ్చింది. చేయించుకునే వాళ్ళం. చేసుకొని బతకాల్సి వచ్చింది. అంటూ అందరూ భోజనానికి కూర్చున్నారు. వ్యవసాయం లాభం లేదని పౌల్ట్రీ ఫామ్ పెట్టాడతను. కొన్నాళ్ళకు కోళ్ళు పోయి ఫామ్ మిగిలింది. ప్రయత్నాలు - వైఫల్యాలు అతని జీవితాన్ని నిర్దేశిస్తుండగా జరిగిందో ఘటన. హఠాత్తుగా ఆ కుటుంబం నుండి దూరమైంది అతని తల్లి. "లేచి పోయింది", "తిరిగొచ్చుడు దానికి మామూలే", "దానికి అన్నల తోటి సంబంధాలున్నాయి" లాంటి జనం మాటలు అతన్ని శూలాల్లా పొడవ సాగాయి. బాధను మరవడానికి అతను మత్తును మింగసాగాడు. మత్తు అతన్ని మింగసాగింది.

"లేచిపోయింది నీ కన్న తల్లి అయినట్లు బాధపడ్డావెందుకు" భార్య అనునయించసాగింది.

"అది నాకు సవతి తల్లే అయినా, నా ఇంటిదే కదా. నా చిన్నప్పుడోసారి, అప్పుడోసారి, అప్పుడోసారి, ఇప్పుడోసారి ఇట్లనే చేసింది. ఇది వరకు ఏమి అనిపించలేదు. కాని ఇప్పుడు భరించలేకపోతున్నాను." ముద్దముద్దగా వస్తున్నాయి మాటలు.

"మీ బాపుకే లేని పట్టింపు నీకెందుకు?"

"బాపు ముసలోడు. దానికీ బాపుకూ ముప్పై సంవత్సరాల తేడా. అతను ఏమి అనలేదు. ఏమి చేయలేదు"

"ఏం చేద్దామనుకొని ఇట్ల తాగుతున్నావు" తీవ్రంగా ప్రశ్నించింది.

"ఏం చేయాల్నో తోచడంలేదు" నిరాసక్తంగా నిద్రకుపక్రమించాడు.

✣✣✣

25

కొద్ది రోజుల తర్వాత, వెళ్ళిపోయిన తల్లి ఇల్లు చేరింది. ఇంట్లో వాతావరణం మబ్బు విడిచిన ఎండ లాగా ఉంది. ఒకటి-రెండు-మూడు-రోజులు గడిచాయి. ఆ రోజు "తాడో-పేడో" తేల్చుకోవాలనుకుంది అతని భార్య.

"ఎవనితోని పోయినవే" కోడలు, అత్తను ప్రశ్నించింది.

ఊహించని మాట వినపడటంతో, ఆత్మాహుతి దాడికి గురైన క్షతగాత్రుల్లా విలవిలలాడింది అత్త. ప్రశాంతంగా అక్కడి నుండి కదిలింది.

"నువ్వు వాని ఇంట్లకే పో, నా ఇంట్లకు రాకు" అడ్డు తగిలింది కోడలు.

నిస్సహాయంగా నిల్చుండి పోయింది అత్త. అచేతనురాలైంది. మెదడు గడ్డకట్టినట్లయింది. ఊహించని ప్రతిఘటనకు నివ్వెరపోయింది. అత్త అచేతనాన్ని అలుసుగా తీసుకొని చరిత్రనంతా తవ్విపోసింది కోడలు. బూతులతో కడిగింది. పది మంది గుమిగూడారు. అయినా కోడలు ఆగటంలేదు. తను బజార్లో నిలబడ్డ ్రహింపు వచ్చింది అత్తకు.

"ఏమే! ఏం తెలుసని మాట్లాడు తున్నావు. నిన్నగాక మొన్న వచ్చినవు. తల్లి సచ్చిపోయిన్నాడు నీ మొగనికి మూడేండ్లు. మూడేండ్ల నాడు ముడ్డి కడిగిన, ముప్పై ఏండ్ల నాడు తప్పతాగి బజార్ల పడితె భుజాన ఏసుకచ్చి నీ పక్కల పండబెట్టిన. ఆ రోజు కనీసం బయటకు రాని దానివి, ఈ రోజు బజార్ల నిలబడి ఒర్లుతున్నావెందుకు? ఇంకో మాట వచ్చిందంటే నిన్ను నిలువునా నరుకత" అంటూ కోడలి గొంతుపై చేయి వేసి నెట్టి ఇంట్లో కెళ్ళింది.

ఆశ్చర్యపోవడం కోడలు వంతైంది. ఆమె శారీరక బలం ముందు తన దుర్బలత్వం నిరూపించబడింది. నిస్సహాయంగా నిలబడలేక గోరు చేసుకోవడం మొదలు పెట్టింది.

"దొంగలం... నీ నాశనం కాను. పోరగాండ్లను అడవుల పట్టియ్యవడ్తివి. నువ్వు అడవులు పట్టి పోరాదె! ఇంటిని అడవి చేసుడు నీకు న్యాయం కాదె! సంసారం, సానితనం రెండు రీతులా నడుపుతున్నావు గదనే!! నా సంసారం నాశనం చేయకే!!! అంటూ వాకిట్లో కుప్పకూలిపోయింది.

కోడలు నిస్సహాయత, అత్త గడసుతనం కొంత మందికి ఆనందాన్ని, మరికొంత మందికి ఆలోచనల్ని కలిగించాయి. ఒక్కొక్కరు తమ అనుభూతుల్ని మరొకరితో చెప్పుకుంటూ వెళ్ళిపోయారు. ఆనాటి నుండి ఆ ఇంట్లో రావణకాష్టం రగులుకొంది. అంతా చూస్తున్నా తండ్రి మౌనంగా ఉండిపోయాడు. వృద్ధాప్యం, అవసరాలు అతణ్ణి మూగవాణ్ణి చేసాయి. కొడుకు పరిస్థితికి రోదించసాగాడు. ఆ ఇంట్లో ఆలోచనలు వారి, వారి అవసరాల్ని కేంద్రంగా చేసుకొని పరిభ్రమించసాగాయి. తిరిగింది. వచ్చింది. కాని నా ఇల్లు చెడగొట్ట లేదుకదా!" అని తండ్రి మనస్సు తృప్తి చేసుకోసాగాడు. "తల్లిగారి లేమివల్ల రెండో సంబంధంగా ఈ ఇల్లు చేరడం, పెళ్ళయిన కొత్తలో ముసలోడి ఆరళ్ళు భరించలేక తల్లిగారింటికి వెళ్ళడాన్ని గడప దాటడంగా, ఇరుగు పొరుగు రంగు పులమడం" గుర్తొచ్చి కుమలసాగిందామె. కోడలు భర్తను అస్త్రంగా మలచసాగింది. ఇక సవతి తల్లి అసలు కొడుకు జులాయిగా మారాడు. ఈ విధంగా ఆ కుటుంబం దినదినగండం నూరేళ్ళాయిషు లాగా నెట్టుకసాగింది. అందరికీ మనశ్శాంతి కరువయింది. బయటి కరువుతోడయింది. అటువంటి స్థితిలో ఉప్పొసకోసమని తల్లిగారింటికి బయల్దేరింది కోడలు. కోడలు వెళ్ళాక రెండు రోజులకు...

పాలివాండ్ల బోధలు, తన అనుభవాలతో విషం పూసిన అస్త్రంలా మారిన అతను, ఆ రోజు "పిన్నీ" అంటూ, బుసలు కొడుతూ ఆమె మీదికి వెళ్ళాడు. అతని నడకలోని ధోరణి, తాగిన అతని స్థితి అనేక అనుమానాలకు తావిచ్చింది. జరగబోయే అనర్థాన్ని ఆపడానికన్నట్లుగా తండ్రి, తనను తాను రక్షించుకోవడానికి పిన్ని, తాగింది వదిలించడానికి సవతి తల్లి కొడుకు, ముగ్గురు ఏకమై అతణ్ణి అడ్డగించారు. పశువులాగా మారిన అతడికి గుణపాఠం చెప్పి ఈడ్చుకుంటూ లోపలకెళ్ళి గదిలో వేశారు. అంతటితో తమ పని పూర్తయినట్లు రోజువారీ పనుల కోసం చేన్లోకి వెళ్ళారు.

మధ్యాహ్న సమయం. కడుపులో ఆకలి వానపాము లాగా మెలికలు తిరగసాగింది. పొద్దున జరిగిన గొడవ వల్ల "సద్ది" తెచ్చుకోవడం మర్చిపోయారు. అందరూ ఇంటికి బయల్దేరారు. కొడుకు పై బెంగతో తండ్రి పెద్దపెద్ద అంగలు వేయసాగాడు. "పాపపు రోజులొచ్చినయి" అనుకుంటూ గబగబా ఆమె నడవ సాగింది. ఇంటి ముందు కొచ్చారు. వేసిన తలుపులు వేసినట్లుగా ఉన్నవి. తలుపులు తెరిస్తే తెరుచుకోవడం లేదు. లోపలి నుండి గొళ్ళెం వేసినట్లుంది. ఇంటికి రెండు వైపులా ఉన్న తలుపుల పరిస్థితి అలాగే ఉంది. తెలియని విషాదం వాతావరణాన్ని కమ్మివేసింది. ఆలోచనలన్నీ ఘనీభవించి ఆ తండ్రి అచేతనుడయ్యాడు. ఆమె ప్రయత్నంవల్ల కిటికీ తెరుచుకుంది. కిటికీ గుండా తొంగి చూసింది. తను పట్టుకున్న కిటికీ ఊచలు, పాములుగా మారినట్లు అనిపించింది. నోరు తడారింది. ఎదురుగా చీర కొంగుతో ఉరి వేసుకొని అతను, భర్తను పిలిచింది. గొడవ చేసింది. నానా యాగి చేసింది. పెడబొబ్బలతో ఆ ప్రాంతం అలజడికి గురి అయింది. పది మంది పోగయ్యారు. విషయం అందరికీ తెలిసింది. తండ్రి నిలువునా కూలిపోయాడు. పది మంది తలుపులు తీయడానికి ప్రయత్నించసాగారు. "తలుపులు పగులకొట్టండి" దాదాపుగా ఆదేశించింది. "తొందరగా నలుగురు కలిసి దించారు. 'శవమయ్యాడు" అని తీర్మానించారు. ఆ ప్రాంతమంతా ఆమె రోదనలతో నిండిపోయింది. ముప్పై ఏండ్ల తన పెంపకం మట్టిలో కలిసిందని మొత్తుకుంది. తను చేసిన సేవల్ని ఏకరువు పెట్టింది. గుండెలు బాదుకుంది. ఆమెను ఊరడించే వాళ్ళు కరువయ్యారు. అక్కడి వాతావరణం తనకు ప్రతికూలంగా మారడం గమనించింది. భర్త తనకు సాయం చేయలేడని ఊహించింది. అన్నిటికీ సిద్ధపడింది.

❖ ❖ ❖

ఆ కుటుంబాన్ని చీకట్లు కమ్ముకున్న వేళ, అయిష్టంగానైనా పాలివాండ్లు విషయాల్ని చేరవేశారు. ఫోన్స్ పని చేశాయి. అతని అత్తగారింటికి మనిషిని పంపారు. మనుషులకే కాదు పత్రికలకు కూడా విషయాల్ని చేరవేశారు. అందరికీ వారు అందించిన నిజం పత్రికల్లో "సవతి తల్లి చేతిలో యువకుడి మరణం"గా అచ్చయింది. వార్త చేరిన వారందరూ వచ్చి వాలారు. అతని చావు పత్రికలకు ఒక వార్తయింది.

తండ్రికి మిస్టరీగా మారింది. పాలివాండ్లకు వినోదమయింది. భార్యకు విషాదం, బంధువులకు దుఃఖంగా మారింది. స్నేహితులకు అయోమయంగా, ఇతరులకు సానుభూతిగా నిలిచింది. చావుకు సంబంధించిన పుకార్లు చిలువలు పలువలుగా పేర్చబడ్డాయి. అవన్నీ కూడా ఆమెను కేంద్రంగా చేసుకొని అల్లబడ్డాయి. ఆ విధంగా చావు ఆమెకు ఆశనిపాతమయింది. ఏడ్చేవారు, ఆరాలు తీసేవారు, ఏం చేయాలో ఆలోచించే వారితో అక్కడి వాతావరణం గంభీరంగా రూపు దాల్చింది. వస్తూనే అతని అత్తింటి వారు బొటన వేలిపై లేచారు. నానా హంగామా చేశారు. పోలీసు కంప్లైంటు కోసం కొందరు వెళ్ళారు. వీరందరి నేపథ్యంగా పాలివాండ్లు పని చేయసాగారు. గుంపులు, గుంపులుగా నిలిచిన వారు గుసగుసలు పోసాగారు. ఒక గుంపులో జరిగే చర్చ స్పష్టంగా వినిపించసాగింది.

"వీనికి ఉరేసుకునే కష్టం ఏమొచ్చింది"

"ఇజ్జత్ పంచనామా అయితందని"

"ఎవరిది"

"వాళ్ళ పిన్ని మొన్నానే పదిహేను రోజులు తిరిగొచ్చింది. రకరకాల పుకార్లు లేసినయి. అది వీడు తట్టుకోలేదు."

"అది తిరగస్తే ఎతిరాజ్ చేయాల్సింది వీని తండ్రి. వీనికి నచ్చకపోతే ఏరువడై అయిపోతుండె"

"ఇగో! మాట్లాడుడు చాలా ఈజీ. తట్టుకొనుడు కష్టం. వాడు తట్టుకోలేక పోయిండు, పాపం. వీని చెల్లె కూడా ఉరేసుకునే సచ్చింది"

"అది ఎందుకు సచ్చింది"

"దాని మొగడు లందు మొకపోడు. ఊకె కట్నం తెమ్మంటుండెనట. పంచాయతులు, జుర్మానాలు అయినయి. అయినా వాడు మారలేదు. దీనిఇక వశపడలేదు. ఓ రోజు ఉరేసుకుంది.

"అసలు వీళ్ళ కుటుంబ చరిత్ర చెప్పురా"

"ఆ పెద్ద మనిషి మొదటి భార్య చనిపోయింది. ఆమె చనిపోయే నాటికి ఆయనకు దగ్గరదగ్గరగా యాభై ఏండ్ల వయసు. పిలగాండ్లు చిన్నోల్లు. వాల్లను సాదుడు సవరిచ్చుడు ఈయన వశం కాలేదు. ఆడ సక్కిలేని సంసారం. అందుకని సంసారం ఎల్లదీయటానికి ఇంకో పెండ్లి చేస్కున్నాడు. ఇప్పుడున్నది అదే. ఇది పొలగాండ్లను సాది సవరిచ్చింది. ఇంతల దీనికో పిలగాడు పుట్టిండు. అంత మంచిగనే ఉన్నది గని దీనికి తిరుగుడు రోగం ఉంది. యాడాదికోసారి పది, పదిహేను రోజుల దాకా బయట తిరిగి వత్తది. ఎటు పోతదో ఎవలకు తెలువది. అది చెప్పది. ఆ ముసలోడు ఓసారి గట్టిగ అడిగితే, వానికి బెదిరింపులు వచ్చినయి. అక్కన్నుంచి దీనికి అన్నల తోటి సంబంధం ఉన్నదని పుకారు లేసింది"

"ఏమని బెదిరించిండ్రు"

"దీన్ని ఏమన్నా అన్నా, ఇంట్లకు రానీయకపోయినా, నీ పోరగాండ్లను సంపుతం అని బెదిరిచ్చిండ్రట. పోరగాండ్లంటె ముసలోనికి పావురం. పానం ఇడుత్తడు. అదొకటే కాక ముసల్తనానికి చేసిపెట్టే దిక్కు లేకుంటే ఎట్ల? అనేది మరొకటి కలిసి దాన్ని ఇంట్లకు రప్పిచ్చినయి. అప్పట్నుంచి దాని ఇష్టారాజ్యమయింది. ఇప్పటికీ అట్లనే నడిపిత్తండి. కాని వీడు పెరిగి పెద్దయినాంక అట్ల తిరగపోవడం సహించలేదు. దానికి, వీనికి పడకుంటయింది. ఆఖరికి గిట్లయింది.

"వీళ్ళ ఆర్థిక పరిస్థితి ఎట్లుంది"

"అందరి లెక్క వీళ్ళున్నారు. ఎవుసం ఎన్కపడ్డది. కరువు ముందు పడ్డది. అంతా చెరువు పారకం. నీల్లు లేవు. చెరువెండకపోయింది. ఇగ ఏన్నుంచి పంటలు పండుతయి. ఎటు చూసినా తాళ్ళు-తషెల్లు, మోదుగులు-ఈదుల్లు, గుట్టలు, పచ్చదనం అనేది బతుకుల్ల లేదు. బయట లేదు. ఏం పని లేక వీడు, తాగుడే పనిగా పెట్టుకున్నాడు. అట్ల కూడా దివాల తీసిండు. తెల్లారితె, పొద్దూకుతె సారా తాగెటోల్లు ఈడ చాలా మంది కనపడతరు. అగో! అటు మొకాన ఉన్న జిల్లెల్లగడ్డ, బంగారులొద్ది, పులిసిన తండ... ఇంకా అసొంటి చాలా ఊర్లల్ల సారా పార్తా ఉంటుంది. ఈ పోరనికి చేద్దామంటె పని లేదు, మోటు పని చాతకాదు, బతుకుడు కష్టం అనుకున్నాడు. కావచ్చు, పెండ్లాన్ని, పోరగాండ్లను సాదుడంటే మజాకా! సత్తె అయిపోతది అనుకున్నాడు, ఉరేసుకున్నాడు" అంటూ ముగించాడు.



"సచ్చినోని తండ్రిది పెద్ద తెలివిరా! తన పిల్లలకు, తనకు చేసి పెట్టడానికి జీతం లేని ఆడమనిషిని ఉంచుకున్నాడు. బయట తిరగడం దానికి సంబంధించినదిగా, ఇంట్లో పని చేయడం తనకు సంబంధించినదిగా భావించాడు. సుఖించాడు. కాని అదే అతని బలహీనతగా నిరూపింపబడటం ఈనాటి విచిత్రం"

ఈ విధంగా తలోదిక్కు తోచిన విధంగా మాట్లాడుకుంటూ ఉండగా పోలీసులు వచ్చి చేరారు. కొంతసేపు ప్రశ్నలు వేయడం, ఆరా తీయడం జరిగింది. శవం, పోలీస్‌స్టేషన్ వైపు బయలుదేరింది.

✤ ✤ ✤

ప్రధాన రహదారి ప్రక్కనే పోలీసుస్టేషన్. స్టేషన్ గోడను ఆనుకుని ఒక ప్రైవేట్ జీపు. జీపులో అచేతనంగా శవం. దానిపై తెల్లబట్ట స్వారీ చేస్తుంది. శవం భార్య స్టేషన్‌లో పది మందిలో కూర్చోనుంది. వారికెదురుగా శవం తండ్రి సంబంధీకులు కూర్చున్నారు. కేసు పెట్టడమా! పంచాయతీ తెంపుకోవడమా!! చర్చ నడుస్తుంది. కాలయాపన ఎస్.ఐ.లో బి.పి. లేపింది.

"మొగన్ని సంపిండ్రని కేసుపెడ్తవా, వాల్లిచ్చింది తీసుకపోతవా?" గద్దించాడు.

"వాల్లిత్తమన్నది సాలది. నేనడిగినంత ఇప్పియ్యండ్రి" శవం భార్య జవాబు.

"మీకు చెప్పుడు నా వశం అయిత లేదు. ఏ సంగతి అరగంటల తేల్వాలె. లేకపోతె కేసు బుక్ చెయ్యాలె.

"అయ్యా! ఇరవై ఏండ్లు కూడా లేని పొల్ల ముండ మోపిదయింది. దానికో పొల్ల అదెట్ల బతకాలె. దాన్ని ఎట్ల సాదాలె. మేం ఇచ్చిన కట్నం. దాని అత్తగారి ఆస్తిల సగం ఇప్పియ్యండ్రి పిల్ల తరపు పెద్ద మనిషి వివరించాడు.

"మీరిచ్చిన కట్నం మీకిత్తం సచ్చినోని పాలుకచ్చిన జాగ అమ్మి పైసలిత్తం" శవం పెద్ద మనిషి జవాబు.

భూమి, జాగలు ఎన్ని పాల్లు పెడ్తరు"

"మూడు పాల్లు, సచ్చినోనికి, బతికున్న పోరనికి చెరోపాలు తల్లితండ్రికోపాలు"

"కాదు, రెండే పెట్టాలె. ఆయన బతికున్నప్పుడు ఇదే లొల్లి జరిగేది ఎప్పుడన్నా మా మాట ఇన్నారా" శవం భార్య గర్జించింది.

"అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ మేం మొత్తుకున్నది ఇదే కద"

"చెపుతె ఇంట లేదని, ఆయనను మీరే సంపిండ్రని కేసు పెడ్త ఏడ్వసాగింది.

"ఎవల మీద కేసు పెడ్తవు"

"అత్త మీద, మరిది మీద" కసిగా అంది.

"ఈ పెద్ద మనుషుల తోటి కాదుగని, సచ్చినోని తండ్రిని పిలిపియ్యండ్రి" ఒకరి సూచన.

"మొండోని కంటె దండోడెవడన్నట్లు, ఎంతసేపైన మంచిదే నువ్వే మాట్లాడుమని పెద్దమనిషిని పంపించి, రోడ్డు మీద చెద్దరేసుకుని కూసున్నాడు" మరొకరి మాట.

బయట సచ్చినోని సావు గురించి నోళ్ళు-నొసళ్ళు చెవులు-ముక్కులు ఆరా తీస్తున్నవి. ఉండుండి గాలి బలంగ వీయసాగింది. శవం మీద నుండి వీసిన గాలి దుర్గంధాన్ని అంతటికీ మోసుకెళ్ళసాగింది. అలా వెళ్ళిన గాలి స్టేషన్‌లోని ముక్కులన్నింటిని మూయించింది.

"సచ్చి ఇరవైనాలుగు గంటలయింది. పంచాయతీ తెగకపోతె ఎట్ల! ఇంక పోస్ట్‌మార్టమ్‌కు తీస్కపోవాలె. రేపు ఆదివారం. దవాఖాన బంద్ పెడ్తరు. ఇవ్వాలనే పోవాలె. ఏదో ఒకటి చెప్పండ్రి. కేసు పెడ్తరా, పంచాయతి తెంపుకుంటరా మీకు మాత్రం బాధ్యతలేదా!" శవం పెద్ద మనిషి కసురుకున్నాడు.

"మీరు మూడు పాల్లు పెడ్తం అన్నారు కదా, ఇంకో పాలు పెట్టిన బిడ్డకు పెట్టి మొత్తం అమ్మి పైసలియ్యండ్రి" శవం భార్య సమాధానం.

"తన్ని పడేస్తేంది. పడేసి తంతేంది. నువ్వు మల్ల మొదటికే వచ్చినవ భూమి జాగల ముచ్చటకాదుగని, నువ్వన్నట్టే నగదు ఇస్తం. ఎంత ఇవ్వమంటవు

మళ్ళీ కాసేపు చర్చ జరిగింది. ఇరు పక్షాలకు చెందిన సౌలభ్యాలు అంచనా వేయబడ్డాయి. చావుకు సంబంధించిన సత్యాసత్యాలు మరుగున పడ్డాయి భవిష్యత్ అవసరాలు భరణంగా రూపు దాల్చాయి. బయట ఉన్న తండ్రి, లోపలున్న భార్య ఇద్దరూ కలిసి పచ్చజెండా ఊపారు.

"నీ భర్త చావుకు సంబంధించి, నీకు ఎవరిపై సనా అనుమానముందా" కానిస్టేబుల్ మరోసారి ప్రశ్నించాడు.

"నాకు ఎవరి మీదా అనుమానం లేదు" జవాబిచ్చింది భార్య.

ఈసారి గాలి వాసనతోపాటు నవ్వును మోసుకొచ్చింది. ముక్కులు మూసుకొని అందరూ జీపు వైపు చూశారు. కాసేపటికి జీపు పోస్ట్‌మార్టమ్ కోస దౌడు తీసింది.

✤ ✤ ✤

పోస్ట్‌మార్టమ్ అయ్యాక నేరుగా స్మశానం కేసి పరుగుతీసింది జీప ఎముకలు, తోలుతో ప్యాక్ చేయబడ్డ చాపను జీపులో నుండి కిందికి దించార మొకం ఒకటి రూపానికి ఆకృతిగా మిగిలింది. ఏడ్వటానికి కూడా ఓపిక లే



# గ్లోబల్ వీధిలో

ఏబూషి నర్సింహ్మా

యుద్ధం యుద్ధం యుద్ధం
శాంతీ, శాంతీ శాంతీ
యుద్ధం వలన శాంతియా
శాంతి కోసం యుద్ధమా
ఏది దేని కోసం? ఎవరు ఎవరి కోసం?
యుద్ధం వినాశనానికి ప్రతినిధి
శాంతి వికాసానికి ప్రతినిధి
మరి మీరెవరికి ప్రతినిధి
ఏ పక్షానికి అతిథి?

యుద్ధం తలపెట్టే వారే
యుద్ధానికి ముందు శాంతి నినాదాలిస్తారు
శాంతి కోసమే యుద్ధమని నమ్మించజూస్తారు
గ్లోబెల్ ప్రచారాలే అబద్ధాలు
గ్లోబును మింగేందుకే యుద్ధాలు
యుద్ధమా! ఇది అబద్ధమా?
ప్రపంచ ప్రజల రచ్చబండపై పంచాయితీకి సిద్ధమా?!

తెగనరికిన మొండాలపై తెల్లజెండాలెగురుతాయా
తెగ్గోసిన నాలికలు శాంతిగీతం పాడుతాయా
అణచివేతలో ఆక్రోశం కాక అనురాగం పుడుతుందా
ఉగ్రవాదం పుట్టుక ఎవరి పాపం?
పాపం ఎవరిది? శిక్ష ఎవరికి?
బాధ్యులెవరు? బాధలెవరికి?

చమురు రాజకీయాల కమురు వాసన లేపిందెవరు?
భూగోళం నిండా బాంబులేసిన గూండా ఎవరు?
స్వేచ్ఛగా ఎగిరే శాంతి కపోతాల రెక్కలు విరిచిందెవరు?
నింగి నిండా యుద్ధ మేఘాలతో
మానవత్వానికి మసి పూసిందెవరు?
గ్లోబల్ వీధిలో చొరబడి
రంకె వేస్తున్న అంతర్జాతీయ రౌడీ ఎవరు?
ఎవరు శాంతి ప్రియులు? ఎవరు యుద్ధోన్మాదులు?
ఏది ప్రమోదం? ఏది ప్రమాదం?
శవాల గుట్టలు పేరుస్తూనే
రొట్టెల దానాలు చేసేదెవరు?

ఆకాశంలో విమానాలు
ర..య్యుమంటూ యుద్ధనాదం చేస్తుంటే
పేదవాడి కడుపులో పేగులు కుయ్యుమంటూ
పిడికెడు ముద్దకై నినదిస్తున్నాయి.
శాస్త్రజ్ఞానం
ఎవరి కడుపు నింపింది? ఎవరి కడుపును చంపింది?
ఏది విధ్వంసం? ఏది నిర్మాణం?

హక్కుల కోసం నినదించే స్వేచ్ఛగొంతుపై
కాలుమోపిన నియంతల బూట్ల క్రింద
తిరుగుబాట్లు పుట్టుకొస్తాయి
జనం గుండెల్లో బావుటాలై
జనం పాట పాడుతాయి
జనగీతమా? భజన గీతమా?
జన స్వామ్యమా? ధనస్వామ్యమా?

గ్లోబల్ విల్లేజంట ప్రపంచమొక కుగ్రామం
ఒకే గ్రామానికి ఇంత మంది నేతలెందుకు?!
అన్నింటికి అమెరికా ఆధిపత్యముండగా
ఇక సొంత రాజ్యాలెందుకు
సొంత ముఖాలు కూడా అక్కర్లేదు
మోకాళ్ళు మాత్రముంటే చాలు
వాడి మోచేతి నీళ్ళకోసం
ఒంగి కూర్చునేందుకు
ఇప్పుడు చెప్పండి...
స్వతంత్రులెవరు? పరతంత్రులెవరు?
సామంతులెవరు? సార్వభౌములెవరు.
ప్రపంచీకరణ పదాలు
కమ్మగా పాడుతున్న వందిమాగధుల పెదాలు
వృత్తుల చేతుల్ని నంజుకుతింటున్న
బహుళజాతి కంపెనీల కోరలు
బడుగు జీవుల బతుకుల్ని చప్పరించి
అస్తి పంజరాల పిప్పిని మాత్రమే
వెళ్ళగక్కుతున్న ప్రపంచ బ్యాంకు
ప్రణాళికల నాలికలు
భూగోళానికి పోటీగా పెరుగుతున్న బొజ్జలు
కారణమేదైతే నేమి?...
ఇప్పుడు బరువు పెరిగి పాతాళానికి
దిగబడుతున్న నూతన ప్రపంచానికై
మొలకెత్తే పిడికిళ్ళతో ఉద్యమ నినాదాలు!!
పైకి లేచివస్తారా? పాతాళాని వెళ్తారా?
ఉద్యమిస్తారా? ఊరుకుంటారా?

---

సమయం అది. ఆ ముల్లె నుండి వచ్చే వాసన వ్యాధి కారకంగా ఉంది. దూరాన్నుండి చీమలు, దోమలు వస్తున్న చప్పుడు, హడావిడిగా శవాన్ని పాతిపెట్టారు. మనుషుల్లో శూన్యం ప్రవేశించింది. నిర్వేదానికి గురయ్యారు. నిర్వేదం ఆగ్రహంగా మారింది. ఆగ్రహం ఆచరణకు దారితీసింది.

"ఫట్" మని చెంపనంటిందో చేయి. గాల్లో నుండి బలంగా వచ్చి తాకింది. చెప్పు పొడవాటి వెంట్రుకలను మెలివేసి కసిగా లాగింది మరో చేయి. పడిపోయిన మనిషి డొక్కను ముద్దాడిందో పిడికిలి. లేవలేని మనిషి తలను విసురుగా తాకిందో కాలు. ఒక్కొక్కరు ఒక్కో విధంగా హింసించి, నెమ్మదిగా వెళ్ళిపోయారు.

ఆమె లేచింది. ఏమీ పాలుపోవడంలేదు. స్పష్టమైన కారణం లేకుండానే ఏడుపు తన్నుకొచ్చింది. ఒంటరిగా, విషాదంగా కుమిలింది. ఏండ్ల తరబడి చేసిన సేవలకు ప్రతిఫలం ఇదా! పిల్లలకు తల్లిగా, భర్తకు సేవకురాలిగా, కుటుంబానికి ఆర్థిక పుష్టినిచ్చే కూలిగా కాలం వెళ్ళదీసింది. తను గడప దాటడం చూసినవారు, కారణాలను చూడలేదు. గడప దాటడానికి కారణం అయిన భర్త తిరిగి లోపలికి రానిచ్చాడు. ఏమీ కానివారు, తెలియని వారు లోకంగా మారి కాకుల్లా కూసారు, పొడిచారు. గతం ముందు కదలాడుతుండగా అడుగు ముందుకేసింది.

❖

# 'కన్యాశుల్కం' ఈనాటికీ ఎందుకు సజీవంగా ఉంది?

**ఇటీవలనే ఒక నాటక విమర్శకుడు 'కన్యాశుల్కం' నాటకంలో 'మృచ్ఛకటికం'లోని కొన్ని అంశాలు యథాతథంగా వచ్చి చేరాయని, 'కన్యాశుల్కం'లో ఒరిజినాలిటీ చాలా తక్కువని విమర్శించాడు. ఇది చాలా అన్యాయమైన విమర్శ.**

## అంపశయ్య నవీన్

గురజాడ అప్పారావు దాదాపు వంద సంవత్సరాల క్రితం రచించిన "కన్యాశుల్కం" నాటకాన్ని గూర్చిన చర్చ ఈనాటికీ జరుగుతూనే ఉంది. ఇంతటి గొప్ప నాటకం తెలుగులో మరొకటి లేదు అనే వాళ్ళు న్నారు. ఇంతటి లోపభూయిష్టమైన నాటకం మరొకటి లేదు అనే వాళ్ళూ ఉన్నారు. అయితే ఇంత కాలం ఇంత మంది ఈ నాటకాన్ని గూర్చి ఇంతగా చర్చించడమొక్కటే చాలు, ఈ నాటకం యొక్క వైశిష్ట్యాన్ని చాటడానికి.•

గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' మొదటి కూర్పును 1897లో రచించాడు. ఆ సంవత్సరమే ఈ నాటకాన్ని ప్రదర్శించారు. అయితే ఈ మొదటి కూర్పుతో గురజాడ యే మాత్రం సంతృప్తి చెందలేదు. అందుకే దీన్లో చాలా మార్పులు చేర్పులు చేసి, 1909లో రెండోసారి ప్రచురించాడు. మనకిప్పుడు లభ్యమ వుతున్నది గురజాడ రెండో "కన్యాశుల్కమే". మొదటి కూర్పుకంటె రెండో కూర్పు రాశిలోనూ, వాసిలోనూ చాలా పెద్దదైపోయింది.

"కన్యాశుల్కం" నాటకానికింత పేరు ప్రఖ్యాతులు రావడానికి రెండు ముఖ్యకారణా లున్నాయి. అందులో ఒకటి : మొదటిసారిగా ఈ నాటకంలో రచయిత ఒక సమకాలీన సాంఘిక సమస్యను ఇతివృత్తంగా తీసుకోవడం. కన్యాశుల్కానికి ముందు వెలువడిన యే తెలుగు నాటకంలో కూడా ఇది జరగలేదు. రెండవది : ప్రజలు తమ నిత్య జీవితంలో మాట్లాడే భాషనే ఈ నాటకంలోని పాత్రల చేత మాట్లాడించడం. దీన్నే పాత్రోచిత సంభాషణ అన్నారు. కన్యాశుల్కం నాటకానికి ముందే వెలువడిన వేదం వెంకటరాయ శాస్త్రి రచించిన "ప్రతాప రుద్రీయం" నాటకంలో కొన్ని చోట్ల కొన్ని పాత్రలకు మాత్రమే పాత్రోచిత సంభాషణలు కనిపిస్తాయి. కానీ 'కన్యాశుల్కం' నాటకంలో ప్రారంభం నుండి చివరి వరకు అన్ని పాత్రలూ పాత్రోచిత సంభాషణలనే మాట్లాడటం మనం చూస్తాం. ఇలా సమకాలీన సాంఘిక సమస్యను కథాంశంగా తీసుకోవడం, పాత్రోచిత సంభాషణల్ని వాడటం కన్యా శుల్కంలో గురజాడ చేసిన అత్యంత సాహసోపేతమైన ప్రయోగాలు. ఈ కారణంవల్లనే కన్యాశుల్కం నాటకం ఆధునిక తెలుగు సాహిత్యాన్ని ఎంతో గాఢంగా ప్రభావితం చేసింది. ఆధునిక వచన సాహిత్యాన్ని ఇంత గాఢంగా ప్రభావితం చేసిన రచనలు చాలా తక్కువే అని చెప్పాలి.

ప్రపంచ సాహిత్యంలో నాటకానికి సమకాలీన సాంఘిక సమస్యను ఇతివృత్తంగా తీసుకొని మొట్టమొదటి నాటకాన్ని రచించిన రచయిత యూరప్‌లోని నార్వే దేశానికి చెందిన "హెన్రిక్ ఇబ్సన్". ఈయన 1877లోనే "పిల్లర్స్ ఆఫ్ ది సొసైటి" అనే నాటకాన్ని ఆనాటి సమకాలీన సాంఘిక సమస్యను ఇతివృత్తంగా తీసుకొని రచించాడు. ప్రపంచంలో సాంఘిక నాటకాలకు ఈ నాటకంతోటే శ్రీకారం చుట్టబడింది. అయితే ఇరవయ్యవ శతాబ్దపు ప్రారంభంలో "బెర్నార్డుషా" "ఇబ్సన్" నాటకాల్లోని పాశస్త్యాన్ని గూర్చి ప్రచారం చేసేంత వరకు ఇబ్సన్‌ను గూర్చి ప్రపంచ సాహితీ వేత్తలకెవరికీ తెలీదు. ఇబ్సన్ సాంఘిక నాటకాలతో ప్రభావితుడై బెర్నార్డ్‌షా ఇంగ్లీషులో 1892లో "విడోయర్స్ హౌజెస్" అనే సాంఘిక నాటకం రాశాడు. ఈ నాటకాన్నే ఇంగ్లీషులో రచించబడిన మొట్టమొదటి సాంఘిక నాటకమని సాహిత్య చరిత్ర కారులు నిర్ణయించారు. ఇబ్సన్‌వల్ల ప్రభావితులైన వాళ్ళల్లో రష్యన్ నాటక రచయిత "చెహోవ్" కూడా ఒకరు.

గురజాడ ఇబ్సన్ నాటకాలను చదివాడు. అలాగే ఇంగ్లాండ్‌లో బెర్నార్డుషా నాటకరంగంలో తెస్తున్న మార్పుల్ని కూడా అధ్యయనం చేశాడు. అలాగే భారతీయ సాహిత్యంలో "మృచ్ఛకటికం" లాంటి సంస్కృత నాటకాలను కూడా పరిశీలించాడు.

వీటన్నిటి ఫలితమే ఆయన రచించిన "కన్యాశుల్కం"

ఈ నాటకంలో గురజాడ ఇతివృత్తంగ
స్వీకరించిన సాంఘిక సమస్యేమిటో చూద్దాం. ఆ
రోజుల్లో ఉత్తరాంధ్రలోని బ్రాహ్మణకుటుంబాల్
"కన్యాశుల్కం" అనే ఒక తీవ్రమైన సమస్య ఉండేది
కన్యాశుల్కమంటే ఈనాటి వరకట్నం అనే సమస్యక
వ్యతిరేకమైన సమస్య-వధువు తల్లితండ్రులు వరు
తల్లితండ్రులకు కట్నం ఇవ్వడం కాకుండా వరు
వధువుకు కట్నమిచ్చి పెళ్ళి చేసుకోవడాన్ని
'కన్యాశుల్కం' అన్నారు. వయస్సు మళ్ళిన పురుషు
రెండో పెళ్ళో, మూడో పెళ్ళో చేసుకోదల్చుకున్నప్పుడ
చాలా ఎక్కువ కన్యాశుల్కం చెల్లించుకోవాల్సి వచ్చేది
అట్లా చెల్లిస్తేనే వాళ్ళకు కన్యలు దొరికేవాళ్ళు. ఎక్కు
కన్యాశుల్కానికి ఆశపడి కన్యల తండ్రులు త
కూతుళ్ళను ఎంత ముసలివాళ్ళకైనా ఇచ్చిపెం
చెయ్యడానికి ముందుకొచ్చేవాళ్ళు. ఎనిమిదేళ్ళు కూడ
నిండని కన్యల్ని యాభయ్యేళ్ళు పైబడిన వృద్ధులకి
పెండ్లి చెయ్యడం జరుగుతుండేది. దాంతో చాలా చి
వయస్సులోనే అనేక మంది. ఆడపిల్లలు బా
వితంతువులుగా మారిపోతుండే వాళ్ళు.
దురాచారాన్ని చూసి చలించిన గురజాడ అప్పారా
ఈ సమస్యను నేపథ్యంగా తీసుకొని ఓ నాటక
రాయాలని నిర్ణయించుకున్నాడు. తత్ఫలిత
కన్యాశుల్కం" నాటకం.

ఇప్పుడు "కన్యాశుల్కం" అ
సమస్యలేదు. దాని స్థానంలో 'వరకట్నం' అనే సమ
ఈనాడు సమాజాన్ని పీడిస్తోంది. కన్యాశుల్కం అ
సాంఘిక సమస్య కాలగర్భంలో కలిసిపోయినప్పటి
గురజాడ రచించిన 'కన్యాశుల్కం' నాటకం మాత్ర
ఈ నాటికీ సజీవంగానే ఉంది. ఈనాటికూ
కన్యాశుల్కంలోని కొన్ని పాత్రలూ, కొన్ని సంభాషణ
ప్రజల హృదయాల్లో పలుకుతూనే ఉన్నాయి.
నాటకం వెలువడి వంద సంవత్సరాలవుతున
ఈనాటకం ఇంకా ప్రజల నాలుకల మీద ఆడటాని
కారణాలేమిటి? అని పరిశీలిస్తే రెండు కారణా
కనిపిస్తాయి.

అందులో మొదటిది. ఈ నాటకంలో
సజీవ పాత్రలు. మనకు మన సమాజంలో మ
దైనందిన జీవితంలో కనిపించే ఎంతోమంది వ్యక్తు
నమూనాలు మనకీ నాటకంలో కనిపిస్తాయి. యే
చెయ్యకుండా కేవలం మాటలతో టోపీ వేసేవాళ్ళ
చూడగానే మనకీ నాటకంలోని "గిరీశం" గుర్తొస్తా
ఎంతటి విపత్కరమైన పరిస్థితినైనా మాటలతో తమ
అనుకూలంగా మార్చుకోగల్గే శక్తి ఉన్న వాళ్ళంద
గిరీశాన్ని ప్రతినిధిగా చెప్పుకోవచ్చు. ఇంగ్లీషు మాట



విరివిగా వాడి ఎదుటి వాడికి ఇతడు బాగా చదువుకున్న వాడే అనే అభిప్రాయాన్ని కల్గించాలనే మోజు కూడా గిరీశంతోటే ప్రారంభమయ్యింది – పాశ్చాత్య సంస్కృతి ఎలా దేశీయ సంస్కృతి మీద దాడి చేసిందో మనం గిరీశం ద్వారా చూడొచ్చు.

అలాగే ప్రతి చిన్న విషయానికీ కోర్టులకు వెళ్ళడానికి సిద్ధమయ్యే లిటిగెంట్లకు – అంటే కోర్టు పక్షులకు, జిత్తులమారి వాళ్ళకూ ప్రతినిధిగా ఈ నాటకంలోని రామప్పంతుల్ని ఈనాటికీ ప్రజలు చెప్పుకుంటున్నారు. ప్రతిచిన్న విషయానికీ కోపంతో ఊగిపోయే ముక్కోపులను అగ్నిహోత్రావధానుల్లో చూడొచ్చు. కరుడుగట్టిన ఛాందస సాంప్రదాయ వాదులకు ప్రతినిధిగా కూడా అగ్నిహోత్రావధానుల్ని చెప్పుకోవచ్చు. వేశ్యల్లో కూడా మంచి వాళ్ళుంటారని మధురవాణిని చూస్తే అర్థమవుతుంది. అలాగే ఈనాటికీ మనం సమాజంలో యథేచ్ఛగా తిరుగుతూ అమాయక ప్రజల్ని మోసగించే దొంగస్వాములకు ప్రతినిధిగా 'బైరాగి'ని, యే ఎండకాగొడుగు పట్టే వాళ్ళకు ప్రతినిధిగా "అసిరిగాడ్ని" చూపించవచ్చు. అరవయ్యేళ్ళొచ్చినా మళ్ళీ పెండ్లి చేసుకోవాలని తహతహలాడే పురుషపుంగవులకు ప్రతినిధిగా లుబ్ధావధానుల్ని చూపించవచ్చు. ఉత్తముడైన న్యాయవాదికి ఉదాహరణగా సౌజన్యరావు పంతుల్ని చెప్పవచ్చు. ఇలా ఈ నాటకంలోని ప్రతిపాత్రనూ మనం ఈనాటికీ మన సమాజంలో గుర్తించవచ్చు. "కన్యాశుల్కం" ఈనాటికీ సజీవంగా మన హృదయాల్లో నిలిచిపోవడానికి ముఖ్యకారణం ఈ సార్వకాలీనమైన, సార్వజనీనమైన పాత్రలే.

ఈ నాటకం ఈనాటికీ సజీవంగా ఉండటానికి రెండో కారణం ఈ నాటకంలోని సంభాషణలు.

నాటకానికి సంభాషణలే ప్రాణమని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. సంభాషణలు ఎంత సార్వకాలీనంగా, సార్వజనీనంగా ఉంటే ఆ నాటకం అంత రక్తికడుతుంది. 'కన్యాశుల్కం' నాటకాన్ని గూర్చి మనం ఈనాటికీ ముచ్చటించుకోవడానికి ప్రధాన కారణం ఈ నాటకంలోని సార్వజనీనమైన, సార్వకాలీనమైన ఈ సంభాషణలే.

ఈ నాటకంలోని అలాంటి కొన్ని సంభాషణలకు మచ్చుతునకలు :

"సాయంకాలమైంది" అన్న మాటతో ప్రారంభమైన ఈ నాటకం "డామిట్! కథ అడ్డంగా తిరిగింది" అన్న మాటతో అంతమవుతుంది. ఈ రెండు మాటలు గిరీశం నోటి నుండే వెలువడ్డాయి. ఈ రెండు మాటలూ ఎంత ప్రచారాన్ని పొందాయంటే ఈ మాటల్ని శీర్షికలుగా పెట్టుకొని కొన్ని రచనలు వెలువడ్డాయి. "సాయంకాలమైంది!" అన్న పేరుతో గొల్లపూడి మారుతీరావు ఇటీవలనే ఓ నవల రాశాడు. "కథ అడ్డం తిరిగింది" లేక "డామిట్! కథ అడ్డంగా తిరిగింది!" అన్నమాట ఈనాడు జనసామాన్యంలో మామూలైపోయింది. మనం అనుకున్నది జరగనప్పుడో, మన పథకం పారనప్పుడో "డామిట్! కథ అడ్డం తిరిగిందంటాం. అలాగే గిరీశం నోటి నుండి వెలువడే మరికొన్ని మాటలు : "పూర్రిచర్డు చెప్పినట్టు, పేషెన్స్ ఉంటేగానీ లోకంలో నెగ్గలేం" ఈ పూర్రిచర్డు ఎవరో మనకు తెలీదుగానీ "పేషెన్స్ ఉంటేగానీ లోకంలో నెగ్గలేమన్న" మాట ఎంత మంచిమాటో అనిపిస్తుంది.

శిష్యుడు వెంకటేశాన్ని చూడగానే గిరీశం "యేమివాయ్, మైడియర్ షేక్స్పియర్, ముఖం వేలవేసినావ్?" అంటాడు. ఈ మాటవినగానే ముఖం వేలాడేసుకొని కనిపించే షేక్స్పియర్ బొమ్మ మన కళ్ళల్లో మెదులుతుంది. ఎక్కడ కనిపించినా షేక్స్పియర్ బొమ్మ మనకు ఒకటే ఒక రూపంలోనే కనిపిస్తుంది. ఎందుకంటే మనకు లభ్యమవుతున్నది ఒకే ఒక షేక్స్పియర్ బొమ్మ (దాన్ని షేక్స్పియర్ సమకాలీనుడైన ఓ ఆర్టిస్టువేశాట్ట) అదొక్కటి తప్ప మరో ఫోజులో ఉన్న షేక్స్పియర్ చిత్రమేదీ మనకు కనిపించదు. పరీక్ష ఫెయిలయివస్తున్న శిష్యుని చూడగానే గిరీశానికి ముఖం వేలాడేసుకొని ఉండే షేక్స్పియర్ చిత్రం గుర్తొచ్చి ఉంటుంది. అందుకే శిష్యున్ని "యేమివాయ్, మైడియర్ షేక్స్పియర్, ముఖం వెలవేసినావ్!" అంటూ పలకరించాడు.

"మీవల్ల నాకొచ్చిందల్లా చుట్టకాల్చడమొక్కటే!" అని శిష్యుడు వెంకటేశం అన్నప్పుడు గిరీశం "ఇది బేస్ ఇన్‌గ్రాటిట్యూడ్. నాతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్!" అంటాడు. "నాతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్" అన్నమాట ఎలా ఒక పలుకుబడిగా మారిందో అందరికీ తెలిసిన విషయమే! శిష్యునికి ఈ పుస్తకాలు కొనుక్కొమ్మని చెబుతూ గిరీశం "కుప్పుసామయ్యర్, మేడిఫికల్టీ!" కూడా కొనుక్కొచ్చుకొమ్మంటాడు. ఎవరైన సులభమైన విషయాన్ని కష్టతరమైన విషయంగా మార్చడాన్ని చూసినప్పుడు మనకు "కుప్పుసామయ్యర్ మేడిఫకల్టీ!" అన్న ఈ మాట తప్పకుండా గుర్తొస్తుంది.

ఫొటోగ్రాఫులు తీయించుకున్న డబ్బులిమ్మని నిలదీసిన బంట్రోతుతో "రేపు డబ్బిచ్చేస్తాను. గాయిత్రి పట్టుకు ప్రమాణం చేస్తానంటాడు" గిరీశం. దాంతో అతని మాటను నమ్మి ఆ బంట్రోతు వెళ్ళిపోతాడు. అప్పుడు గిరీశం "ఇన్నాళ్ళకి జంఝప్పోగు వినియోగంలో కొచ్చింది. థియోసోఫిస్టులు చెప్పినట్టు మన ఓల్డు కస్టమ్స్‌కన్నింటికీ ఏదో ఒక ప్రయోజనం ఆలోచించే మన వాళ్ళు ఏర్పరచారు" అంటాడు. మన ప్రతి సంప్రదాయాన్ని సమర్థించే ఛాందసుల మీదకు గురజాడ విసిరిన ఓ విసురిది. కన్యాశుల్కంలోని జనసామాన్యంలోకి వెళ్ళిన ఎన్నో మాటల్లో ఇదొకటి.

మధురవాణి ఇంట్లో గిరీశం కూడా మధురవాణి ఇంటికే రావడాన్ని చూసిన రామప్పంతులు మంచం కింద దాక్కొని "ఎరక్క చిక్కడ్డానే" అనుకుంటాడు. ఈ "ఎరక్క చిక్కడ్డానే" అన్నమాటను పట్టుకొని ముళ్ళపూడి వెంకటరమణ, బాపూ ఎన్ని జోక్స్‌ని, ఎన్ని కార్టూన్స్‌ని సృష్టించారో లెక్కలేదు.

అగ్నిహోత్రావధానులు ఎక్కువ కన్యాశుల్కానికి ఆశపడి తన ఎనిమిదేళ్ళ కూతురు సుబ్బిపెండ్లిని అరవయ్యేళ్ళ ముసిలాడు లుబ్ధావధానుల్తో చెయ్యాలని నిర్ణయిస్తాడు. "ఇదేం అన్యాయ"మని అతని బావమరిది "కరకటశాస్త్రి", భార్య "వెంకమ్మ" లబోదిబోమని మొత్తుకుంటోంటే "తాంబూలాలు ఇచ్చేశాను. తన్నుకుచావండి" అంటాడు అగ్నిహోత్రావధానులు. ఈ "తాంబూలాలు ఇచ్చేశాను. తన్నుకు చావండి" అనేమాట మన దైనందిన జీవితంలో అంతర్భాగమైపోయింది. ఓ కుటుంబంలో మెజారిటీ సభ్యులకు ఇష్టంలేని పనిచేసిన ఆ కుటుంబ యజమానిని ఇదేమిటని వాళ్ళడిగినప్పుడు "తాంబూలాలిచ్చేశాను. తన్నుకు చావండి" అనడాన్ని మనం ఎన్నోసార్లు వింటూనే ఉంటాం.

మోసానికీ, లౌక్యానికీ వ్యత్యాసాన్ని చెబుతూ రామప్పంతులు "నమ్మినచోట చేస్తే మోసం, నమ్మని చోటచేస్తే లౌక్యం" అంటాడు. అప్పుడు మధురవాణి

"తాను చేస్తే లౌక్యం, మరొకడు చేస్తే మోసం" అనరాదూ? అంటుంది. జనసామాన్యంలో కలిసిపోయిన మాటల్లో ఇదొకటి.

అసలు లౌక్యమంటే ఏమిటో రామప్పంతులు చెప్పిన నిర్వచనం మహాగొప్పది. "అసాధ్యాలు సాధ్యం, సాధ్యాలు అసాధ్యాలు చెయ్యడమే లౌక్యం" అంటాడు రామప్పంతులు.

గిరీశం బాలవితంతువు బుచ్చమ్మ ప్రేమలో పడిపోయి గొప్ప విరహానికి గురవుతాడు. అప్పుడు గిరీశం తన మనోభావాల్ని చెప్పిన తీరు అద్భుతంగా ఉంటుంది.

మన్మథబాణాల్ని గూర్చి చెబుతూ "వీడి బాణాలు" పువ్వులటోయి? కావు–మంచి పదును పెట్టిన లోహం మొనకి, డయిమండ్ పాయింట్ వేసి పాయిజన్‌లో ముంచి, కంటికి కనపడకుండా మంత్రించి విసురుతాడు. అంచేతనే, పైకి గాయం కనపడదుగానీ పోలీసువాళ్ళ దెబ్బల్లాగ లోపలలోపల తహతహ

"పుట్టిస్తాయి." అంటాడు గిరీశం. ఇక్కడ "పోలీసువాళ్ళ దెబ్బల్లాగ" అన్నమాట మాస్టర్‌స్ట్రోక్! మన్మథబాణాల్ని పోలీసువాళ్ళ దెబ్బలతో పోల్చడం ఒక గురజాడ లాంటి జీనియస్‌కే సాధ్యం. "పోలీసుల దెబ్బల్లాగ" అన్నమాట కూడా జనసామాన్యపు నిఘంటువులో చేరిపోయింది.

మధురవాణికీ, బుచ్చమ్మకూ మధ్యన ఉన్న తేడా చెబుతూ "అది (మధురవాణి) రంగువేసిన గాజుపూస. ఇది (బుచ్చమ్మ) ప్యూర్‌డైమండ్!" అంటాడు గిరీశం. అలాగే "టు మ్యారీయె విడో, ఆర్ నాట్టు మ్యారీ! దటీజ్‌ది క్వశ్చన్! షేక్స్పియర్ పడ్డ అవస్థలో పడ్డామే!" అనుకుంటాడు గిరీశం.

రాచకొండ విశ్వనాథ శాస్త్రి రచనలన్నింటి మీదా 'కన్యాశుల్కం' ప్రభావం కనిపిస్తుంది. అలాగే ముళ్ళపూడి వెంకట రమణ హాస్య రచనలన్నింటికీ మూలం కన్యాశుల్కమేనని చెప్పొచ్చు. అలాగే శ్రీశ్రీలోని విదూషకుడి మనస్తత్వానికీ, ఆరుద్రలోని ఇంగ్లీషుపదాల మీది మోజుకూ కన్యాశుల్కమే ప్రేరణ.

షేక్స్పియర్ రాసిన "హామ్లెట్" నాటకంలోని హామ్లెట్ గొప్ప స్వగతాల్లో "టు బీ, ఆర్ నాట్టుబీ, దటీజ్‌ది క్వశ్చన్?" అన్న మాటతో ప్రారంభమయ్యే స్వగతాన్ని గూర్చి గిరీశానికి తెలుసునని ఈ మాట రుజువు చేస్తుంది. దీన్ని బట్టి గిరీశానికొచ్చింది. రామప్పంతులన్నట్టు "బొట్లేరు ఇంగ్లీషు" మాత్రమే కాదని కూడా అర్థమౌతుంది.

గిరీశం మరోచోట "మనవాళ్ళు వట్టి వెధవాయలోయ్!" అంటాడు. అలాగే ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ గురించి ఓ జట్కా నడిపేవాడికి గిరీశం ఓ లెక్చరిస్తే ఆ జట్కావాడు గిరీశాన్ని"ఈ కాంగ్రెస్ వాళ్ళు మనూరి హెడ్ కానిస్టేబుల్‌ని ఎప్పుడు బదిలీ చేస్తారండి?" అని అడుగుతాడు. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఎన్ని మహత్తర కార్యాలైనా చెయ్యొచ్చు.కానీ ఆ జట్కానడుపుకునే వాడికి మాత్రం హెడ్ కానిస్టేబుల్ ఓ పెద్ద సమస్య.

"ఈ తెల్లవాళ్ళు చేసే విద్యలన్నీ మన గ్రంథాల్లోంచి యెత్తుకెళ్ళినవే. ఈ రెయిళ్ళూ, గియిళ్ళూ యావత్తూ మన వేదంలో ఉన్నాయష!" అంటాడు. అగ్నిహోత్రావధాన్లు. "అన్నీ మన వేదాల్లోనే ఉన్నాయష!" అనుకునేవాళ్ళు ఈనాటికీ ఉన్నారు. నిజానికి వాళ్ళ సంఖ్య ఈ రోజుల్లో ఇంకా పెరిగిపోతున్నది. నిజంగానే అన్నీ మన వేదాల్లోనే ఉన్నాయనుకుందాం. దానివల్ల ఇవ్వాళ సామాన్యప్రజలకు ఒనగూడిన ప్రయోజనమేమిటి? ఇప్పటికైనా వేదాల్లో ఉన్న ఆ సాంకేతిక పరిజ్ఞానాన్నంతా ఉపయోగించుకొని ఈ దేశంలో ఉన్న దారిద్ర్యాన్నీ పోగొట్టొచ్చుకదా! దేశానికుపయోగపడే యంత్రాలనో, సాంకేతిక పరిజ్ఞానాన్నో తయారు చేసి చూపించకూడదూ? అన్నీ వేదాల్లోనే ఉన్నాయని దబాయిస్తే సరిపోతుందా? ఈ మధ్యనే ఓ నాటక విమర్శకుడు 'కన్యాశుల్కం' నాటకాన్ని చీల్చిచెండాడుతూ "అన్నీ మన వేదాల్లోనే ఉన్నాయష!" అని కన్యాశుల్కంలో వేదాలను ఎద్దేవా చేయడాన్ని తప్పు పట్టడం చూస్తే చాలా ఆశ్చర్యం కల్గుతుంది.

ఒక నాటకంగా మాత్రమే చూస్తే కన్యాశుల్కంలో చాలా లోపాలు కనిపించే మాట వాస్తవమే. నాటకం ప్రధానంగా రంగస్థలం మీద ప్రదర్శించడానికి యోగ్యంగా ఉండాలి. కానీ 'కన్యాశుల్కం'లో ప్రదర్శనయోగ్యతను గూర్చి, దీన్నే స్టేజ్‌క్రాఫ్ట్ అంటాం, గురజాడ పట్టించుకోలేదు. అందుకే ఈ నాటకాన్ని ఉన్నదున్నట్టుగా ఇంత వరకు యేనాటక సంస్థ వారు కూడా ప్రదర్శించలేకపోయారు. యేడు అంకాలున్న ఈ నాటకంలో వందకుపైగా దృశ్యాలున్నాయి. అంటే కనీసం వందసార్లు తెర వెయ్యడం, తీయడం జరగాలన్న మాట – ఈ నాటకం మొత్తాన్ని ప్రదర్శించడానికి ఆరు గంటల సమయం పడ్తుంది. నాటక ప్రదర్శనలోని సాధ్యాసాధ్యాలు తెలిసిన రచయితలెవ్వరూ ఇన్ని దృశ్యాలూ, ఇంత సమయమూ, ఇన్ని పాత్రలతో నిండిన నాటకాన్ని రాయరు. ఈ కారణంవల్లనే "కన్యాశుల్కం" నాటకాన్ని చూసి ఆనందించిన వాళ్ళకంటే చదివి ఆనందించిన వాళ్ళే ఎక్కువయ్యారు. అందుకే కన్యాశుల్కం అసలు నాటకమే కాదనీ, దాన్ని గురజాడ నవలగా రాయబోయి నాటకంగా రాశాడనే విమర్శకులున్నారు. ఈ విమర్శలో కొంత నిజంలేకపోలేదు. అలాగే ఈ నాటకంలో ఓ పురుషుడు స్త్రీ వేషం వేయాల్సిన ప్రధానఘట్టమొకటుంది. స్త్రీ వేషంలో ఉన్న పురుషుడ్నే లుబ్ధావధాన్లు పెళ్ళి చేసుకుంటాడు. పెళ్ళి చేసే ముందు పెళ్ళికూతురికి మంగళస్నానం చేయిస్తారు కదా అప్పుడు అసలు రహస్యం బయటపడక తప్పదుగదా! ఇది ఈ నాటకంలోని పెద్దలోపం.

ఈ నాటకంలో కేవలం బ్రాహ్మణకుటుంబాల చిత్రణమాత్రమే ఉందనీ, ఇందులో ఉదాత్తపాత్రలేవీ లేవనీ, ఉదాత్తపాత్రల కనిపించే సౌజన్యారావు పంతులు ఈ నాటకం చివర వస్తాడనీ, బ్రాహ్మణుల్లో ఎన్నో శాఖలుంటాయనీ, గురజాడ ఒక శాఖకు చెందిన బ్రాహ్మణులను నీచంగా చూపించి, తన శాఖకు చెందిన బ్రాహ్మణులను గొప్పగ చూపించాడనీ, ఈ నాటకంలో ఆనాటి యే సంఘ సంస్కరణోద్యమాన్నీ బలపర నట్టు కనిపించదనీ, వీరేశలింగం పంతులు ప్రారంభించిన వితంతు వివాహాలన ఎద్దేవా చేసినట్టు కనిపిస్తుందనీ, కథకు ఎక్కువ ప్రాధాన్యంలేని గిరీశం పాత్రకు అవసరానికి మించిన ప్రాధాన్యం ఇవ్వబడిందని, అసలు గిరీశం పాత్ర మీ రచయితలకు నియంత్రణ తప్పిపోయిందన్నీ, ప్రాచీన నాటకరంగ సంప్రదాయాలే ఈ నాటకంలో పాటించబడిలేదనీ, ఇలా "కన్యాశుల్కం" నాటకాన్ని ఎంతో మం ఎన్నో రకాలుగా విమర్శించారు. కానీ ఈ విమర్శల్లో పెద్దగా బలం లేదు.

ఒక రచన గొప్పతనాన్ని నిర్ణయించేది ఆ రచన ఆ సాహిత్యం వచ్చిన తర్వాతి రచనల మీద ఎంత ప్రభావం కల్గించింది అన్న అంశమే. ఈ దృష్టితో చూసినప్పుడు 'కన్యాశుల్కం' ఎంత గొప్పరచనో అర్థమవుతుంది. రాచకొం విశ్వనాథ శాస్త్రి రచనలన్నింటి మీదా 'కన్యాశుల్కం' ప్రభావం కనిపిస్తుంది. అల ముళ్ళపూడి వెంకట రమణ హాస్య రచనలన్నింటికీ మూలం కన్యాశుల్కమేన చెప్పొచ్చు. అలాగే శ్రీశ్రీలోని విదూషకుడి మనస్తత్వానికీ, ఆరుద్రలోని ఇంగ్లీషుపదా మీది మోజుకూ కన్యాశుల్కమే ప్రేరణ. వీళ్ళే కాకుండా ఇంకా ఎంతో మం 'కన్యాశుల్కం'తో ప్రభావితులయ్యారు. అయితే ఆశ్చర్యకరమైన విషయమేమిటం కన్యాశుల్కం యొక్క ప్రభావం తెలుగు నాటకాల మీద ఎక్కువగా లేదు. నవల మీద, కథల మీద, కవిత్వం మీదనే 'కన్యాశుల్కం' ప్రభావం ఎక్కువగా కనిపిస్తుం అందుకే కన్యాశుల్కాన్ని కేవలం నాటకంగా మాత్రమే చూడకుండా ఓ గొ సాహిత్యశకలంగా చూడాలి.

'కన్యాశుల్కం' మీది మరో విమర్శ. ఇది శూద్రకుడు సంస్కృతం రచించిన "మృచ్ఛకటికం" నాటకానికి ఇంచుమించు అనువాదరచన అనీ. ఇటీవ ఒక నాటక విమర్శకుడు 'కన్యాశుల్కం' నాటకంలో 'మృచ్ఛకటికం'లోని కొ అంశాలు యథాతథంగా వచ్చి చేరాయని, 'కన్యాశుల్కం'లో ఒరిజినాలిటీ చా తక్కువని విమర్శించాడు. ఇది చాలా అన్యాయమైన విమర్శ. 'మృచ్ఛకటిక నాటకాన్ని 'స్వర్ణశకటం' పేరుతో వరంగల్‌కు చెందిన విద్వాన్ టి.వి. సుబ్బార తేటతెల్లమైన తెలుగులోకి అనువదించారు. ఈ అనువాదాన్ని నేను చదివా యేవో కొన్ని పోలికలు చూపించవచ్చునే తప్ప "మృచ్ఛకటికా"నికి "కన్యాశుల్క అనువాదం అనడం అసమంజసం. కావాలని "కన్యాశుల్కం" నాటకాన్ని తక చెయ్యడం కోసమే కొందరు మేధావులు ఇలాంటి విమర్శలు చేస్తుంటా 'మృచ్ఛకటికం' తెలుగు అనువాదం చదివిన వాళ్ళకెవరికైనా అర్థమౌతుంది.




మహమ్మద్ ఖదీర్‌బాబు

ఖైరతాబాద్ రూములో ఉండంగా
మా తమ్ముడు ఒక రోజు ఉన్నట్టుండి
కడుపునొప్పి అని ఆ తర్వాత బ్లడ్ టెస్టు
చేయించుకొని వచ్చి 'భయ్యా జాండీసు వచ్చింది'
అని చెప్పినాడు.

నా గుండె డాం అంది.

మా అమ్మ మమ్మల్ని ఎట్టా
పెంచిందంటే జ్వరం వస్తే గుడ్డు పెట్టేది కాదు
కామెర్లు వస్తాయని. అంత భయం. ఆ భయం
భయం మాకు అట్టే దిగిపోయింది. ఇద్దరం ఒకే
రూములో ఉన్నప్పుడు వాడు తాగిన నీళ్ళే నేను
కూడా తాగి ఉంటాను గదా, వాడికి జాండీసు
వస్తే నాక్కూడా వచ్చుండాలని చెప్పి నేను డాక్టరు
దగ్గరికి పరుగెత్తకుండా నేరుగా బ్లడ్ టెస్ట్
చేయించుకున్నాను. మా ఏరియాలో ఒక ల్యాబ్
దగ్గరికెళ్ళి.

ఆడ నూటాబై తీసుకొని టెస్టు చేసి
బిల్‌రుబీను వన్ పాయింటు ఫైవ్ ఉన్నదని
చెప్పినారు.

నార్మల్ వన్ కాబట్టి, ఇప్పుడు వన్
పాయింటు ఫైవ్ ఉంది. కాబట్టి జస్ట్ స్టార్టింగ్‌లో
ఉంది జాండీసు అని ఇంక నేను పత్యం
మొదలుపెట్టేసినాను. ఉప్పు లేని అన్నం...
కారమలేని పప్పు... మజ్జిగ... గ్లూకోజు...
పొద్దునా సాయంత్రం లివ్ ఫిఫ్టీటూ టానిక్కు...

బరువు తగ్గతా ఉన్నాను. నీరసం
పెరగతా ఉంది. మళ్ళా రెండు వారాలకు పోయి
టెస్ట్ చేయించుకుంటే ఈసారి బిల్‌రుబీను వన్
పాయింటు సెవన్ ఉంది... ఇదేందిరా స్వామీ
మా తమ్ముడికి తగ్గిపోయింది నాకు తగ్గలేదు
అనుకొని ఇంకా గట్టింగా పత్యం
మొదలుపెట్టినాను. నీళ్ళు బయటయి కాకుండా
ఇరు లీటర్ల బిస్లరీ క్యాన్లు కొనుక్కుని తాగడం...
ఈ లోపల ఒక ఆయుర్వేదం ఆయన తగిలి
నిమ్మకాయంత చింతపండును నానబెట్టి ఆ
నీళ్ళల్లో చిటికెడు సున్నం కలుపుకొని మూడు
రోజులు తాగితే టకాలున కామెర్లు
తగ్గిపోతాయని చెబితే ఆ పని కూడా చేసినాను.

పది రోజులు గడిచినాక మళ్ళా టెస్ట్
చేయించుకుంటే ఈసారి బిల్‌రుబీన్ టూ
పాయింట్ సిక్సుకు చేరుకుంది. ఆ...
ఇంకైపోయినాములా మనము లివరుకు ఏందో
పెద్ద ప్రాబ్లమే వచ్చేసింది. అని మా ఆఫీసులో
నానా హడావిడి చేస్తే మా వాళ్ళంతా ఏంది
యీడి గొడవ అన్నట్టుగా చూసినారు ఏం
చేయాల్నో తెలియక.

ఈ లోపల పక్క సెక్షనులోని








**పోలేరమ్మ బండ కతలు**
**మహమ్మద్ ఖదీర్‌బాబు**
**వెల : రు.70, కావలి ప్రచురణలు**

పొనుగోటి కృష్ణారెడ్డిగారుండేసి... ఇట్టా గ్లోబల్
హాస్పిటల్ అని ఒక మంచి హాస్పిటల్ ఉంది
ఆడ చెరుకూరి అనిల్‌కుమార్ అని మంచి
డాక్టరు ఉన్నాడు ఆయన కాడికిపో మందిస్తాడు
అని ధైర్యం చెప్పి పంపించాడు. నేను పోయి
ఆ డాక్టరు కాడ బిక్కమొకం పెట్టుకుని నిలబడితే
ఆయన నన్ను అట్టా యిట్టా చూసి - బాబూ
నీకు ఇప్పటి దాకా జాండీసు రాలేదు, వచ్చిందని
నువ్వు అనుకున్నావు, నీ లివరు పర్‌ఫెక్టుగా
ఉంది, కొందరికి బిల్‌రుబీన్ కౌంటు ఒక గజం
అటూ ఒక గజం ఇటూ ఉండొచ్చు. అంత
మాత్రం చేత జాండీసు అనుకోరాదు... పో...
పొయ్యి హాయిగా మటన్ బిరియాని తిని
పొణుకోపో - అని చెప్పి పంపించినాడు.

చావు కబురు యింత లేటుగా
తెలిసేపాటికే జరగాల్సిన డ్యామేజీ
జరిగిపోయింది. పత్యం పేరుతో అసలేమీ
తినకుండా ఉన్నాను గదా యింక నెమ్మదిగా
తుమ్ములు దగ్గులు, జ్వరాలు మొదలై
పోయినాయి. ఈ టెన్షనుతో ఫిజికలుగా ఒక
పక్క మెంటలుగా యింకో పక్క సఫరవుతూ
ఉంటే మా ఆఫీసులోనే పని చేస్తా ఉన్న జకీర్
అనే ఒకాయన వచ్చినా చేతిలో ఒక ఫొటో పెట్టి
యింకో టెన్షను పెట్టినాడు.

'ఈ పిల్ల మా మరదలు... మనిషి
భలే మెతక. బిఇడి చేసి మెదక్ నర్సాపూర్‌లో
టీచరు పని చేస్తా ఉంది. చేసుకో. చేసుకుంటే
బాగుపడతావు. అభి నహీ తో ఫిర్ కభీ నహీ'
అన్నాడు.

రెండు రోజుల తర్వాత మళ్ళా ఫోను
చేసి 'తాడేపల్లిగూడెం వాళ్ళ సంబంధం ఒకటి
వచ్చుంది. నువ్వు ఊ అంటే ఆగుతాం. లాకుంటే
దాని సంగతి చూస్తాం' అని తొందర పెట్టినాడు.

ముప్పయ్యేళ్ళపాటు నా యిష్టం
వచ్చినట్టుగా బతికిన బతుకు. ఇప్పుడు సడన్‌గా
ఊ అనాలంటే టెన్షన్.

ఊ అన్నాను. మే 25, 2003న
నిఖా.

ఇంక పనులు మొదలైనాయి...
పెళ్ళిలో వైట్ అండ్ వైట్ డ్రస్సా, క్రీమ్ కలరా,
వాచీ ఏ కంపెనీ, బూట్లు ఏ సైజు, కావలి నుంచి
మీ వాళ్ళు ఎంత మంది వస్తారు, వస్తే ఏం
తింటారు, కాపురం యాడ? ఇల్లు వెతికినావా?

ఈ బాధలూ అనారోగ్యమూ నన్ను
ఏపక తింటా ఉంటే... అదిగో... అప్పుడు నేనీ
కతల్లో హాయిగా మునిగి తేలినాను... మా ఊరి
కతలు, మా ఇస్కూలు కతలు, మా చిన్నప్పటి
కతలు, నా ఫ్రెండ్స్ కతలు... నా కతలు...
పోలేరమ్మ బండ...

ఒక పక్క పెళ్ళి పనులు జరగతా
ఉంటే యింకో పక్క పెళ్ళితో సమానమైన కళతో
ఈ కతలు మొదలైనాయి. 'బతికించినావునా
తండ్రీ కుమారస్వామీ' అని...

ఆ కత మొదలయ్యే ముందరి
వరకూ నేను రఫ్ఫు రాసుకుంది లేదు. ఏ కతలు
రాయాలో ఎట్ట రాయాలో ఉరామారిగా

అంచనా వేసుకుందీ లేదు. నాకు తెలిసింది ఒక్కటే... మా ఊర్లో మా ఇళ్ళకాడ ఒక పోలేరమ్మ బండ ఉంది. రైలుకట్ట అవతల మేము చదివిన మా ఇశ్వోదయ ఇస్కూలు ఉంది. ఆ చెట్టు కింద ఆడుకుంటా ఈ ఇస్కూల్లో చదువుకుంటా మేము నలుగురం స్నేహితులం కమ్మటి రోజుల్ని కాసిన్ని చూసినాము. తియ్యటి మాటల్ని కాసిన్ని చెప్పుకున్నాము. మురిపెమైన ఆ ఆటలతో మురుసుకొని ఒకో వారం ఒకో కత లెక్కన ఏ వారానికి ఆ వారం యిరవై అయిదు కతలు రాయలేనా? అని...

కతలు మొదలైనాయి.

మొదటి వారం కత వచ్చిన రోజున యింటికాణ్ణే ఉండి ఫోను మీదే కన్నేసి పెట్టినాను -రెస్పాన్సుగా ఏమైనా ఫోన్లు వస్తాయేమోనని.

రాలా.

రెండో వారం రెండోకత వచ్చింది. మళ్ళా ఫోను కాణ్ణే ఉన్నాను.

ఒక్క ఫోను కూడా రాలా. తెలిసినవాళ్ళు కూడా చూశామంటే చూశాం. చదివాం అంటే చదివాం అన్నట్టుగా ఉన్నారు.

మూడో కత నాటికి కూడా పరిస్థితి అట్టాగే ఉండేసరికి... యిదేందిది పొయ్యిపొయ్యి రాంగ్‌రూట్‌లో పడినామా అని దిగులు పడతా ఆ దిగులుతోనే ఆలోచిస్తా నా పెళ్ళి కార్డు యియ్యడానికి దేవులపల్లి అమర్ వాళ్ళ యింటికి వెళ్ళినాను.

అక్కడ సులోచనగారు నన్ను చూడంగానే కళ్ళు పెద్దగా చేసి హాయిగా నవ్వతా 'మీ కతలు చాలా బాగున్నాయండీ.. ఆర్.కె.నారాయణ్ 'స్వామి అండ్ హిజ్ ఫ్రెండ్స్' కతల్లాగా వాటి కంటే యివే బాగున్నాయి' అన్నారు.

ఆ మాటతో నాకు ఎంత బలం వచ్చిందంటే అమ్మయ్యా అనుకొని బయటికొచ్చి ఎగిరి గంతేసినంత పని చేసినాను.

ఇంక నాకు భయం పోయింది.

ఒకరికి అర్థమయ్యిందంటే ఆ ఒకరిలాంటి వాళ్ళు చాలా మంది తయారవతా ఉంటారు అనుకున్నాను. అనుకున్నట్టే అయ్యింది. నెమ్మది నెమ్మదిగా ఉత్తరాలు మొదలయినాయి. అప్పుడొకటి అప్పుడు రెండు లెక్కన అమ్మ స్వామి, నాన్న స్వామి కత వచ్చేనాటికి మాగ్జిమమ్ డంప్ అయినాయి... ఫోన్లు... ముక్కు మొకం ఎరగని వారి యిష్టమైన పలక రింపులు... రకరకాల దేశాల నుంచి ఈ మెయిల్సు... ఆశీస్సులు...

ఒక రోజు రాత్రి పూనాలో వాళ్ళమ్మాయి దగ్గర ఉంటున్న మా కుమారస్వామి ఐవోరి భార్య వనజగారు నాకు ఫోను చేసి 'చనిపోయి ఏ లోకానో ఉన్న మా వారిని తిరిగి నీ కతల్లో బతికించినావు బాబూ. నీ రుణం తీర్చుకోలేను. నిన్ను యివాల్టి నుంచి మా ఫ్యామిలీ మెంబర్ అనే అనుకుంటానయ్యా' అన్నారు ఆపేక్షగా.

☆
ఒక రోజు రాత్రి పూనాలో వాళ్ళమ్మాయి దగ్గర ఉంటున్న మా కుమారస్వామి ఐవోరి భార్య వనజగారు నాకు ఫోను చేసి 'చనిపోయి ఏ లోకానో ఉన్న మా వారిని తిరిగి నీ కతల్లో బతికించినావు బాబూ. నీ రుణం తీర్చుకోలేను. నిన్ను యివాల్టి నుంచి మా ఫ్యామిలీ మెంబర్ అనే అనుకుంటానయ్యా' అన్నారు ఆపేక్షగా.
☆

ఆ తర్వాత శ్రీరమణగారు ఫోన్ చేసి 'బాపుగారు మొన్న కలిశారండీ... ఈ కతలు చదువుతున్నారట. బాగుంటున్నాయని చెప్పమన్నారు' అన్నారు నాతో.

ఆ సంతోషంలో ఉండగానే కొంత మందీ పిల్లలు, హైస్కూలు పిల్లలు, ఇంగ్లీషు మీడియంలో చదువుతున్న కాలేజీ పిల్లలు యీ కతలని చాలా యిష్టంగా కూడబలుక్కుని మరీ చదువుతున్నారని పేరెంట్స్ ద్వారా తెలిసినప్పుడు నా కళ్ళమ్మట నీళ్ళొచ్చినాయి...

ఎక్కడ కావలి... ఎక్కడ పోలేరమ్మబండ... ఎక్కడ శ్రీదరుగాడు మురళీగాడు, మాల కొండరావుగాడు, కదీరుగాడు... వీళ్ళంతా యివాళ చాలా మందికి ఫ్రెండ్స్ అయినారు... మాలో మాకు కూడా వీళ్ళు ఎంత ఫ్రెండ్స్ అయినారంటే కతలు ముగుస్తున్నాయని తెలిసి మా శ్రీదరుగాడు అమెరికా నుంచి ఫోన్ చేసి 'ఒరే... ఇంకొన్ని రాయరా పుణ్యముంటుంది' అని నన్ను బతిమిలాడినాడు.

ఇంకా విచిత్రం ఏమిటంటే ఈ కతలు అయిపోయినా ఒకాయన మా ఆఫీసుకు వచ్చి ఈ కతల్లోని నలుగురు ఫ్రెండ్స్ టెన్తు ఆగకుండా డిగ్రీలు చదివి ఉద్యోగాలు తెచ్చుకొని పెళ్ళిళ్ళు చేసుకొని సెటిలయ్యేదాకా ఈ కతలు రాస్తావా చస్తావా? అని కూచున్నాడు.

అదీ ఈ కతల భాగ్యం.

ఈ భాగ్యం నాది కాదు. ఈ భోగమూ నాది కాదు.

ఇది బాల్యానిది.

-14 జనవరి 200

# సూర్యుడు ఏనాడూ అస్తమించడు

**వై. శ్రీరాములు**

ఆకాశానికి ఎల్లలు లేవు అది అనంతం
దృశ్యం నుండి సత్యం పిండుకుంటుంది కవిత్వం

గ్లిజరిన్ కన్నీళ్ళ ధాటికి కరిగి
బంగారు పతకాన్నిస్తుంది నా జనత
నిజమైన కన్నీళ్ళు అవుపిస్తే
మొహం చాటేసుకోవడం నేటి నాగరికత

అతివ అందానికి మెచ్చి మిస్ ఆసియా బహుమతి
అర్థరాత్రి పడుపువృత్తిలో ఆడదాని చేతిలో అర్థరూపాయిగతి

ఫుట్‌పాత్‌పై సన్ బాత్ చేస్తున్న
కష్టాల మైనంతో మలచిన కన్నీటి శిల్పాలు
తమ ప్రతి పుట్టిన రోజుకి
భూమండలాన్ని కేక్‌లా కోసి తింటున్న అగ్రరాజ్యాలు

హిందూ మహాసముద్రం అలల రెప్పల నుంచి
జారి పడిన కన్నీటి బొట్టు ఈ ఇండియా సమస్తం
బాధల గాథలు గాక ఇంకేముంటాయి నేస్తం
వెలుగు కోసం వెతుకుతున్న నా కళ్ళలోకి సంధ్య దూకింది
మనుషుల మధ్య ముసుగు తెర తెగింది
ఆకాశంలోకి ఎడారి ప్రాకింది
అయినా నాకు తెలుసు...
చూపుల తీరాల్లో తప్ప
సూర్యుడు ఏనాడూ అస్తమించడని...

ముదిగంటి సుజాతారెడ్డి



# జహంగీరు బీ

**జహంగీరు బీకి నాకూ అనుబంధం నాలుగోక్లాసు నుంచి మొదలైంది. జహంగీరు బీ ఏడో క్లాసులో ఫేలయింది. అప్పుడు ప్రతి క్లాసులో పాస్ ఫేల్ అంటూ వుండేది. జహంగీరు బీని చదివించడం తల్లి కరీంబీకి కష్టంగా ఉంది. కరీంబీ ఇంటింటికి పోయి పిండి విసిరి వడ్లు దంచి సంపాదించిన సంపాదనతోనే వాళ్ళ తిండి బట్ట నడుస్తున్నది. అప్పటికే కరీంబీ అలసిపోయింది! కరీంబీ చిన్నప్పుడే ఆమె తండ్రి క్షయరోగంతో చనిపోయాడు.**

అప్పట్నుంచే కరీంబీ పొట్ట కోసం తల్లితోపాటు ఏవో పనులు చేయడం మొదలుపెట్టింది. తల్లి రెండెకరాల చెల్క అమ్మి కరీంబీ ఒంటి మీద నగలు పెట్టి కొంత నగదు పెండ్లి కొడుకు హుస్సేన్‌కిచ్చి మంచి సంబంధమే మాట్లాడి పెండ్లి చేసింది. తృప్తిగా కన్ను మూసింది. కాని కరీంబీకి ఇంట్లో కూర్చుండి తినే యోగమే అల్లా అసలు రాసి పెట్టలేదు. నిజాం రాజ్యంలో రజాకార్ల లొల్లి జరిగేటప్పుడు హుస్సేన్ ఎక్కడ్నో మాయమైనాడు. దొర గడీల తాగి జల్సాలు చేసుకుంటవున్నడని కరీంబీకి తెలిసింది. కాని "నేను ఎక్కడని వెతుక్కలాడ్త" అని కరీంబీ ఏడ్చి ఊరుకుంది. పోలీస్ యాక్షన్ కాంగనే కరీంబీ ఒంటి మీదున్న నగలు భూములమ్మి ఎంతో అంత వచ్చిన డబ్బుతో హుస్సేన్ మాయమయ్యాడు. ఇది తెలుసుకున్న కరీంబీ శోకం పెట్టి యేడ్చింది. నాలుగేండ్ల జహంగీరును గుండెల కదుముకొని వెక్కివెక్కి యేడ్చింది. చుట్టు పక్కల వాళ్ళంతా చేరారు.

"కరీంబీ నువ్వు గిట్ల ఏడిస్తే పిల్ల ఏమైపోతది! ధైర్యం తెచ్చుకో" అని ఊరడించారు.

"కరీంబీ నీ శౌహర్ (మొగడు) హుస్సేన్ పాకిస్తాన్ పోతున్ననని చెప్పి పోయిండు" అన్నాడు హుస్సేన్ దోస్తు ఆలం.

"గక్కడ శాన మంచిగుంటది. కావల్సినంత సంపాదించుకోవచ్చునన్నడు. సంపాయించినంక వచ్చి నిన్ను నీ బిడ్డనీ తీస్కపోతనని చెప్పమన్నడు" అన్నాడు ఆలం.

"హాయ్! అల్లా! మేరేకు బచ్చీకు కిస్‌పే ఛోడ్‌కే గయా! (నన్ను నా బిడ్డను ఎవరి దగ్గర విడిచిపెట్టి పోయిండు!) నేను నా పిల్ల ఎట్ల బతుకుతం ఇగ?" అని ఏడ్చింది కరీంబీ. తర్వాత ఎన్నడూ "భర్త వస్తడు. తీస్కపోతడు" అని ఎదురు చూడలేదు... ఆశ పెట్టుకోలేదు.

కరీంబీ పగలనక రాత్రనక కష్టపడింది. కాయకష్టం చేసింది. పిండి విసిరింది. ఇంతలో పిండి గిర్నీలు వచ్చాయి. అప్పుడు వడ్లు దంచింది. ఇంతలో వడ్ల గిర్నీలు వచ్చాయి. అప్పుడు కరీంబీ వాళ్ళింట్లో వీళ్ళింట్లో బాసండ్లు తోమింది. వంట చేసింది. మొత్తం మీద ఒకర్ని దేహి అనకుంట బతికింది. అట్ల పని చేసుకుంటనే జహంగీరుబీని సర్కారీ స్కూల్లో చేర్పించింది. జహంగీరు బీ నాల్గో క్లాసులో వున్నప్పుడే నేనూ ఆ స్కూల్లో చేరాను. అప్పుడే నైజాంల రజాకార్ల లొల్లి కమ్యూనిస్టుల పోరాటం అయిపోయి శాంతి యేర్పడుతున్నది. మా బాపు (నాన్న) పిల్లలకు చదువులు లేకపోతే

భవిష్యత్తు లేదని గుర్తించాడు. మొదట ఓ ఇల్లు కిరాయికి తీసుకున్నాడు. మా బాపమ్మ (నాయనమ్మ) మాకు వండిపెట్టేటందుకు మాతో వుండేది. మా అన్నయ్యను ఎనిమిదో క్లాసులో నన్ను నాలుగో క్లాసులో చేర్పించారు. ఆ క్లాసులోనే నేనూ జహంగీరు బీ మొదటిసారి కలుసుకున్నాం. క్లాసులో ఒక్క బెంచీ మీద పక్కపక్కన కూర్చునే వాళ్ళం. అట్లా మా ఇద్దరికి పరిచయం స్నేహం యేర్పడింది. జహంగీరు తల్లి కరీంబీ గురించి తెలిసింది. అప్పుడప్పుడు ఆడుకోవడానికి జహంగీరు మా యింటికికూడా వచ్చేది. అప్పుడే ఒకసారి ఊరి నుంచి వచ్చిన అమ్మ జహంగీరును చూసింది. "గా తుర్క పొల్ల తోటి దోస్తీ యేంది?" అంది మా అమ్మ నన్ను కోప్పడింది.

"గా పోరి తల్లి ఇండ్లల్ల పన్జేసుకొని బతుకుతదట. తండ్రేమో పాకిస్తాన్ పారిపోయిండంట. గసోంటోళ్ళ తోటి ఏం దోస్తీ! కబర్దార్ గా పిల్లతోటి మాట్లాడితే!" అని అమ్మ బెదిరించింది కూడా.

మరుసటి రోజే నేను క్లాసులో జహంగీరుకు దూరంగా ఇంకో బెంచీ మీదికి మారాను. అయినా జహంగీరు నన్ను వదలలేదు. తనూ బెంచీ మార్చి నా పక్కన వచ్చి కూర్చుంది. నేను మూతి బిగించుకొని మాట్లాడకపోయినా చిరునవ్వులు నవ్వుకుంట నాతో మాట్లాడేది. ఇక నేను మాట్లాడక తప్పలేదు. జహంగీరు ఎప్పుడూ... వాళ్ళింట్లో వున్నాయనో... వాళ్ళ అమ్మ ఇచ్చిందనో రేగిపండ్లు జామకాయలు తాటిగేగులు యేవేవో తెచ్చియిచ్చేది. నేను తీసుకోక కోపంగా దాని వైపు చూస్తే దాని కండ్లల్లో నీళ్ళు నిండేయి. నా వైపు మిటుకు మిటుకుమని చూసేది. నేను చిరునవ్వు నవ్వితే దాని ముఖం వెలిగిపోయేది. ఎక్కువ నేనూ దాంతో మాట్లాడకుండా వుండలేకపోయేదాన్ని. ఇక జహంగీరు బీతో నా స్నేహం అనుబంధం కొనసాగింది.



జహంగీరు ఏడో క్లాసు ఫేలయింది. నేను పాసయ్యాను. తర్వాత సెలవుల్లో నేను ఊరికి వెళ్ళిపోయాను. స్కూలు తెరిచినంక వచ్చి ఎనిమిదో క్లాసులో కూర్చున్నాను. నాకు జహంగీరు బీ కనపడలేదు. ఏదో పోగొట్టుకున్నట్లుగా నేను చూపులతో స్కూలంతా వెతికాను. అప్పుడే వివేక నా దగ్గరికి వచ్చింది. "లతా! నీకు ఎర్కలేద? జహంగీరు పెండ్లయింది యీ ఎండల్ల" అంది. జహంగీరు ఇంటి దగ్గరే వుంటుంది. జహంగీరు పెండ్లయిందని విని నాకాశ్చర్యమైంది. పెండ్లని అది నాకు చెప్పనే లేదు. కొన్ని రోజులకు తల్లి కరీంబీతో జహంగీరు మా యింటికి వచ్చింది. ఈ రెండు నెలల్లో చాలా మారిపోయింది. దాని ముఖం మీద కళ కొట్టొచ్చినట్లు కన్పించింది. చీరలో చాలా పెద్దగయి నట్లనిపించింది. కండ్లు పెద్దవి చేసి దాని వైపు చూస్తుండి పోయాన్నేను. నన్ను చూసి జహంగీరు ముఖం వాన వెలసినంక మబ్బు చాటునుంచి బయటపడ్డ సూర్యకిరణం లెక్క తళుక్కుమంది. జహంగీరును చూసి నాకూ శాన ఖుషీ అయింది. పెండ్లి పిల్ల తీరుగ తయారై వచ్చింది. చేతులకు ఎర్రగ మైదాకు, పెండ్లయిం తర్వాత మల్ల పెట్టుంకుందేమో మైదాకు! ఇంకా ఎర్రగ వున్నాయి చేతులు. మెడల నల్లపూసలు. దాని పక్కన కొత్తబంగారు గొలుసు పచ్చగ మెరుస్తుంది. గులాబీ రంగు చీర. గుత్తంగా పచ్చని మెరిసే గాజులతో, రెండు చేతులు మలారం లెక్క గొట్టినయి. దాని వైపే రెప్పవేయకుంట చూస్తుండిపోయిన. "లతమ్మ! నీ దగ్గరికి తోలుకపోమ్మని గీ పోరి ఒక్కటే లొల్లి!" అంది కరీంబీ. ఆమె ముఖం మీద ఎన్నడూ లేని సంతృప్తి సంతోషం కన్పించాయి.

"కరీంబీ! జహంగీరు లగ్గం చేసిన వటగదా! మాకు చెప్పనే లేదు" అంది బాపమ్మ నేను ఏం మాట్లాడకముందే. "అవును అమ్మ! ఏం జేస్త! నేనొక్క దాన్ని ఎంతకని జేస్త! అల్లుడు అఫ్జల్ శాన మంచోడు. గా పిల్లగాడే వచ్చి పిల్లను అడిగిండు. ఇదేమో నేను సదువుకుంట పెండ్లి గిప్పుడే చేసుకోను అంటది. చదువు కోవాల్నని శానా క్వాయిష్ (కోరిక) దీనికి. కాని నేనేం జేస్త! నాతోటి కాదు సదివిచ్చుడు. ఒక అయ్య చేతిల బెడ్తె నేను ఎప్పుడు పోయిన బేఫికర్ అయితది అన్న! దాంతోటి నిక్కాకు రాజీ అయింది. దీని కన్న పిల్లగాడు జర్ర పెద్దోడు... ఐదు పదేండ్లు అంతే! ఏం జేస్తం! గంతకు మించిన సమ్మంధం ఎక్కడ దొర్కుతదని దీనికి సమఝాయించిన. అయిన పిల్లగాడు ఖుద్దు వచ్చి అడిగిండు. ఖుషీగా ఒప్పుకో అని చెప్పిన. నీ నసీబ్ మంచిగున్నది అందుకే పిల్లగాడు ఖుద్దు వచ్చి అడిగిండు. మంకుపట్టు పట్టకుంట నిక్కాకు ఒప్పుకో ఇగ నాతోటి కాదు అన్న. దాంతోటి గీ పోరి నిక్కాకు రాజీ అయింది. నౌకరీ లేకపోతెయేంది పిల్లగాడు తందురుస్తున్నడు. ఎట్లనన్న సాదుతడు దాన్ని! నొష్ట నసీబ్ ఎంతుంటె అంతయితది!... చూడు మంచోడు మంచోడు మాల్ వున్నోడు అని నగ నట్ర పెట్టి నన్ను ఇచ్చి నిక్కా జేస్తే ఏమైంది? నా రాత ఎట్లయింది?..." కరీంబీ చెప్పింది విని అందరం కొంచెం సేపు ఏం మాట్లాడలేదు. ఆ నిశ్శబ్దాన్ని బాపమ్మ ఛేదించింది. "కరీంబీ! మరి ఇప్పుడు నువ్వు అల్లునింట్లనే వుంటున్నావా?" అని అడిగింది.

"గంత కాలిపోలేదు నా నసీబ్ అమ్మ! అల్లునింట్ల ఎందుకుంట! పాకిస్తాన్ పోత పోతగా గింతంత ఇల్లొకటి విడిసి పెట్టి పోయిండు గద నా మర్ద్ (భర్త). దరిద్రమొఖపోడు! గక్కడ బగ్గ సంపాయిస్తనని పోయిండు. ఏం సంపాయించిండో! మల్ల నిక్కా జేసుకుండంట. పిల్లల్ని కన్నడంట!" కరీంబీ కండ్లు పైట కొంగుతో తుడుచుకుంది. ఆమె కంఠం గద్గదమైంది.

"అంతేన? నువ్వు ఆశ వదులు కున్నట్లేన?" అడిగింది మా బాపమ్మ విచారంగా. కరీంబీ కోపంతో గయ్యిమని లేచింది. "ఇంకేం ఆశ అమ్మ! కాట్లెక కాలు సాపుతున్న బేశరం అయివాడు వెళ్ళిపోయిండు ఇంకేం ఆశ. నాబొంద! పాకిస్తాన్ పోయిన్నాడే వాన్ని చచ్చినోళ్ళల్ల జమ చేసుకున్న. గుండె రాయి జేసుకొని గీ పిల్లను సాదిన పెండ్లి జేసిన!..."

మా బాపమ్మ కరీంబీల మధ్య జరిగే మాటలు వింటూనే జహంగీరుతో ముచ్చెట్లు పెడ్తున్న నేను. అస్సలు నేనేం మాట్లాడ్తలేను జహంగీరే జోలి పెడ్తున్నది. "సదువు ఆపుడు నాకస్సలే ఇష్టంలేదు లతా మా అమ్మను చూసి పాపం అనిపించి నిక్కాకు ఒప్పుకున్న. నాకన్న శాన పెద్దోడు. ఆయనను చూస్తేనే నాకు గుండె ధగధడమని బుగులైతది ఆయన దగ్గరికి వస్తే కండ్లు మూసుకుంట... లతా! నిన్ను చూడకుంట వుండాలంటే నాకెట్లనో వున్నది!..." జహంగీరు గొంతు ఏడ్పుతో కూడుకపోయింది. "ఛీ! ఎందుకేడుస్తవే! అంత బాగయితది. మనం కలుస్తనే వుంటం గదా!..." అన్నాన్నేను జహంగీరును ఊరడిస్తూ. కాని దాని భర్త సంగతి వింటే నాకూ భయమే అనిపించింది. జహంగీరుకు ధైర్యం చెప్పాల్నని ఎందుకేడుస్తవే! అన్న గాని మనస్సులో నాకు ఎట్లనో అయింది.

నేను టెన్త్ అయినంక ఇంటర్ చదివేటందుకు పట్నం కాలేజీల చేరిన. హాస్టల్లో వుండేదాన్ని అంతకుముందే మా అన్నయ్య ఆనం మెడిసన్‌లో చేరి పట్నంలో హాస్టల్లో వున్నాడు. మమ్మల్ని స్కూల్ చేర్పించంగనే మా బాపు కిరాయి ఇల్లు ఎందుకని నల్లగొండలో ఇ

కొన్నాడు. మా అన్నయ్య నేనూ పట్నం వెళ్ళి పోయి నంక ఆ ఇల్లు ఖాళీగానే వుండేది. ఎప్పుడైన అమ్మ బాపు పని మీద వచ్చినప్పుడు వుండేవాళ్ళు. నేను ఇంటర్ రెండో సంవత్సరం పరీక్షలు రాసి ఇంటికి పోయినప్పుడు మా బాపమ్మ చెప్పింది. "జహంగీరు నౌకరీ చేస్తుందే... లతా!" అని.

"ఏం నౌకరి?"

"మీ స్కూల్లోనే ఆయాగా చేరింది. దాని మొగడే నౌకరి చేయమన్నడట" అంది బాపమ్మ.

"ఏమన్న పిల్లల?'

"ఆ... ఒక కొడుకు".

కొన్నేండ్ల వరకు నేను జహంగీరుని కలవడం కాలేదు.

నేను బి.ఏ. పూర్తి చేసిన. ఆనంద్ మెడిసిన్ పూర్తి చేశాడు. నల్లగొండలో సొంత ఇల్లు ఉంది కదా. అక్కడే ప్రైవేటు ప్రాక్టీసు చేయమని బాపు అంటే అన్నయ్య అక్కడే క్లినిక్ తెరిచాడు. నేను బి.ఏ. ఫైనల్ పరీక్షలు రాయకముందే మా బాపమ్మ చనిపోయింది. ఊరికి పోయి వచ్చి నేను ఫైనల్ పరీక్షలు రాసాను. బాపమ్మ లేక పోవడంతో సెలవుల్లో ఊరికి పోబుద్ధికాలేదు. అన్నయ్య దగ్గరికి నల్లగొండకే పోయాను. నన్ను చూడడానికి జహంగీరు బీ ఇంటికి వచ్చింది.

"కరీంబీ బాగుందా?" అడిగాను దాన్ని.

"ఎక్కడ కరీంబీ! లతా! ఇంతెఖాల్ (మరణించి) చేసి ఆర్నెల్లు. బాపమ్మ కన్న ముందల్నే..." జహంగీరు బీ ముఖం నేలకు దించుకుంది. అది ఏడుస్తున్నదని నాకు తెలుసు. నాకూ మా బాపమ్మ ఇక లేదు అని జ్ఞాపకం వచ్చి ఏడ్పు ఆగింది కాదు. ఇద్దరమూ శానాసేపు ఏం మాట్లాడుకో లేదు. కొంచెం సేపటికి తేరుకొని–



"నీకు కొడుకట కద? జహంగీరు!" అన్నాను చిరునవ్వుతో.

"ఒక కొడుకు ఇద్దరు బిడ్డలు. ఇగో మల్ల నెళ్ళు పోసుకున్న..." కడుపు వైపు చూసుకుంట నవ్వింది జహంగీరు. దాని కడుపు ఎత్తుగా వుంది. నేను ఇంతసేపు గమనించనే లేదు.

"అమ్మో! అప్పుడే నాలుగోదా? ఒక దిక్కు నౌకరి. ఇంకో దిక్కు పిల్లలు. ఎట్ల జేసకుంటున్నవ్" జాలిగా దాని వైపు చూశాను.

"ఏం జెయ్యాలె! చదువుకొని... కమస్ కమ్ పదోటి చదివి టీచరు నౌకరి చేయాలనుకున్న, కాని మా అమ్మను చూసి నిక్కాకు ఒప్పుకున్న!..." నిట్టూర్చింది జహంగీరు. "కరీంబీ వున్నా నీకు ఆసరాగా వుండేది పాపం!" అన్నాన్నేను. "కరీంబీ ధర్మాత్ములాలు అందరికి సేవలు చేసింది. కాని ఎవరి తోటి చేయించుకోకుంట పోయింది. ఛాతిల నొప్పి అన్నది. అది ఎప్పుడూ వున్నదే గద అనుకున్న అంతే ఆ రాత్రే నిద్రల్నే పానాలు పోయినయి" జహంగీరు వెక్కివెక్కి ఏడ్చింది. "సరే! ఆమె పాణానికి సుఖంగనే పోయింది." నిట్టూర్చాన్నేను. కరీంబీ జ్ఞాపకాలు నామెదడులో కదిలాయి.

కరీంబీ ఎంతో రుచిగ మటన్ బిర్యానీ చికెన్ బిర్యానీ వండేది. గ కరీంబీ బగారా బైంగన్ కూర రుచి చెప్పేదే కాదు. ఒక రోజు ముందల రాత్రే వండేది. పెద్ద దేకిసాలో వండి దాని మూతికి పల్చని మల్‌మల్ గుడ్డ కప్పేది. మూత పెట్టక పోతుండె. తెల్లవారి బిర్యానీతోటి తింటె ఆ కూర శాన రుచిగా వుండేది. కరీంబీ ఏం మసాలాలు వేసేదో ఎట్ల ఆ మసాలాలను నూరేదో తెల్వదు. కాని ఆమె వండిన బగారా బైంగన్ కూర రుచి ఫైవ్‌స్టార్ హోటల్లో కూడా వుండదు! "ప్చ్!..." నిట్టూర్చాన్నేను. వెంటనే మా బాపమ్మ గుర్తుకు వచ్చింది.

"ఎవరైన ఒకనాడు పోవల్సిందే!..." వేదాంతంగా అన్నాన్నేను – జహంగీరుని ఊరడించేందుకు ఇంకా నన్ను నేను ఊరడించుకునేటందుకు.

నేను మళ్ళా ఎం.ఎ. అయినంక సెలవుల్లోనే నల్లగొండకు పోయాను. అంతకు ముందు సంవత్సరం ఎండల్లనే అన్నయ్య పెండ్లి అయింది. కాబట్టి ఆ పెండ్లి సంబరంలో నేను జహంగీరును కలుసుకోవడమే కాలేదు. "గీ సెలవుల్ల జహంగీరును ఎట్లయిన కలవాలె" అనుకున్నాను. "ఎట్లా? ఎక్కడ?" అని నేను ఆలోచిస్తనే వున్న ఇంతల ఒక రోజు జహంగీరే మా యింటికి వచ్చింది. దాన్ని చూసి షాకైంది నాకు.

తెల్లగ బొద్దుగ వుండేది. నల్లగ బక్కగ అయింది. ముఖం మీద మునుపటి చిరునవ్వు లేదు.

"ఏందే జహంగీరు గిట్లయినవు? ఏమైన బీమారైనవ?" ఆత్రంగ అడిగిన నేను.

"ఎట్లయిత మల్ల! నలుగురు పిల్లలు! ఒక కొడుకు ముగ్గురు బిడ్డలు! ఇది పోంగ నా మర్ద్ (మొగడు) మల్ల పెండ్లి చేసుకొని వెళ్ళిపోయిండు... నన్ను విడిచిపెట్టి పోయిండు... నాకు తలాక్ ఇచ్చిండు... ఏడాది నుంచి గీ సిల్‌సిలా నడుస్తునె వుంది... ఆఖరికి తలాక్ ఇచ్చి పోయిండు. గా లొల్లిల వుండే నేను అన్నయ్య పెండ్లప్పుడు మీ యింటికి రాలేదు. వచ్చెటందుకు నాకు ముఖం లేకపోయింది! ఎప్పుడు నా దుఃఖ్ దర్ద్ విన్పించెటందుకె వస్త నేను!..." ఏడ్చింది జహంగీరు.

"ఎందుకు కొందరి జీవితాలు గిట్ల దుఃఖమయం అయితయి" ఆక్రోశించింది నాగుండె. ఇంతల మా వదిన సుశీల వచ్చిందక్కడికి.

జహంగీరు బీని ఆమెకు పరిచయం చేయబోయాను.

"ఆ... నాకు ఎర్కే. నీ చిన్నప్పటి దోస్తు జహంగీరు! ఒకసారి వచ్చింది మనింటికి నీ కోసం అడిగింది. అప్పుడే పరిచయమైంది నాకు" అంది సుశీల.

"దాని మొగడు తలాక్ ఇచ్చి ఇంకో పెండ్లి చేసుకున్నడట వదినా!" చెప్పాను.

"అవును నాకు తెలిసింది. ఎవరో బాగా వున్న ఇంటి పిల్లట! ఆస్తి పైసా బాగావున్నదని జహంగీరుకు తలాక్ ఇచ్చిండు. ఆ పిల్లను... పిల్ల యేంది!... అతని వయస్సు వుందట! ఆమెను నిక్కా చేసుకుండు. తలాక్! అంటే!... మూడుసార్లు తలాక్ తలాక్ తలాక్ అన్నడంట!... వెళ్ళి పోయిండంట" సుశీలకన్నీ తెలిసనయన్నమాట!

"హో!... మరి పిల్లలను ఎవరు సాదాలే! ఏమైన ఇసున్నడ?" అడిగాన్నేను.

"వాని దగ్గరేమున్నదని ఇస్తడు లతా! ఇక్కడ నా నౌకరి పైసల్తోటి మజా చేసెటోడు. ఇప్పుడక్కడ దాని పైసల్తోటి తింటుండు... మంచి బట్టలు తొడుక్కొని ఇత్తరు పూసుకొని నోట్లె పాన్ బిడా ఏసుకొని ఊరి మీద తిర్గుతుండు! కంగాలోడు ఏమిస్తడు! నా నౌకరీ తోటె పిల్లల్ని సాదుకుంటున్న..." జహంగీరు బీ గొంతులో కసి కన్పించింది.

"పాపం జహంగీరుకు తల్లి కరీంబీ తీరుగ ఏ సుఖం ఎర్కలేదు." అనుకున్నాన్నేను.

"కొడుకు ఎదిగయిన జహంగీరును సుఖపెడ్తడేమొ!" నిట్టూర్చాన్నేను.

రెండో సంవత్సరం ఎం.ఎ. అయినంక నేను ఉద్యోగం వేటలో పడ్డాను. మా బాపు అమ్మలేమొ నాకు పెండ్లి చేయాల్నని సమ్మంధాల వేటలో పడ్డారు. మొదట విజయం వాళ్ళే సాధించారు. నా పెండ్లి నల్లగొండలోనే జరిగింది. పెండ్లి పత్రిక జహంగీరు బీకి పంపి "తప్పకుండా రావాలని" సందేశం కూడా పంపాను. పెండ్లి పిల్లను చేసే ముందు రోజు నా చేతులకు మైదాకు (గోరింటాకు) మంచిగ నూరుతుంది. ఎన్నో డిజైన్లు చేతులకు పెడ్తుంది. చిన్నప్పుడు వాళ్ళింట్లో వున్న మైదాకును తెంపి తెచ్చేది జహంగీరు. ఇద్దరం కలిసి రోట్లో వేసి నూరేవాళ్ళం. నూరేటప్పుడు కాసు వేసేవాళ్ళం. "ఊరపిచ్చుకల రెట్ట, ఏడు ఇండ్ల కప్పుల నుంచి తెచ్చిన తాటాకు ముక్కలు వేస్తే బాగ ఎర్రగయితదంట! నాకు మా అమ్మ చెప్పింది" అంది ఒకసారి జహంగీరు. అప్పుడు మేమిద్దరం చేద బావుల గోడల మీద వెతికి వెతికి ఊరపిచ్చుకుల రెట్ట, ఏడిండ్ల తాటాకు ముక్కలు తెచ్చి మైదాకులో వేసి నూరాం. చెరిసగం తీసుకున్నాం. జహంగీరు ఇంటికి పోయి తన చేతులకు పెట్టుకుంది. రాత్రి భోం చేసినింక నేను మా బాపమ్మ తోటి చేతులకు పెట్టించుకున్నాను. రాత్రి చేతులు కదలకుండ గుడ్డలతో కట్టేసుకొని పడుకున్నాను. కాని పొద్దున లేచి చూస్తే కట్టిన గుడ్డల్లేవు. మైదాకు మాత్రం చేతులకు బాగా పట్టి ఎర్రగయింది. చేతులు కడుక్కొని మంచి నూనె రానుకున్నాను. ఇంతలో జహంగీరు పరిగెత్తుకుంట వచ్చింది. ఇద్దరం చేతులు చాపి చూసుకున్నాం. నీది ఎర్రగ వుందంటె నీది ఎర్రగ వుందని పోటీ పడి మెచ్చుకుంట నవ్వుకున్నాం!... అట్ల ఎన్నిసార్లు చేసామో గుర్తు లేదు!...



"నీ చేతులకు మైదాకు బాగ ఎర్రగయింది. అంటె నీ మొగడు నిన్ను బాగ ప్రేమిస్తడు. బహుత్ ప్యార్ మొహబ్బత్ కర్తా..." అంది జహంగీరు చిరునవ్వుతో నా చేతులవైపు చూస్తూ. దాని మాటలు నా చెవుల్లో గింగురుమన్నాయి. కండ్లెత్తి అటు యిటు చూసాను. "జహంగీరు రానే రాలేదు! దాని జీవితమంత ఆగమైపోయింది. దానికి రావడం ఇష్టం లేదేమో!" అనుకొని నిట్టూర్చాన్నేను. కాని...

జహంగీరు పెండ్లిలో కన్పించింది దూరంగా. దాని కండ్లన్నీ పెండ్లి పందిరి వైపే వున్నాయి. దాని కండ్లల్లో ఖుషీ కన్పించింది. దగ్గరికి వచ్చి కలుస్తుందేమొ అనుకున్నాను. రాలేదు. అంతే! మాయమైంది. భోజనం కూడా చేసిందో లేదో? చాలా మందిలో జహంగీరును చూసుకొమ్మని నేను వదినక్కూడా చెప్పలేకపోయాను. పెండ్లయిపోయిం తర్వాత నేను పట్నం వెళ్ళిపోయాను. కొన్ని నెలలకే అక్కడ నాకు లెక్చరరుగా ఉద్యోగం వచ్చింది. ఉద్యోగం తర్వాత పిల్లలు. ఒకరి తర్వాత ఒకరు. ఇద్దరు! వాళ్ళ పెంపకం స్కూళ్ళు చదువులు సంసారం భర్త ఉద్యోగం పీ.హెచ్.డి.. ఇన్నిట్లో కూరుకపోయాను కొట్టుకపోయాను. జహంగీరును గురించి ఆలోచించనే లేదు నేను. కాలం ఎంత వేగంగా పరిగెత్తిందో జహంగీరును పదేండ్ల తర్వాత చూడంగనే నాకు తెలిసింది. కాలం నా చెంప మీద ఛెళ్ళుమని చరిచినట్లనిపించింది!

ఎవరిదో పెండ్లికని నేను నల్లగొండ పోయాను. ఆ సందర్భంలో కొన్ని రోజులు నేనక్కడ వుండిపోయాను. అప్పుడు జహంగీరు బీ గురించి మా వదినను అడిగాను. "ఆ... జహంగీరు ఊర్లోనే వుంది ఎవరినైనా పంపించి నువ్వు వచ్చినట్లుగా చెప్పుమంటాను" అంది. తెల్లవారే జహంగీరు వచ్చి నా ముందు నిలబడింది. జహంగీరును నేను గుర్తు బట్టడం ఆశ్చర్యమనే చెప్పాలి!

జహంగీరు పూర్తిగా ముసలి దాని లెక్క అయింది. వెంట్రుకలు తెల్లబడ్డాయి. చర్మం నల్లగా ముడుతలు పడిపోయింది. నిగనిగలాడే మునుపటి జహంగీరేనా ఇది? జహంగీరును చూసి నేను కట్టె కరుచుకపోయాను. పైకి మాత్రం శాంతంగా.

"జహంగీరు! బాగున్నవా?" అని పలకరించాను.

అంతే! జహంగీరు మత్తడి తెగిన చెరువయింది. బోరుమని యేడ్చింది.

"ఏమైంది జహంగీరు!" దాని చేతులను నా చేతుల్లోకి తీసుకున్నాను.

"మేరా బేటా... అలీ అహ్మద్‌ను పోలీసులు పట్టుకపోయిండ్రు లతా!" పైట కొంగు కొసలను నోట్లె కుక్కుకొని విలపించింది జహంగీరు. కండ్లు కురిసే మేఘాలైనాయి.

నాకూ యేడ్పు వచ్చింది దాన్ని చూసి ఛాతి బరువైంది. కొడుకైనా దాన్ని సుఖపెడ్తాడను కుంటె పోలీసుల పాలయ్యాడు!

"ఎందుకు? జహంగీరు!" అడిగాన్నేను.

"ఏమైందో ఎరుకలేదు లతా!... అలీ సుత నాకేం తెల్వదంటున్నడు. ఈ నడుమ వాడు మెట్రిక్ పాసయినంక వాని దోస్తుకు దోస్తులని చెప్పి కొందరు ఇంటికి వచ్చెటోళ్ళు... దోస్తుకు వీనికి నౌకరీ ఇప్పిస్తమని వాళ్ళు రెండు రోజులు ఎక్కడికో తీసుకపోయిండ్రు. నేనేమొ నౌకరీ తలాష్‌లో పోయిండని అనుకున్న. తీసుకపోయి అక్కడ నౌకరీ దేవులాడిండ్రంట. కాని ఫాయిదా లేకుంటయింది ట్రయినింగు నౌకరీ కావాల్నంటె యాభై వేయి కట్టమన్నరంట! ఎక్కడి నుంచి తెస్తం గన్నిపైసలు అందుకే వచ్చినకాన్నుంచి గుమ్‌సుమ్‌గ వున్నడు. నౌకరీ యేమైందిరా అంటే నౌకరి జల్దే దొరుకుతది అన్నడు నన్ను ఖుష్ చేసెటందుకు. గాని ఫికర్‌తో వుండేది. నౌకరీలేదని ఏదో తప్పు జేసినట్లు భయపడెటోడు. పిలిస్తే ఉలిక్కిపడెటోడు. దోస్తులు వచ్చుడు మాత్రం బంద్ కాలేదు. గా దోస్తులు రాంగనే ఇష్టం లేకున్న లేచి ఇంట్ల నుంచి సర్రున పోయెటోడు. ఎటో తీసుకపోయెటోళ్ళు. ఒకొకమల్క గల్లీ ముంగట్లనె చేరి గుసగుస ముచ్చెట్లు పెట్టెటోళ్ళు. పిల్లగాండ్లు యేం మాట్లాడుకుంటున్నరో అనుకున్న. గిట్ల జరుగబట్టి యేడాదైంది. ఇంకా నౌకరి ఎప్పుడుర? - అని నేను అడుగుతనే వున్న..." జహంగీరు ఏడుసుకుంటనే చెప్తున్నది.

"లతా! ఎప్పుడైతే పట్నంల పరమేశ్వర్ ఖూనీ జరిగిందో గప్పట్నుంచి పోలీసులు అలీ వెంట బడ్డరు. ఇంటికి వచ్చి తలాష్ చేసిండ్రు ఇగ ఒక రోజు వచ్చిపట్టుక పోయిండ్రు. రెండు రోజులు గిక్కడ్నె జైల్ల వుంచిండ్రు. నేను పోయి కల్సిన. ఏంది బిడ్డా! అని అడిగిన. సత్యం చెప్పు! అన్న ఒట్టేసి అడిగిన... ఎన్నితీర్ల అడిగిన - అమ్మీ జాన్! నాకే ఎరుకలేదు. నేనేం ద్రోహం చేయలేదు! నేను ఖూనీ చేయలేదు అంటున్నడు. తర్వాత వాన్ని పోలీసులు ఎక్కడికో తీసుకపోయిండ్రు ఎక్కడికి తీసుకుపోయిండ్రో అత్తా పత్తా లేదు. పోలీసులను అడిగినా చెప్తలేరు..." బోరున యేడ్చింది జహంగీరు బీ.

"ఇంట్ల తలాష్ చేసినప్పుడు యేమైన దొరికింద!" అడిగాన్నేను.

"ఏం దొర్కలేదు లతా! ఒక ఉత్తరం దొరికింది. దాంట్లే నౌకరీల చేరాలె ట్రెయినింగుకు రమ్మని వుంది అంతే! గా ఉత్తరం వచ్చినంకనె అలీ రెండు రోజులు ఊర్లె లేదు... ట్రెయినింగుకు రమ్మని ట్రెయినింగు అయినంత నౌకరి కావాల్నంటె యాభై వేలు కట్టమన్నరు! ఏం ట్రెయినింగు అని అడిగింద్రు. నాకు తెల్వదన్న. వాన్ని అడిగింద్రు. ఏం జెప్పిండో ఎర్కలేదు. గదంత అడిగి తెలుసుకుంద్రు పోలీసులు. నేను వున్నదున్నట్లు పోలీసులకు చెప్పిన. మేరా బేటా బేఖసూర్ వాని కేం తెల్వదని చెప్పి యేడ్చిన అయిన పోలీసులు రహమ్ (దయ) చూపలేదు." జహంగీరు ఎడతెగకుండ యేడుస్తున్నది. మా వదిన సుశీల అక్కడే వుంది.

"లతా! అలీకి టెర్రరిస్టులతో సంబంధమున్నదని ఆ ఉత్తరాన్నిబట్టి పోలీసులు అనుమానించింద్రు. అరెస్టు చేసి తీస్కపోయింద్రు" అంది సుశీల. అది విని నేను తెల్లబోయిన జహంగీరు దుఃఖం ఉప్పొంగింది. "నహీ! నహీ!..." అంది జహంగీరు రెండు చేతులూపుతూ "మేరా బేటా వైసానహీహా!... వో బేఖసూర్. హై!... నాకు తెలుసు! వాడు అటువంటి చెడ్డపనులేం చేయడు. నౌకరి దొరకలేదన్న పరేషానితోటి చెడ్డ సోపతిల పడ్డడు. అంతేగాని వాడు యే ద్రోహం చేయడు. వాడు వుత్త అమాయకుడు! భోళా!... లతా! వాడు నా బేటా!.. నా బేటా! మేరేకు మాలూమ్ హై!...." గుండె పగిలేలా యేడ్చింది జహంగీరు.

నేను జహంగీరు భుజాల చుట్టు చేతులు వేసి కౌగిలించుకున్నాను. ఇన్నాళ్ళు జహంగీరు స్నేహం ప్రేమలతో నన్ను అభిమానించింది. నేను పూర్తిగా ఎప్పుడు స్పందించలేదేమో. కాని యీ రోజు మాత్రం జహంగీరు దుఃఖం చూస్తే నాకు జాలి కాదు దాన్ని ఆదుకోవాలనే ప్రేమ స్నేహాలు ఉప్పొంగాయి నాలో.

"జహంగీరు! నువ్వు నాతో పట్నంరా! అక్కడ ఇటువంటి కేసులను చూసే లాయరు నాకు తెలుసు. నాకూ ఆయన దోస్తుయే. అతని దగ్గరికి పోదాం. అలీ ఎక్కడ వున్నా జాడ తీస్తాడాయన. అతన్ని ఎట్లయిన విడిపిద్దాం! వాడు నిర్దోషి అని నిరూపించి తీరుదాం!" దృఢంగా వుంది నా గొంతు.

"మేరా బేటా బేఖసూర్ లతా!... వాడు నా రక్తం! నా కెర్కే! వాడు బురా కామ్ నహీ కర్ సక్తా! నా కొడుకు కోసం కొట్లాడ్తా. లతా! తుమ్ మేరే సాథ్ దేనా! (నువ్వు నాకు అండగా వుండాలి)" జహంగీరు నా చేతిని తన చేతిలోకి తీసుకుంది దాని గొంతులో ఏడ్పులేదు... ఎప్పుడూ లేని ధైర్యం గుండెల్లో నిండిపోయింది.



---

# అదృశ్య ఆకాశం!!



పానుగోటి రవికుమార్

కళ్ళల్లో కలవరం
చీకటి చెట్లల్లో దాక్కొంది ఆకాశం!
దుప్పటి కౌగిలిలో ఎప్పుడోగాని
నిద్రలేవని పచ్చటి కలలు
రాత్రే కరిగిపోయాయి
వేకువ వెన్నెల వానలో
తడిచిన దుప్పట్లని దులుపుతుంటే
ఎప్పటిలాగే మంచం కింద
రెండూ, మూడు కలలు
దొరికినట్టే దొరికి
దొంగల్లా పారిపోయాయి
రాత్రికి రాకపోతాయా అని
వాటి వెనుక పరిగెత్తకుండా ఆగిపోయాను
ఆ రోజు దినపత్రికల్లో అక్షరాలు
కరువు బియ్యంలో రాళ్ళలా
చెరువు బీళ్ళులా పగిలిన కనిపించాయి!
ముఖం తుడుచుకుంటుంటే
మూడే కళ్ళు చూపుడు వేలికి తగిలాయి
మిగతా కళ్ళ కోసం వెదుకుతుంటే
కోటు జేబులో మిణుకు మిణుకుమంటూ
ప్రపంచాన్నే చదివించాలని కరంటు పురుగుల్లా
ఆశగా ఎదురు చూస్తున్నాయ్
ఆ కళ్ళతో చూస్తుంటే
విజన్ 2020'
కవర్ పేజీ మోడ్రన్ ఆర్ట్‌లా
ఎన్న భిన్నంగా చిన్నదైన భూమి గ్లోబల్ గాడిదలా కనిపించింది!!
రోజు కునుకు పాటులతో ఒక పగటి కలకు
బ్బన్ కటింగ్...
అప్పుడే
పైరు గాలుల పరుగులతో
పరమటి వెచ్చటి గాలి ఎక్కువైయింది
పొయ్యిలో పడుచుపిల్లి
కుక్కి మంచంలో ముసలితల్లి
పిల్లలతో పిల్లి వలస కాపురం...
చెట్లన్ని మౌనంగా రెమ్మల కన్నీరు కారుస్తూ
నదుల్ని నిండుగా నింపాయి
కన్నీటి వరదలో పొలాలన్ని మునిగిపోయాయి
రెక్కలొచ్చిన నదులు ఎక్కడికో ఎగిరిపోయాయి!
బావులన్ని బోర్‌మంటూంటే
పాతాళగంగ వీడియో కాన్ఫరెన్స్!
ఎన్ని చేపలు వలస వెళ్ళాయో
మా ఊరి చెరువు నడుగని అంటే
దాని మొహం అదేమి చెబుతుంది
దాని గొంతెప్పుడో తడారి పోయిందని
అదిప్పుడు,
వొళ్ళంతా తెగిన గాయాలతో
ఎండిన రక్తచారలతో పాలింకిన తల్లై
పచ్చిబాలింత లాగుంది
పచ్చటి దృశ్యం పంటికింద గాయంలా
మారిందేమిటని కళ్ళు తెరిచి చూస్తే
కనిపించిన దృశ్యం
అదృశ్య ఆకాశం!!

# సమీక్షా పర్వం

- ✦ నడక
- ✦ నల్లపొద్దు
- ✦ కిర్రు చెప్పులు
- ✦ మామూలుగా
- ✦ లోపలి వర్షం
- ✦ ఆకాశం నేలపాలైంది
- ✦ బచ్చేదానీ
- ✦ గాజుకళ్ళు

జె.యెస్.



## పల్లె తల్లి గుండె ఘోష 'నడక'

ప్రపంచీకరణ వల్ల జరిగిన నష్టంతో వెనకబడిన దేశాలు తీవ్ర సంక్షోభాన్నెదుర్కొంటున్నాయి. మతోన్మాదంతో ఇండియన్ పౌర సమాజం ఫాసిజాన్ని చవి చూస్తోంది. అగ్రకులతత్వంవల్ల కింది కులాలు సామూహిక హత్యాకాండకి దోపిడికి గురవుతున్నాయి. నూతనార్థిక విధానాలవల్ల పెరిగిన ప్రాంతీయ అసమానతలు అంతర్గత ద్వేషాలకి కారణమవుతున్నాయి. ఇవన్నీ ఒకదానితో ఒకటి ముడిపడున్న సమస్యలు. కవిత్వంలో ఈ ప్రతిఫలనాల్ని గత దశాబ్దకాలంగా చూస్తూనే ఉన్నాము.

కవి ఈ సమస్యలపట్ల స్పందిస్తూనే ఉన్నాడు. అమెరికా ఆధిపత్యంతో ప్రపంచం మీద చేస్తున్న దాడిని, అంతర్జాతీయ రాజకీయాల నేపథ్యంలో తెలుగు కవి పరిశీలిస్తున్నాడు. ప్రపంచీకరణ సమయంలో స్థానిక ఉద్యమాల ప్రతిపాదనే అన్నవరం దేవేందర్ ప్రకటించిన 'నడక'.

తెలంగాణా భాషలో కవితా రచన కొత్త కాదు. అయితే, సాహిత్యంలో భాషా చర్చ కొత్త కోణాన్ని పరిశీలించడం అవసరం. తెలంగాణా మాండలికం అర్థం కాదని అంటుంటారు. ఆ మాటకొస్తే ఒక మాండలికం మరో మాండలికం ప్రజలకు సులువుగా అర్థం కాదు. ఈ మధ్య మాండలికం అనే భావనను వ్యతిరేకిస్తూ తెలంగాణా భాష, కోస్తాంధ్ర భాష, రాయలసీమ భాష, కళింగాంధ్ర భాషగా పిలుస్తున్నారు. ఇది భాషావేత్తలకిష్టం లేదు. చేరా ప్రకారం భాష-మాండలికాల మధ్య ఉన్న తేడా స్పష్టమైనది. అయితే వర్ణనాత్మక భాషా శాస్త్ర పరిధిలో భాషను నిర్వచించడంవల్ల ఈ సమస్య వచ్చింది. ఏకకాలిక భాషాశాస్త్రం, ఇంకా స్పష్టంగా చెబితే నిర్మాణ/వినిర్మాణవాదాల ప్రకారం భాషకు అనేక ముఖాలున్నాయి. అల్తూసర్ చెప్పే ప్రకారం భాష సాంస్కృతిక నిర్మాణం. అంటే దానికి ఒక ప్రాంతంలోని సంస్కృతి, ఉత్పత్తి, సామాజిక సంబంధాలు, మానవ సంబంధాలు, ఉచ్చారణ యాసలు అన్నిటి కలయికే భాష. ఈ అంశాన్ని బాగా గుర్తించిన నిర్మాణవాదానంతర వాదులు యాసను, ధ్వనిని ప్రధాన అంశాలుగా గుర్తించి లేఖనానికి తరువాత స్థానానిచ్చారు. సంజ్ఞాశాస్త్రం (semiology) ఆధారంగా భాషను నిర్వచిస్తే ప్రాంతీయ వ్యవహారాలన్నీ భాషలుగా పరిగణించాలి. కాళోజీ యాసను భాషగా నిర్వచించారు. భాషకు అనివార్యంగా ఉండే ప్రాంతీయతవల్ల దాని నుడికారం భిన్నంగా ఉంటుంది. అది కవిత్వంలోకి వస్తే దాని ఫలితం వేరుగా ఉంటుంది.

ఇలా ఇక్కడొక్క చోటే జరగటం లేదు. అమెరికన్ ప్రాంతీయ సాహిత్యంలో ఆ ప్రాంత ఇంగ్లీషు భాషా వ్యవహారం విరివిగా కనిపిస్తోంది. American regional literature పేరుతో ఉత్తర, దక్షిణ అమెరికా సాహిత్యాలు వచ్చాయి. న్యూయార్క్‌లో మాట్లాడే ఇంగ్లీషు ప్రామాణికంగా తీసుకుని చేసిన రచనలకేమాత్రం తీసిపోని అభివ్యక్తితో ఆ రచనలు వచ్చాయి. నల్లవారు మాట్లాడే భాషకు తెల్లవారి భాషకు ఇక్కడి దళితుల-బ్రాహ్మణుల భాషకున్న తేడా ఉంటుంది.

ప్రామాణిక ఇంగ్లీషులో That రాస్తే ఉత్తర అమెరికన్లు da[t] రాస్తారు. ఉచ్చారణలో తేడా కనిపిస్తోంది. కోస్తాంధ్ర గుంటూరు భాష ప్రమాణ/సాహిత్య భాషగా అలవాటుపడిన నేపథ్యంలో వివిధ ప్రాంత భాషల సాహిత్యప్రవేశాన్ని అంతగా హర్షించలేని స్థితికి నెట్టివేయబడ్డాము. ఏ సాహిత్యమైనా గుబాళించాలంటే సజీవమైన భాష అవసరమవు తుంది.

అన్నవరం దేవేందర్ కవిత సజీవంగా కొత్తగా కనిపించడానికి అతడు వాడిన భాష కూడా కారణం.

### కాపురం కనరు కలెగల్సినట్లు

బుష్ బ్లేయర్లు బుసకొడుతున్నారు.

.... .... .... ....

పెంటగాన్ పెయ్యి మొద్దువారింది

అని రాసినప్పుడు తెలంగాణా సంస్కృతిని పరిగణనలోకి తీసుకోవాలి. కాపురం, కనరు, పెయ్యి... తెలంగాణా పద సంపద. అహంకారాన్ని సూచించడానికి కావురం, కనరు అనే మాటలు వాడుతారు. పెయ్యి అంటే శరీరం, ఒళ్ళు, 'దోస్కతినుడే... కలె దోస్కతినుడే'లో దోచుక>దోసుక, సంధి జరిగి 'దోస్క'+తినుడె అయ్యింది. కలె అనేది కలియ నుండి వచ్చింది. 'సౌరాలు చేసింద్రా'లో సౌరం < క్షవరం నుండి వచ్చింది. ఇక నిక్కుడు, నీల్గుడు, ఇరాం, అదిలిత్తరు, జరసైను మాటలు తెలంగాణ వాసులకు బాగా అర్థం అవుతాయి.

ఈ రచన అమెరికా దుర్నీతి పట్ల చాలా కోపం ప్రకటించింది.

ఇనుపడేగల కరకు దాడికి
ఇరాకీ నేల కన్నీరొలికింది
కోఫీ అన్నన్!... ఐరాసా శిఖరం నుంచి
జెండా కిందికి దించు (పే.18) అని గర్జిస్తోంది

గ్రామీణ జీవితం ప్రపంచీకరణవల్ల ఛిద్రమైంది. ఈ విషాద స్థితిని గురించిలా చెప్తోంది. పగలకుండా పయనించే శీతల పానీయాలు

పట్టపగలు చంపే టెర్మినేటర్ విత్తనాలు
సగ్రున లారీలు లారీలుగా చేరుతున్న
రసాయన క్రిమిసంహారకాలు
ఆ నున్నటి రోడ్లపై పయనించి

నా ఊరిసారాన్ని పీల్చి వేస్తున్నాయి (పే.33-34) అని పల్లెని పీల్చుక తింటున్న ప్రపంచీకరణని నిరసిస్తోంది. గుజరాతు ఊచకోతను ఈ రచన ఇలా ఖండిస్తోంది.

మతమంటే జీవన విధాన మన్నదెవ్వడు
మతమంటే కల్తీలేని మూర్ఖత్వం
మతమంటే సంపూర్ణ అజ్ఞానం

అని చెప్తూ 'కడుపులో దిగిన త్రిశూలంతో గుజరాత్ కన్నీటి ధారగా రోదిస్తుంది' అని ఓ బాధాకర దృశ్యాన్ని కళ్ళముందుంచుతుంది.

అగ్రకుల అహంకారాన్ని దళిత స్పృహతో ప్రశ్నిస్తో

ఇరాం లేకుంట అదిలిత్తరు
పెద్దకులమని గద్రిచ్చుడు
జరసైను బిడ్డ
వీల్లతోని తిప్పలున్నది (పే.23) అని ధికారాన్ని ప్రదర్శిస్తోంది.

'నడక' హుస్నాబాద్ మీద నోస్టాల్జియా, శిధిలమవుతున్న పల్లె రోదన. అగ్రకుల మతతత్వ హింసకు, అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ధ్వనించిన ప్రతిఘటన. అనేక అంశాల కలయికే 'నడక'గా చెప్పవచ్చు.

**(నడక, అన్నవరం దేవేందర్, వెల : రు.30/-, ప్రచురణ : నూతన సాహితి)**

---

జిలుకర శ్రీనివాస్

# దళిత స్త్రీ రచయితల సాహిత్య చరిత్ర నల్లపొద్దు




స్త్రీల మీద మగ వాదం మరోసారి దాడి చేస్తున్న సందర్భంలో దళత స్త్రీవాదం ప్రకటించిన 'నల్లపొద్దు' రచనను పాఠక కోణం నుంచి చూడాలి. ఈ క్రమంలో బ్లాక్ ఫెమినిజం ప్రకటించిన నల్లజాతి స్త్రీల సాహిత్య చరిత్ర రచనలతో ఈ రచనకు గల సామీప్యత, సారూప్యతల్ని కూడా పరిశీలించాలి. అంబేద్కరిజం, స్త్రీవాదాల ఫలితంగా అనేక అనుభవాల నేపథ్యంలో ఆవిర్భవించిన దళిత స్త్రీవాదం అతి తక్కువ కాలంలో అనూహ్య విజయాల్ని సాధించింది. నల్లపొద్దు పట్ల సాంప్రదాయ అగ్రకుల హిందుత్వ వాదులు క్రిష్టియానిటి కుట్రగా అభివర్ణించారు. ఎన్జీవో సంఘాల సామ్రాజ్యవాద కుతంత్రంగా మరో సాహిత్యవర్గం అభిప్రాయపడింది. ఇవన్ని దళిత స్త్రీవాదం వేసిన ప్రశ్నలకు సరయిన సమాధానం ఇవ్వలేక, దళిత స్త్రీల ప్రత్యేక అస్థిత్వాన్ని గుర్తించ నిరాకరించ చేసిన వాదాలుగా చెప్పవచ్చు.

సాహిత్య చరిత్ర రచనలో స్త్రీలకు దొరికిన చోటు చాలా స్వల్పం. ఆధునిక సాహిత్య చరిత్రలో స్త్రీల రచనలకు ద్వితీయ శ్రేణి స్థానం, ప్రచారం లభించింది. ఇక దళిత రచయితలకు జరిగిన అన్యాయం అందరికి తెలిసిందే. దళిత స్త్రీలకు కనీస గుర్తింపు, చోటు కూడా కరువయ్యింది. స్త్రీవాదం ప్రచురించిన 'మహిళావరణం'లో దళిత స్త్రీలు ఇద్దరు, ముగ్గురికన్న ఎక్కువ కనిపించరు. దళితవాదం తెచ్చిన అనేక రచనల్లో సింహభాగం పురుష రచయితలకే దక్కింది. ఇది యాదృచ్ఛికంగా జరిగినట్టు కనిపించినా, దీని వెనుక సామాజిక కారణం వున్నది. ఈ సమాజంలో అగ్రకులానికి, మగాళ్ళకి వేల యేండ్లుగా అనుస్యూతంగా వచ్చిన 'గొంతు' వున్నది అలాగే ఇతర అణగారిన వారి పట్ల పాటించే 'ఉపేక్ష/ఉదాసీనత' గుణం ఆ రెండిటికి వున్నది. ఆలస్యంగా దొరికిన అవకాశాన్ని ఉపయోగించి స్త్రీవాదం అగ్రకుల స్త్రీల అనుభవాల్ని, ఎజెండాని సాహిత్యంలో ప్రతిపాదించింది. దళిత స్త్రీలను ఉపేక్షించింది. అలాగే దళితవాదం అగ్రకుల దోపిడిని తీవ్రంగా వ్యతిరేకిస్తూ ధిక్కార స్వరాన్ని విప్పింది. కాని దాని గర్జనలో దళిత స్త్రీల గొంతు వినిపించకుండా పోయింది. అందుకే దళిత స్త్రీవాదం చారిత్రిక అవసరంగా ముందుకొచ్చింది.

ఈ విధంగా మరెక్కడయినా జరిగిందా? యూరోపియన్ సాహిత్య చరిత్రని గమనిస్తే స్పష్టంగా కనిపిస్తుంది. ఇంగ్లీషు సాహిత్య చరిత్రలో నల్లజాతి రచయితలకు దొరికిన చోటు చాలా తక్కువ. ఇది గమనించిన నల్లజాతీయులు నిర్మించిన Niaro poetryలో నల్ల స్త్రీలకు చాలా తక్కువ ప్రాధాన్యత కనిపిస్తుంది. 1960 నుంచి వచ్చిన అస్తిత్వ ఉద్యమాలు నూతన ఆవిష్కరణలు చేశాయి. స్త్రీలు, నల్ల జాతీయులు న్యూయార్క్, బర్మింగ్‌హంలలో చేసిన సాహస పోరాటం, తాత్విక రంగంలో సార్త్రే ప్రతిపాదించిన అస్తిత్వవాదం ప్రత్యేక ఉద్యమాలకు బలానిచ్చాయి. ఈ నేపథ్యంలో స్త్రీవాదం స్త్రీల ఎజెండాను ముందుకు తెచ్చింది. బ్లాక్ ఫాంథర్స్ మూవ్‌మెంట్ మార్క్సిజం కోణంలో నల్లవారి విముక్తికి మానిఫెస్టో ప్రకటించింది. సాహిత్యంలో ఈ రెండు అనేక గుణాత్మక మార్పుల్ని తెచ్చాయి. స్త్రీవాదం, నల్లజాతివాదం విరివిగా అనేక రచనల్ని భిన్న పార్శ్వాల్ని ఆవిష్కరిస్తూ తెచ్చాయి. అయితే, ఈ రెండు పోరాటాల్లో ముందుండి పోరాడిన నల్లజాతి స్త్రీలకు మళ్ళీ అన్యాయమే జరిగింది. వారికి రచనల్లో, చరిత్రలో ఏదో మూలకు మాత్రమే అవకాశం దొరికింది.

Ishmael Reed సంపాదకత్వంలో వచ్చిన African American Literature, Hispanic Literature అనే గ్రంథాలలో నల్ల

స్త్రీలకు చోటే లేదు. వీటన్నిటిని గమనించిన నల్లజాతి స్త్రీలు Black Feminism ప్రారంభించారు. 1973లో National Black Feminist Organization, Combahee River Collective (1974). The League of Black Women (Chicago), National Black Women's Political Leadership Caucus (Detrolt), Black Women's Organization for Action (Sanfranclsco), Black Women's Studies Faculty and Curriculum Development Project (1983-85) అనే సంస్థల్ని ఏర్పాటు చేసుకొని విస్తృత పోరాటం చేశారు.

నల్ల జాతి స్త్రీల సాహిత్య చరిత్ర, అనుభవాల పేటికగా Black Women's Blues అనే రచనను ప్రకటించారు. దీనికి దళిత స్త్రీవాదం తెచ్చిన 'నల్లపొద్దు'కు మధ్య సారూప్యత, సామీప్యత ఉన్నది. అనుభవాలపరంగా, అనుభూతులలో నల్ల దళిత స్త్రీల మధ్య చాలా దగ్గరితనం ఉన్నది. ఇక రచన నిర్మాణంలోని ప్రణాళిక కూడా ఒకే విధంగా ఉన్నట్టు కనిపిస్తోంది.

నల్లపొద్దు ముందు మాటలో చర్చించిన 'దళిత సాహిత్య చరిత్ర నేపథ్యం' దళిత స్త్రీవాద అవగాహన విస్తృతిని చూపిస్తోంది. 'తెలుగు సాహిత్య చరిత్రను దశలు దశలుగా వర్గీకరించిన తీరు చూస్తే ఒక రాజ్యంపై మరొక రాజ్యం దండెత్తి మారణకాండ జరిపి జయించి, పాలించిన సంఘటనలను అనుసరించి చరిత్రను విభజించారు. అంతే తప్ప వర్ణ, కుల వర్గాధిపత్యానికి వ్యతిరేకంగా శాంతిని పునాదిగా చేసుకొని జరిగిన పోరాటాలు వాటి తాలూకు సాహిత్యాన్ని ఆధారం చేసుకొని చరిత్రను విభజించడం కనబడదు' అని సాహిత్య చరిత్ర నిర్మాణం, అధ్యయన రీతిని స్పష్టంగా చెప్తోంది.

'భారత చరిత్ర అంతా వర్ణ, వర్గ, ఆర్య, హిందూ కులాధిపత్యాలకి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల చరిత్ర అని చెప్పొచ్చు. ఈ పోరాటాలే నాగరిక ప్రజాస్వామ్య సమాజాన్ని ఆవిష్కరించాయి.' అని వ్యాఖ్యానించడం సరైంది. అయితే 'భారత' అనే పద ప్రయోగం దళిత వాదం ప్రకారం సరైంది కాదు. ఈ దేశం నాగజాతి/సింధూ నాగరిక ప్రజలది. భరతుడు దురాక్రమణ దారులు, వలసవాదులైన ఆర్యుల రాజు. భారతదేశం అనడంవల్ల ఈ దేశ పూర్వీకులు ఆర్యులని అంగీకరించినట్టు అవుతుంది. దళితులే ఈ దేశ నిజమైన పూర్వీకులు, వారసులు అని భావించేదానికి విరుద్ధ అంశంగా ధ్వనించే అవకాశం ఉన్నది.

సాహిత్య చరిత్రని వివిధ దశలుగా, 1. క్రీస్తుకు పూర్వం బవుద్ధ దశ. 2. క్రీ.శ. మధ్య యుగాలు బ్రాహ్మణేతర పోరాట దశ (క్రీ.శ.12-18), 3. సామాజికోద్యమ దశ (1810-1900), 4. ఆదిజన ఉద్యమ దశ (1960-1961), 5. దళిత యుగం (1962-1999), 6. దళిత స్త్రీ శతాబ్దం (2000-) అని విభజించింది.

'దళిత స్త్రీలు రాయడమంటే...' అనేక నిషేదాల్ని, విమర్శల్ని అధిగమించడమన్నది నిజం. రాసిన వాటిని పనికిరానివిగా విమర్శించడంవల్ల నీరసపడే స్థితి ఉన్నది. ఈ రచనల్లో పాండిత్యము లేదు, ఛందస్సు లేదు, యతిప్రాస లేదు. పాండిత్యము, ఛందస్సు రెండూ ఉండి సంస్కృత పద్యాలకు దీటుగా, బ్రాహ్మణ మగ పండితులకు మేటిగా దళిత రచయిత్రులు రచనలు చేస్తే, వారు ఆధునికులు కాదని, సరైన దృక్పథము లేదని, పురాతన ప్రక్రియ అని, వీరి రచనల్లో అనుభవం కానీ, బాధలు కావని లేవన్నారు. శిల్పం, వస్తువు, భాష సరిగ్గా ఉన్నాయా, లేవా వారిని రచయిత్రులుగా గుర్తించాలా, వద్దా? అని తేల్చుకోవడానికి తెలుగు సాహిత్య సమాజం కుల, మత పరిమితులను కొనసాగిస్తుంది' అని చేసిన వ్యాఖ్య ఎంతో సముచితమైంది. Minority Discourse అనే రచనలో Abdul R. Janmohamed, David Lloyd లు 'అసంపూర్ణం, అభివృద్ధి చెందుతున్న మైనారిటీ రచనలుగా ఆధిపత్య మానవతావాదం అభివర్ణిస్తోందంటే భావజాల పరిమితుల్ని విధించినట్టు నిర్ధారణ చేసుకోవాలి' ఇలాంటి భావజాల దాడిని ఎదుర్కోవడం Minorty discourseలో అవసరమైన అంశంగా చెప్పారు. దళిత స్త్రీవాదం ఈ అంశాన్ని సరిగానే గుర్తించింది. మను ధర్మం దళిత స్త్రీలను దూరం చేసిన సంగతిని గుర్తించింది. వీటన్నిటిని ఎదుర్కొంటూ దళిత స్త్రీ రచన చేయడం మామూలు విషయం కాదని అభిప్రాయపడింది.

దీనిలో 54 మంది దళిత స్త్రీల రచనలు, జీవిత విశేషాలు కనిపిస్తాయి. అందరు రచయితలు స్త్రీవాదులు కారు. 1921 నుండి 2002 వరకు లభించిన దళిత స్త్రీల వివరాల్ని పొందుపరిచారు. ఫిలిప్ బి. జ్ఞానరత్నమ్మ (1890-1960) మొదలు స్వాతి మార్గరేట్ వరకు మనం చూడవచ్చు. హిందూ, క్రిస్టియన్ మతాల ప్రభావంతో, మిషనరీల విద్యవల్ల రచనలు చేసిన వారున్నారు. జాతీయోద్యమంలో కలం దూసిన వారున్నారు. పద్యాలు, వచనం, కథలు, నవలలు రాసిన వారున్నారు. ఎవ్వరికి తీసిపోని రీతిలో అద్భుతంగా రచనలు చేసినవారున్నారు.

ఈ రచనలో దళిత స్త్రీలలో వచ్చిన చైతన్యం, భావ పరిణామం కనిపిస్తోంది. వారి అవగాహన పెరిగిన, వ్యాపించిన తీరు కూడా కనిపిస్తోంది. జ్ఞాన సిద్ధాంతన్ని (Epistemology) దళిత కోణం నుండి పరీక్షించిన విధం నిజంగా ఆశ్చర్యపరుస్తోంది. జూపాక సుభద్ర ప్రచార జ్ఞానం, పరిసర జ్ఞానం రెండిటివల్ల పొందే ఘర్షణని, ప్రచార జ్ఞాన డొల్లతనాన్ని చూపించింది. విజయభారతి పురాణ సాహిత్యాన్ని దళిత స్త్రీ దృష్టితో చూసి అనేక వాస్తవాల్ని వెలుగులోకి తెచ్చారు.

అయితే, ఈ నల్ల పొద్దు సమగ్రమైనదేమి కాదు. అది ఆరంభం మాత్రమే కావటం వల్ల అనేక మంది రచయిత్రులు బయటే మిగిలిపోయి ఉండవచ్చు. ఇంకా పరిశోధన చేస్తే దళిత రచయిత్రులు వివరాలు లభించవచ్చు. ఎంతో శ్రమ, ఓపిక అవసరమయ్యే పెద్ద ప్రాజెక్ట చేసినందుకు గోగు శ్యామలను అభినందించాలి.

**నల్లపొద్దు దళిత స్త్రీల సాహిత్యం 1921-2002, సం॥ గోగు శ్యామల, వెల : రు.50/-, ప్రచురణ : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్**

---

పి.ఎం.

## తెలంగాణా పల్లెల వాడవెతలు 'కిర్రుచెప్పులు'

కిర్రుచెప్పులు
(కథాసంకలనం)
దార్ల రామచంద్రం

తెలంగాణ వాడ బతుకుల వెతలను బలంగా ఎత్తిచూపిన యువ తెలంగాణా రచయితల్లో దార్ల రామచంద్ర ఒకరు. తెలంగాణ పల్లెల్లోని అణిచివేతలు, అవమానాలతోపాటు కష్టాలు. పేదరికాన్ని స్వయంగా ఎదుర్కొంటూ వచ్చినవాడు కనుక రామచంద్ర ఇంత మంచి కథలు రాయగలిగారు. టైటిల్ కథ అయిన 'కిర్రుచెప్పులు' కథలో 'వృ[illegible] ఊడితే ఊడింది. ఆత్మగౌరవం మిగిలింది. అంటరానితనం తగ్గుముఖం పట్టింది. ఈ విధానంవల్ల పూర్తిగా మార్పు రాకపోయినా పాక్షికంగా మార్పు జరిగినందుకు మైసయ్యకు, భద్రంకు గొప్ప మానసిక సంతోషం ఉంది. ఆర్థిక ఇబ్బందులు మాత్రం ఎక్కడ వేసిన గొంగడి అక్కడే అ[illegible] ముగింపు వాక్యాలను పరిశీలిస్తే పల్లెల నుండి పట్నాలకు వలస వచ్చి[illegible]

దళితులు కొంత ఆత్మ గౌరవంతో జీవిస్తున్నారని చెబుతాడు. ఒసేయ్ ఒరేయ్ పిలుపులు పట్నం జీవితంలో లేనందుకు కొద్దిగా దళితులకు ఆత్మగౌరవంగా ఉందని అభిప్రాయపడతాడు. అయితే ఆర్థిక పరిస్థితులు మాత్రం మారలేదని రచయిత చెప్పడం నేటి వాస్తవ పరిస్థితులకు దర్పణం పడుతుంది.

'పత్తికాటు' కథలో నేటి పరిస్థితుల్లో వ్యవసాయం భారమై రైతులు ఆత్మహత్యకు పాల్పడుతున్న వైనాన్ని కళ్ళకు గట్టారు. ఇదే కాకుండా 'అమ్మచెప్పిన కథ', 'చాకిరేవు', 'నా పల్లెగుండె పగిలింది' కథల్లో కూడా రైతుల కష్టాలు, బ్యాంకు అధికారుల నిబంధనలు, వారి బలవంతపు వసూళ్ళు, రైతులు తమ భార్య మంగళసూత్రాలు తాకట్టుపెట్టడం, చివరకు ఆత్మహత్య చేసుకోవడం వంటి పరిణామాలను హృద్యంగా రాశారు. దళితులు చైతన్యవంతులై ఓర్వలేని వారి మానసిక స్థితిని' ఇంకా ఎన్నాళ్ళీ నరమేధం. కథలో ఎత్తిచూపారు. అలాగే చేనేతల పరిస్థితులపై కూడా రచయిత స్పందన ఉంది. సంకలనంలోని కథలు దళితుల వ్యధాభరిత జీవన చిత్రాలే. తెలంగాణా భాష పరంగా ఇంకా కొంచెం చిక్కబడాల్సిన దార్ల రామచంద్రం భవిష్యత్తులో మరిన్ని మంచి కథలు అందిస్తారని ఆశిద్దాం.

---

**అద్దేపల్లి రామమోహనరావు**



# మామూలైన అనుభవాల వైవిధ్యం

కవిత్వం రాసే తీవ్రమైన తపన ఉండాలిగాని, జీవితంలో ఎదురయ్యే ప్రతి సన్నివేశాన్నీ కవితగా రాయవచ్చు. అయితే, కొన్ని వస్తువులు సహజంగానే, పాఠకుని హృదయంలోని భావాల్ని తట్టిలేపి, కవిశక్తి కొద్దీ అనుభూతుల్ని కలిగిస్తై. అన్ని వస్తువులకూ ఆశక్తి ఉండకపోవచ్చు. అప్పుడు కవి, తన ఆలోచనల్ని, అభిప్రాయాల్ని, ఇముడ్చుకోవడానికి అనువైన యితర వస్తువులలో అల్లికల్ని, ఉద్రేకాల్ని, మిళితం చేసి, మంచి కవితగా తయారు చేయవలసి వుంటుంది. అలా తయారు చేయగలిగే ఓపిక, ప్రతి చిన్న వస్తువుపట్లా కవికి ఉండడం అరుదైన విషయం. జీవితంలో ఎదురయ్యే ప్రతి సన్నివేశాన్నీ కవితగా మలచే తపన ఆశారాజుకి ఉంది. కొన్ని కవిశక్తివలన గాఢతను పొందుతై, కొన్ని సాదాసీదాగా సాగిపోతై. ఈ లక్షణం 'మామూలుగా' అనే 'దీర్ఘకవిత' కూడా కనిపిస్తుంది. దీనికి కారణం వస్తువరణంలోనే ఉంది.

ఇది 'దీర్ఘకవిత' అని కవి అన్నాడుగాని, యిందులో ఏకధారగా ప్రవహించే వస్తువులేదు. పోనీ అనేక వస్తువుల ద్వారా ప్రవహించే భావధార లేదు. అనేక 'లిప్త'ల్లో తాను చూచిన అనేక సన్నివేశాల్ని కవితలుగా మలచి లిప్తల సమాహారాన్నే దీర్ఘకవితగా చెప్పాడు. ఇది ఆలోచనీయమైన అంశమే. ఇందులో ప్రగతి, అనుభూతి, ఆత్మాశ్రయత్వం, వాస్తవికత, మొదలైన ఎన్నో ప్రధానంగా కవితలు సాగిపోతై. అనేక లిప్తల్లో ప్రవహిస్తున్న మనిషి అనుభవాల దొంతరగా రూపొందింపబడింది.

ఒక లిప్తలో నీళ్ళతో నిండిన కూజాను వర్ణించాడు కవి.

**'సరిగ్గా గమనించు / కూజా మెడ మీద ఎందరు ముట్టుకున్న గుర్తులున్నాయో / దాన్ని గ్లాసులో పోసుకున్నారు / దోసిట్లో ఒంపుకున్నారు / కొందరు నేరుగా నోట్లోనే ఒంపుకున్నారు / దాన్ని ఎటు తిప్పినా / అందరి దాహం తీర్చింది / అలిసిపోయిన ముఖాల్ని కడిగింది / ఎంగిలి టిఫిన్ డబ్బాల్ని శుభ్రపరచింది...!**

నీళ్ళు నిండినప్పుడు పొంగిపోలేదు, ఖాళీ అయినప్పుడు కుంగిపోలేదు. నీళ్ళు నింపిన కూజాను చూసినప్పుడు 'నిండుగర్భిణీ' గుర్తు వస్తోంది అన్నాడు. ఒక నిండు కూజాను చూచి, రాసిన కవితయిది. కూజాను వర్ణిస్తూ భంగ్యంతరంగా, అందరి దాహం తీర్చే ఒక స్త్రీని వర్ణించాడు. ఇది పదాలకున్న ధ్వని శక్తివల్ల వచ్చింది.

మరో లిప్తలో కవి ఒక సంఘటన చూశాడు.

**'తల్లిచేతిలోంచి / పళ్ళ బుట్ట జారిపడింది./ కొడుకు పళ్ళను ఏరితెచ్చాడు / భుజానికున్న స్కూలు బ్యాగు తెగిపోయింది / తల్లి వీపుమీద ఒకటిచ్చింది / పిల్లాడు ఏడిస్తే తల్లి కళ్ళు తడిశాయి / బ్యాగులాక్కుని కొడుకును ముద్దాడింది / ఇప్పుడు చెప్పు ఆకాశం పెద్దదా? / తల్లిప్రేమ పెద్దదా?'**

నిజానికి ఈ కవిత యింతతో అయిపోయింది. సమగ్రమైన అర్థం వచ్చేసింది. ఆ తర్వాత నగ్న శరీరాల పాప్‌సాంగుల వికార సంస్కృతి, ఆ మీదుగా సరైన స్పష్టతలేని వర్ణన, తర్వాత సముద్రాన్ని గూర్చి చెప్పి, మంచి భావచిత్రంతో ముగించాడు.

**'ఒడ్డు మీద నిలబడి సముద్రాన్ని చూడు / అది చుట్టచుట్టుకుని పడుకున్న మహాసర్పం / బుస వినబడుతున్నట్లుంది / రాళ్ళు విసరకు / నువ్వూ మిగలవు, నీ చేతిలోని కర్రా మిగలదు'**

ఈ సముద్రాన్ని సంస్కృతి అనుకున్నా, పైన సరైన భావధార స్పష్టం కాని పంక్తుల భావాన్ని గ్రహించడం అసాధ్యమవుతుంది. ఒక వేళ, ఇది మూడు కవితల సమాహారమా అనిపిస్తుంది. అనిపించింది. అనిపించినట్లు రాయడం వల్ల వచ్చిన క్లిష్టతా అనిపిస్తుంది.

ఎక్కువ కవితలు వచనత్వంతో సాగి, ఎక్కడికీ తీసికెళ్ళకుండా ఉంటై.

**'దేనికదే రాస్తావా / దేన్ని గురించి దాన్నే రాస్తావా / అన్నిటికీ వేరువేరుగా రాస్తావా / అన్నీ కలిపి ఒకటే రాస్తావా / తలకిందులుగా రాస్తావా / తిన్నగానే రాస్తావా / అది నీ యిష్టం...!**

బహుశా యిది 'మామూలుగా'లోని కవితల లక్షణం కావచ్చు.

అందరికీ సంబంధించిన మామూలు అనుభవాల్నిలోతుగా, మనని ఐక్యం చేసుకునేట్లుగా చెప్పిన కవితలూ ఉన్నై.

**'బస్టాండులో ఎవరో కనబడతారు / తెలిసిన ముఖమని దగ్గరికెళ్తాం / అతడు మనల్ని గుర్తు పట్టడానికిష్టపడడు / చేతికున్నవాచీని చూసుకుంటాడు / దూరంగా వచ్చే బస్సుని చూస్తాడు / అడుక్కుంటున్న గుడ్డివాడెంతో / అక్కడ మనమూ అంతే'**

ఈ కవితలో కవి చెప్పిన సందర్భాలన్నీ ప్రతి ఒక్కడూ ఏదో ఒక లిప్తలో అనుభవించే ఉంటాడు.

జీవితంలో ఎన్నో లిప్తల మీదుగా మనిషి నడిచిపోతుంటాడు. కొన్ని లోతుగా ఉంటై. కొన్ని తాకీ తాకకుండా పోతూ ఉంటై. కొన్ని పట్టించుకునే అవసరం లేకుండా గడిచిపోతై. ఇంత వైవిధ్యమూ ఈ 'దీర్ఘకవిత'లో ఉంది.

**(మామూలుగా - దీర్ఘకవిత : కవి - ఆశారాజు, వెల:రు.30/-, దొరుకుచోట్లు : ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తక కేంద్రం)**




# బయట ఎండ లోపల వర్షం

'నే / చచ్చిపోతాననే కదూ / నీ / బాధ / పిచ్చివాడా / ఈ వ్యవస్థలో / మనం బతికింది / తొమ్మిది మాసాలే'

1975-85ల మధ్య యువతరాన్ని అపూర్వంగా ఉత్తేజితం చేసిన 'మినీ కవిత'ను ప్రచలితం చేస్తూ, ఈ పై కవితని ఎన్నో వేదికల మీద చదివాను. నేను ఆ రోజుల్లో రాసిన 'మినీ కవిత' పుస్తకంలో ఈ కవితనూ ఉదహరించాను. ఆ రోజుల్లో అందర్నీ ఆకర్షించిన ప్రథమ స్థాయి మినీ కవితల్లో యిదొకటి. జింబో పేరు ఈ కవితతో సుస్థిరమైంది.

మినీ కవిత ఉధృతంగా వచ్చిన రోజుల్లో, యువకవులందరూ తమ సామాజిక రాజకీయ కసిని ఆ రూపం ద్వారా గొప్పగా వ్యక్తం చేశారు. అందరూ సమకాలీన జీవన దౌర్భాగ్యాన్ని వర్ణిస్తుండగా, అసలు నేల మీద పడ్డప్పటి నుండీ కష్టాలేననీ, కడుపులో ఉన్న తొమ్మిది నెలలే సుఖంగా ఈ వ్యవస్థ బతకనిస్తుందనీ జింబో చెప్పిన ఈ 'బతుకు' కవిత, కసిని పరాకాష్టగా చెప్పడంవల్ల ప్రసిద్ధమైంది.

'లోపలి వర్షం' కవితా సంపుటిలో ఈ కవితను కూడా చేర్చారు. అయితే ఈ కవితా సంపుటి, సామాజిక భావాల్ని గూర్చింది కాదు. అలాటివి రెండో మూడో ఉన్నప్పటికీ ప్రధానంగా 'లోపలి వర్షం', జీవితంలో అంతర్ముఖుడై ఎదురయ్యే సన్నివేశాల్నుండి తాత్విక దృక్పథాన్నందించే ఆలోచనల సమాహారం. అందుకే దీనికి కవి 'లోపలివర్షం' అనే పేరు పెట్టాడు. నది ఒడ్డున నిలబడి నదిని పరిశీలిస్తున్నట్లు, జీవితంలో కొట్టుకుపోతూనే అప్పుడప్పుడు, తన నుండి తాను వేరై జీవిత గమనాన్ని చూడగలిగితే, ఎన్నో అద్భుతమైన సత్యాలు కనిపిస్తై. విచిత్రమైన అనుభూతులూ కలుగుతై. అలా కలిగిన అనేక ఆలోచనల్ని 'లోపలివర్షం' మనకందిస్తుంది. ఏ సిద్ధాంతాలూ లేకుండా జీవితాన్ని గమనిస్తే, జీవితమంత ఆశ్చర్యకరమైంది మరొకటి లేదన్న సత్యానికి యిందులోని కవితలన్నీ ఉదాహరణలే.

'వర్షం పడుతుందని / ఎదురు చూస్తూ ఉంటాం / ఆ వర్షాన్ని ఎదుర్కోవడానికి / ఛత్రీ తీసుకుంటాం / మబ్బులన్నీ మాయమవుతాయి/ తుఫాను వస్తుందని / హెచ్చరికలు వస్తాయి / మనం సంసిద్ధులమవుతాం / తుఫాను తీరం దాటిపోతుంది.

.....

ఎందుకూ పనికి రాడనుకున్నవాడు / ఆకాశమంత ఎత్తు ఎదిగి / అద్భుతాలని సృష్టిస్తాడు'

ఇలా జీవితంలోని అనిర్వచనీయతను చెప్పి

'జీవితం కన్నా బీభత్సమయినది / జీవితం కన్నా విచిత్రమైనది / జీవితం కన్నా అద్భుతమైనది / మరేదైనా ఉందా ఈ ప్రపంచంలో' అంటారు.

కొన్ని మామూలుగా స్థిరపడిన అభిప్రాయాల్ని వ్యతిరేకిస్తూ లోతైన పరిశీలనలు చేయడం ఈ కవితా సంపుటిలో కనిపిస్తుంది.

'ఏదీ / రూఢికాకూడదు / అర్ధసత్యాలే మేలు

.....

రూఢి కాకుంటేనే / సంశయం, సందేహం / ఆలోచన వెతుకులాట / ఏదీ రూఢి కాకూడదు / రూఢి అయితే ఏమీ ఉండదు'

ఇలా తాత్వికాలోచనలు అందించేటప్పుడు కవితాత్మకతక అవకాశం లేక కేవలం ఉద్ఘాటనల పంక్తులుగా ఉండే పరిస్థితి కూడ ఉంటుంది. ఈ కవితా సంపుటిలో అలాటి పంక్తులూ ఎక్కువగానే కనిపిస్తై.

'నువ్వు / కన్నీళ్ళు కురిపిస్తే / వాళ్ళు / నీపై జాలికురిపిస్తార / అందుకే / నీ కళ్ళు కురిపించాల్సింది / కన్నీళ్ళు కాదు / కాంతీ కరుణా / కాఠిన్యం'

రాయడంలోని ఒక లయ, పంక్తులు విరవడంలోని ఒక దృశ్యమాన వైచిత్రి ఉన్నా, సామాన్యంగా చెప్పినట్లే ఉంటుంది.

అందరం చూసే సన్నివేశాల్లోంచే ఒక తాత్విక సత్యాన్ని నిరూపించడంలో, ఎంతో అలవోకతనం ఉంది జింబో ఈ లక్షణం ఆయన కవితల నిండా పరుచుకుని ఉంటుంది.

'ఏం మనసో / రాత్రంతా కౌగిలించుకునీ / బుజ్జగించుకునీ / చెప్పీ వినీ తృప్తిపడీ / అయినా / తెల్లవారితే పరగడుపే!!

దీని శీర్షిక 'ధార'. రాత్రి మనస్సుని ఎన్ని విధాలుగ మలచుకుందామనుకున్నా, తెల్లవారేటప్పటికి జీవిత ధోరణి ఏమీ మారదు అది ఒక ధార. పరిణామం లేకుండా ఒకే విధంగా ఉండేదే 'ధార' పరిణామం లేనందుకు పడే బాధ ఈ చిన్నకవితలో ధ్వనిస్తుంది.

సామాజికంగా చెప్పినా, తాత్వికంగా చెప్పినా, క్లుప్తంగా సూటిగా చెప్పే ఒక మనస్థితి జింబోకి ఉంది. అందుకే ఆయన మినీ కవితలు సమగ్రమైన అభివ్యక్తి కలిగి ఉంటై. శీర్షిక, పంక్తుల్ని భావానుగుణమైన లయతో సమకూర్చుకోవడం, కొసమెరుపు మొదలైనవన్నీ పటిష్టంగా ఉంటై.

'నేనో కర్రముక్కనే / ఇంటి గడపనే / చేతికర్రనే / నువ్వు కూర్చునే కుర్చీనే / అవును / నేనో కర్రముక్కనే / కానీ / జ్ఞాపకముంచుకో / నేనే / ప్రజల ఆయుధాలు / కొడవలి పిడినై / గొడ్డలి కామానై సుత్తెల్లో ప్రాణాన్నై / జీవిస్తా'

'లోపలి వర్షం'లో కొద్దిగా సామాజిక భావతీవ్రతగల కవితలు ఉన్నై. కాని ఎక్కువ భాగం జీవితాన్ని గూర్చిన ఆలోచనలే.

యౌవనంలో బహిర్ముఖుడై సామాజిక అసంతృప్తితో కవితల రాసిన కవి. క్రమంగా అంతర్ముఖుడై తాత్విక పరిశదిలోకి వెళ్ళినట్ల కనిపిస్తుంది. ఈ రెండు రంగాలూ, అందర్లోనూ ఉండవచ్చుగాని కవిత్వాన్ని వినియోగించుకునే లక్ష్యంలో మార్పు కనిపిస్తుంది.

'లోపలివర్షం'లోని ఆలోచనలు, వేదాంత పరిధిలోకి వెళ్ళవ కాబట్టి, అందరికీ అందుబాటులో ఉండే అనుభవాల్నే తట్టిలేపి, కాసేప ఆలోచింపజేస్తై.

(లోపలి వర్షం - కవితా సంపుటి, రచన -జింబో, వెల : రు. 50/- దొరుకుచోట్లు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, నవయుగ బుక్‌హౌస్‌లు, దిశ పుస్తక కేంద్రం)

43

సైదులు ఐనాల

# హృదయ స్పందనల సమాహారం

**ఆకాశం నేలపాలైంది**

(హైకూలు)

లంకా వెంకటేశ్వర్లు

సాహిత్యంలో సందర్భానుసారంగా అవసరానుగుణ్యంగా ఏదో ఒక కొత్త శాఖ పుడుతుంది. మొదట్లో ముమ్మరంగా క్రమానుగతంగా సహజంగానే మరో కొత్త దానితో మరుగున పడ్తుంది. ఏదైనా చివరికి పాతదిగానే కన్పడుతుంది. కొన్ని సంకుచితంగా ఆ దశలో ఆ ప్రాంతానికే పరిమితం కాగా మరికొన్ని నలుదిశలా విస్తరిస్తాయి. అలాంటి సాహిత్య ప్రక్రియల్లో 'హైకూ' ముందుగా చెప్పుకోవచ్చు.

సంక్షిప్తంగా తను చెప్పదలచుకున్న విషయాన్ని, తను పొందిన అనుభూతిని ఎదుటి వాడు ఆపాదించుకోగల్గిన శైలిలో ముందుకొచ్చింది హైకూ. మొదట జపనీ భాషలో పుట్టినా నేడు అంతటా వ్యాపించింది. హృదయానుభూతి అధికంగా ఉండటమో, సంక్షిప్తంగా ఉండటమో తెల్వదుగానీ పత్రికల్లో తన స్థానాన్ని నానాటికీ పదిలపరుచుకుంటుంది హైకూ. సహజంగానే తెలుగు సాహిత్యం కొత్త ప్రయోగాలకు, కొత్త ప్రక్రియలకు స్వాగతించడంలో ముందుంటుంది.

ఒక్కోసారి ఈ స్వాగతం కాస్తా అతిగా కూడా అన్పిస్తుంది. ఏది ఏమైనా కొత్తతరం కవుల్ని ఆకర్షించే ఈ హైకూ గురించి మాట్లాడుకోవాలంటే ఏదో ఒక ఉదాహరణ చెప్పుకోవాలి.

ఆ క్రమంలో ఈ మధ్య వచ్చిన "ఆకాశం నేలపాలైంది". హైకూలు ప్రథమంగా చెప్పాల్సిన వాటిల్లో ముందుగా ప్రస్తావించవచ్చు. లంకా వెంకటేశ్వర్లు వెలువరించిన ఈ హైకూ పుస్తకంపై అట్ట చాలా ఆకర్షణీయంగా ఉంది. లోపలి హైకూలు చదివినంక పాఠకుడు ఇట్టే లాగబడ్తాడు హైకూ సామ్రాజ్యం వైపు.

అందంగా చెక్కబడ్డ శిల్పాల్లా, ఏర్చికోర్చి అక్షరాల్ని కుప్పలు కుప్పలుగా పోశాడీ రచయిత.

**"నూతిలో పడిన ఆకాశం**
**ఎంత తోడినా**
**తరగటంలేదు"**

ప్రకృతిలో పరిశీలనకు నోచుకోని ఇలాంటి చాలా విషయాల్లో ఇట్టే ఒదిగాయి కొన్ని హైకూల్లో ఇంతేనా సామాజిక స్పృహ లేదూ!

**"భిక్షుకి గొంతు తెగి**
**ఎగజిమ్మే పాటల్లో**
**రైలంతా తడుస్తాంది"** అని చెప్పడంలో ఎంతో ఆర్ద్రత ఉంది. చదువుతున్న పాఠకుని కాళ్ళముందర గతంలో తను చేసిన రైలు ప్రయాణం, తారసపడ్డ కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, మెదలాడుతారు. అంతేనా వీళ్ళపాటలు, దీనమైన మాటలు మెలిపెట్టవూ!! శీర్షిక లేకపోవడం ఈ హైకూ ప్రక్రియలు కొంత వెసులుబాటే. **ఒంటరితనం/నీడసైతం/పరాయిదే!** అని ఎన్నో ఆలోచన్లకి స్వాగతిస్తాడీ రచయిత.

సాహిత్యంలో ఏ ప్రక్రియనైనా తన కనుగుణంగా మార్చుకోగల సత్తా తెలుగు సాహిత్యానికున్న ప్రత్యేకత. అనుభూతి ప్రధానమైన హైకూను మనిషిని తట్టి లేపగల సజీవ స్టేట్‌మెంట్‌గా మార్చుకుంది. ఆ క్రమంలో ఈ హైకూ చూడండి.

**"కన్రెప్పల మధ్యకరిగి/చేజారినకల/అబార్షన్**

అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని పిండగల సామర్థ్యం ఈ చయితకున్న అదనపు అర్హతేమో అన్పిస్తుంది కొన్ని హైకూల్ని చదువుతున్నప్పుడు.

కొన్ని హైకూల్లో చెప్పాల్సిన విషయం వెనక్కుపోయింది. చిత్రం చిద్రమూ ఐయింది. ఇది రచయిత గమనించాలి. కొన్నింటిని తిరిగి తిరిగి మార్చి మార్చి చెప్పడంవల్ల పాఠకుడు అసంతృప్తికి లోనయ్యే ప్రమాదమూ వుంది. ఇంకా ఈ ప్రక్రియలో విస్తరించదలిస్తే నానీ, మినీ కవితా ప్రక్రియలనూ అధ్యయనం చేస్తే కొంత పట్టు దొరుకుతుంది. ఆ దిశగా రచయిత పయగించి మరిన్ని హైకూల్ని మూటకట్టి మనకందిస్తాడని ఆశిద్దాం.

**ఆకాశం నేలపాలైంది (హైకూలు), లంకా వెంకటేశ్వర్లు, వెల : రు.20/-**

పినాకి

# బచ్చేదానీ




'బచ్చేదానీ' అంటే గర్భసంచి. గీతాంజలి రాసిన యిరవై ెండు కన్నీటి కథల సంపుటి కూడా.

"పెద్ద దర్వాజ" (జూకంటి జగన్నాథంగారి ఉపోద్ఘాతం) ాటితేగాని కథల్లో ప్రవేశించలేం.

"ఆ కాంతిదారులలో సామాజిక ఆర్థిక రాజకీయ ుద్యమాలుగా కొనసాగుతూనే -కులం, మతం, లింగం, ప్రాంతం, ప్రాతిపదికన పునర్మూల్యాంకనం చేసుకోవాల్సిన అవసరం అనివార్యంగా ఏర్పడింది. ఆ ప్రతిఫలనం పిడుక్కూ బియ్యానికి ఒకే మంత్రం జపించే యాంత్రిక మాంత్రిక జవాబులలోని వైకల్యం కారణాల్ని కారకాల్ని నిలదీస్తుంది" (పెద్ద దర్వాజ) అర్థమైందా?

ఈ అస్పష్టత కథల్లో వుండదు. కుటుంబ హింస, బండచాకిరిగా మారిన యింటి పని, భర్త దౌర్జన్యాలతో నరకంగా మారిన యిల్లాలి జీవితం - యిదీ గీతాంజలి కథా వస్తువు. తెలుగులో మొదటి నుంచీ రంగరించిన యితి వృత్తం యిదే - కనీసం చలం గారి తొలికథల నాటి నుండీ. స్త్రీ తన "వ్యక్తిత్వాన్ని నిలుపుకునే పెనుగులాట, తండ్లాట" క్రమాన్ని రచయితలు మమేకమై చిత్రించింది. ('విస్ఫులింగాలు' అనేమాట రచయిత్రికి యిష్టం.)

కథంటే ఏమిటో నిర్వచించటం కష్టమే అయినా. కేస్‌స్టడీస్, న్యూస్ అయిటం లాంటి కథనాలు కూడా కథలుగా వున్నా యిందులో (నీడ, స్వయం ప్రభ) ఉపన్యాసమో, వ్యాసమో, సంపాదకీయమో అనిపించే 'కథలు' కొన్ని - 'చీకట్లోంచి చీకట్లోకి', 'ఊరికి పోదాం భూదేవి', 'కథ 2020' వగైరా. కథ కాని కవితావేశం -అడిగేరు. కొసమెరుపు ట్రిక్ 'వంటింట్లో నులకమంచం' ప్రధాన పాత్రలకు సమాంతరంగా మరికొన్ని

పాత్రలను పెట్టడం రచయిత్రికిష్టం. ఇది బాగానే వుందిగాని పరస్పర ప్రభావం చూపని పాత్రలెందుకు? రచయిత్రికి భాషా ప్రయోగాలు యిష్టమనటానికో వుదాహరణ "నిరంతరాయప్రశ్న".

'ఖడ్గచాలనం" అనే కథలో సమస్యాపరిష్కారానికి శరీర నిర్మాణాన్ని మార్చుకోవటం ఒక పద్ధతి అంటుంది. ఇది అభూత కల్పన లేదా మాజిక్ రియలిజం (?) అయినప్పటికీ రచయిత్రి వుద్దేశం మాత్రం తెలియదు.

కథల వెనకున్న రచయిత్రి బాధ నిజం.

"అంట్లు తోమీ బట్టలు ఉతికి ఉతికీ తన అరచేతులు గరుకు తేరాయి" ఆ పని ఎవరు చేసినా అంతే. శ్రమ గురించి కాక శ్రమ విభజన గురించి ఆలోచించటం సహేతుకమంటారు విజ్ఞులు. (కుటుంబరావుగారు ఒక చోట "చెమటోడ్చి పొలం దున్నే రైతన్నల మీద పాటలు రాస్తారు. పొలం దున్నక తప్పదు. దున్నిన వాడికి సరైన ప్రతిఫలం ముట్టడం లేదని రాయాలి." అంటారు)

చాలా కథల్లోరచయిత్రి కథనం యిలా వుంటుంది.

"నరసవ్వ అరవై ఏళ్ళ ముదుసలి. వివిధ రకాల జీవన వైవిధ్యాలకి, ఒక దీర్ఘకాలిక సంఘర్షణాత్మక జీవితానికి ఓ సజీవ సాక్షి. అనాదిగా, ఆ ఊర్లో కొనసాగుతున్న కుల వివక్షతలకి జాతిపరంగా పురుషాధిక్యతలకి నలిగినలిగి రాటుదేలిన నరసవ్వ ఒళ్ళంతా ముడతలతో నడుము ఒకింత ఒరిగినా దృఢంగానే వుంటుంది"

'యాది', 'బిచ్చగాడు', 'ప్రశ్న', 'సంటిది', 'బిఫ్‌డాచమన్', 'బచ్చేదానీ' లాంటి మంచి కథలు కూడా వున్నాయి.

ఒ.సి.ఎన్. అంటే 'అబ్సెసివ్ కంపల్సివ్ న్యూరోసిస్'ట. కథల సారూప్యత ఒ.సి.ఎన్.నుస్ఫురింపచేస్తుంది. ఇదీ యిందులో ఓ కథే.

**బచ్చేదానీ (కథలు1995-2002), గీతాంజలి, గోదావరి ప్రచురణలు, వెల : రు.50/-**

**వర్ఖుల శివకుమార్**




# వాస్తవికతకు అద్దం పట్టిన 'గాజుకళ్ళు'

ఇతివృత్తరీత్యా వైవిధ్యం కలిగి మధ్య తరగతి జీవితాలతో ముడిపడిన కథల సంకలనం "గాజుకళ్ళు". సమాజ పరిణామక్రమంలో స్త్రీలు అన్ని రంగాల్లో ముందజవేస్తూ ఉత్పత్తి క్రమంలో కూడా కీలక పాత్ర నిర్వహిస్తున్నారు. అయినా అన్ని వర్గాల్లోనూ స్త్రీ వివక్ష కొనసాగుతూనే వుంది. కారణం పురుషుడి దృక్పథంలో ఎలాంటి గుణాత్మకమైన మార్పురాలేదు. అలాంటి మార్పుని వాళ్ళ చైతన్య స్థాయిని పెంచగలిగే సంస్కారాన్ని ఈ కథలు అందిస్తాయని చెప్పకతప్పదు.

రాయలసీమ ప్రాంతం నుండి సామాజిక ఉద్యమ కార్యాచరణతో మమేకమై ఘర్షణపట్ల సామాజిక స్థితిగతులపట్ల చక్కని అవగాహనను కలిగి ఉన్న ఈ రచయిత్రి, కొందరు స్త్రీవాద రచయిత్రులలాగా స్త్రీ పక్షపాత దృష్టిని కలిగించరు. సమస్యపట్ల సందర్భాలపట్ల సంయుక్త కార్యనిర్వహణపట్ల బాధ్యతను ఇద్దరికీ గుర్తు చేస్తూ ఒక నిర్మాణాత్మక ప్రక్రియ కోసం కదిలించగలిగే చేవ ఉన్న కథలివ్వి.

సంకలనంలో పదకొండు కథలు చక్కని శిల్పంతో వాస్తవిక చిత్రణతో నిజాయితీగా సాగి ఆలోచింపచేస్తాయి. మధ్యతరగతి క్రింది మధ్యతరగతి జీవితాల్లోని సామాజిక ఆర్థిక సంబంధాల మీద ఫోకస్ చేసిన కథలే వీటిలో ఎక్కువ. 'వికసించిన అంతరంగం'లో వైవిధ్యంగా అత్త ఆడపడుచులు ఒకే రకమైన భావజాలానికి ప్రతినిధులుగా ప్రవర్తిస్తూ జ్యోతికి ఇంటి పనులలో సహకరిస్తున్న జ్యోతి భర్తను చెడగొడతారు. కాని అదే ఆడపడుచులు వాళ్ళ భర్తల సాయం తీసుకుంటుంటారు. ఈ కథలో అత్త, ఆడబిడ్డలు చివరికి జ్యోతి అందరూ వేర్వేరు సందర్భాలలో అదే భావ జాలానికి ప్రతినిధులుగా ప్రవర్తిస్తుంటారు. ఈ రకంగా కుటుంబ సంబంధాల సంకీర్ణ స్థితిని ఈ కథ ఎరుక పరుస్తుంది.

రాయలసీమ ప్రాంతంలో తరచూ ఎదురుపడే కరువు కోరల కింద తల్లడిల్లుతున్న కింది తరగతి కుటుంబాల దయనీయ స్థితిని దృశ్యమానం చేస్తూ చెప్పబడిన కథ 'గాజుకళ్ళు' వెలవెలబోతున్న పల్లె దృశ్యమూ జీవచ్ఛవాల్లాంటి మనుషుల పెనుగులాటలను రచయిత్రి కంటతడిపెట్టించేలా చిత్రించారు. వ్యవసాయం చెదిరి బతుకు మీద నమ్మకం ----- ఊహల్లోని ఆనందం ఊపిరికందకుండా మారిన తీరు, నాగప్పతండ్లాట, చెల్లెలు నిస్సహాయ స్థితి, తల్లి అశక్తత మనకెదురుగా జరుగుతున్నదే అనుభూతిస్తాం. ఈ కథలో రచయిత్రి ప్రదర్శించిన ప్ర అపూర్వం. పల్లెల నుండి పట్నానికి వచ్చిన రిక్షా అంజయ్యలోని మానవీయ విలువలకు 'మానవత్వం' కథ అద్దం పట్టింది. శ్రమైక జీవన సంస్కార వల్ల అలవడే ఉన్నత సంస్కారం కథ ఆద్యంతం పొందు పరిచారు రచయిత్రి కథను నింపాదిగా నడిపిస్తూ సంయమనంతో సందర్భాలను విశ్లేషిస్తూ కథకు సంబంధించిన వాతావరణాన్ని దృశ్యమానం చేస్తూ రచయిత్రి కథలకు జీవం పోశారు. పాత్రలు పాత్రల మనోభావాలు నిజాయితీతో నిబద్ధతతో కదిలి వాస్తవానికి దగ్గరలో ప్రవర్తించడం లాంటి చక్క తీరు నిర్మలారాణిగారిని మంచి కథకుల సరసన నిలబెడుతుంది. అయి రచయిత్రి కొన్ని కథల్లో ఎక్కువగా స్పందించి చొరవ తీసుకుని వివరణ ఇవ్వటం కాస్త కృతకంగా కనిపిస్తుంది. కాని మొత్తం మీద క నిర్వహణలో సమగ్రతకు భంగం రాకుండా మలిచిన తీరువల్ల పాఠకుల వదిలిపెట్టకుండా చదివిస్తాయి. ఆర్థిక సామాజిక అసమానతలు, వి ప్రేమల్ని శాసిస్తున్న ధన సంబంధాలు ఈనాటి సమాజపు తీరుతెన్నుల చూపిస్తూ దీన్ని సంస్కరించడానికి అవసరపడే ఆలోచనల్ని కూడా రచయి తన కథల ద్వారా రేకెత్తించారు. ఎంతెంత దూరం తల్లితండ్రుల తప్పు దృష్టిని వేతెత్తి చూపితే 'కొత్త స్పర్శ' ఎదురు తిరిగిన ఇందిర ఆత్మ నిగ్రహ చూపించింది. 'మూడో అవతారం' మూడు తరాల స్త్రీల మనోభావాల అద్దంపట్టిన మంచి కథ. తన భవిష్యత్తును తానే నిర్ణయించుకునే అవకా ఈనాటి తరానికి ఉండాలని, దానికి పరిపూర్ణమైన సామాజిక అవగాహ స్త్రీకి అవసరమని ఈ కథ చెప్పింది.

ఇంకా ఈ సంకలనంలో కొత్త స్పర్శ, మామూలు కథకా బొమ్మల పెళ్ళిలాంటి ఎన్నో మంచికథలు, సమాజం యొ బొమ్మబొరుసులను చూపించిన అధిగమనం, మలుపులాంటి కథ నిర్మలారాణి పరిశీలనా దృష్టికి ఉదాహరణలుగా నిలుస్తాయి. వాస్త జీవితాలను కథలుగా మలిచే ఆసక్తి ఉన్న రచయితలు పాత్రల వాస్త భాషను వ్యక్తీకరించడానికి ఉపయోగిస్తే బాగుంటుంది. ఈ దిశ నిర్మలారాణిగారు మరింత కృషి చేసి చక్కని కథల్ని ముమ్ముందు ఇం అందిస్తారని ఆశించవచ్చు.

**'గాజుకళ్ళు' కథల సంపుటి. రచన జి. నిర్మలారాణి, వె రు.35/- పేజీలు 98 ప్రతులకు ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీ**



# మట్టిదీపం

బెల్లంకొండ రవికాంత్

పలక మీద పొందికగా రెండక్షరాలు
సాయంత్రానికి అరిగిన బలపంతో
తడబడే అడుగుల క్రింద
నలుగుతున్న ఆశల భవిష్యత్తైన బాల్యం
ఎప్పటికీ చెదరని ఒక అద్భుత స్వప్నం
ఎప్పుడు వస్తాడో తెలియదుగానీ
పువ్వులోకి మధుపం వచ్చినంత సుతిమెత్తగా
మూసిన కళ్ళపై మెలకువలా వాలేవాడు
ఉదయాన్నే కళ్ళతోనే అతడు నవ్వే నవ్వులు
మా దేహాలపై నుంచి రోజులుగా దొర్లిపోయేవి
అక్షరప్రాసన చేసిన ఆ చేతులతో
తనువును స్పర్శిస్తే
మస్తిష్కంలో నిక్షిప్తమైన వర్ణమాల
తొలకరి జల్లుకి మట్టివాసనలా పులకరించేది
తరగతి గదిలో అతడడుగు పెట్టింది మొదలు
ప్నన్నయ్య నుంచి శ్రీశ్రీ దాకా
అరిస్టాటిల్ నుంచి అబ్దుల్‌కలాం దాకా...
ఊపిరి పోసుకున్న పదాలు
పాలుకపై నర్తిస్తుంటే
ఎన్నిమార్లు తాబేళ్ళమై లోలోన రెప్పల చప్పట్లు కొట్టుకునే వాళ్ళమో...!

అతని చుట్టూ మిణుగురుల్లా చేరి
ప్రశ్నల బాణాలు సంధిస్తుంటే
విరామంలేని ఆ జ్ఞాన ఖజానా
పెదవులపై హరివిల్లులా విరిసేది
కవిత్వమంటే కాగితాలపై కురిసే
పదాల చినుకులు కాదని
కలలకూ కాలానికీ దారి చూపించే దిక్సూచీ అని
చీకట్లో దీపమై అతడు మెరిసినప్పుడే కదా...
మేం పుస్తకాల పురుగులమై
రాత్రులకు రాత్రులు
మిత్రులమంతా చర్చలమై కాలిపోయింది
ఎంత ఎదిగినా
ఎన్నిమార్లు అవార్డుల రివార్డులతో
సన్మాన సాయంకాలాలమైనా
జ్ఞాపకం మాత్రం అతని పాదాలవద్దే ఆగిపోతుంది
అతడిని చూస్తే అక్షరాలను చూసినట్టే...!
అతడిని చూస్తే కవిత్వాన్ని చూసినట్టే...!!
అతడిని చూస్తే బాల్యాన్నీ చూసినట్టే....!!!
(అక్షరాలను కవిత్వాన్ని నేర్పిన గురువులందరికీ భక్తితో)

---

# వెన్నెల ప్రశ్న

నవీన్. కె



ఈ మధ్యనే
మా యింటికి
గంటకో, అయిదుసార్లు
ంభీరాలు పల్కి లంచాల తలతీసిన ఠాగోర్ వస్తాడు
కెట్ దేశభక్తి వెదజల్లి
ట్లు మింగిన లగాన్ నాయకుడు వస్తాడు
శోకాకి రాణి వస్తుంది
ఎ.ఆర్.ఎఫ్. టైరైపోయిన
యిర్‌టెల్ సెల్ ఐపోయిన
ంచరీల సచిన్ వస్తాడు
క్క పెప్సీ, కోలాలని బతికించడానికి
ంత మంది ఎన్ని వేషాలేసుకొస్తారు
ే దేశంలో
కొలదీ వెన్నెముకలు
పత్వ గిర్నీలో పిండవుతుంటే
ంతా ఏమయ్యారు?
పిచ్చిగాని

అమ్ముడుపోవటం అలవాటైన వాళ్ళకి
ఆత్మహత్యల మట్టికోసం
కన్నీళ్ళు కార్చేటైమెక్కడిది?
మరయంత్రాలకి మనసెక్కడిది?
నియాన్ కాంతులకి
చీకటిని ప్రశ్నించే
వెన్నెల వెలుగెక్కడిది?

ముక్తవరం పార్థసారథి

చైనీస్ మూలం : రౌ షి
Rou Shi

# పాలదాయి



**రాత్రి ఎముకలు కొరికే చలి. శీతగాలి వీస్తున్నది. మూడు రోజుల పసికందును ఒళ్ళో పెట్టుకుని బాలింతరాలు దీనంగా వెనక్కువాలి కూర్చున్నది. చిరుగుపాతలకు వణుకు ఆగటం లేదు. నిస్సహాయంగా, కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నదా తల్లి.**

"నేను చెప్పినట్టే చెయ్యి, మరేమీ తోచటం లేదు" అన్నది భర్తతో

బుల్లిబుల్లి చేతుల్తో కళ్ళు నులుముకుంటూ చిన్నారి తండ్రి తనవైపే చూస్తున్నాడు. మనసును రాయి చేసుకోవటం ఎలా?

"త్వరగా తీసికెళ్ళు. చాలా దూరం నడవాలి" అంటో ప్రాధేయపడింది. కాని పాలుతాగుతున్న పసివాణ్ణి యివ్వాలంటే చేతుల్రాలేదు.

"రేపు తీసికెళతానులే, చలిగాలి మంచిది కాదు" అన్నాడతడు.

"ఇప్పుడే తీసికెళ్ళు" అంటో కొడుకును ముద్దు పెట్టుకుంది.

"కాస్త ఆలోచించు"

"ఆలోచించటానికేముంది? తిండి లేక రెండు రోజులాయె. ఇంట్లో పిడికెడు బియ్యం కూడా లేవు. నేను తినకపోతే పిల్లాడికి పాలెక్కణ్ణించి వస్తాయి?

బాధపడి ప్రయోజనమేమిటి, పరిష్కారం చూడాలిగాని.

పిల్లాణ్ణి తీసుకుని యిల్లుదాటాడు.

తల్లి వెక్కివెక్కి ఏడ్చింది.

"గాలితగలనివ్వకు గుడ్డలు కప్పు"

మంచు కురుస్తున్నది.

ఉన్న గుడ్డలన్నీ కప్పి, కొడుకును భుజానేసుకుని ఎనిమిది మైళ్ళు నడిచాడు. మంచు మొహం మీద అట్టలట్టలుగా పేరుకున్నది. అలసి, దారి పక్కన బండ మీద కూర్చున్నాడు. ఎదురుగా కొండ. కురుస్తున్న మంచుతో ఎత్తు పెరిగినట్టుగా ఉన్నది. తుఫానుగాలికి చెట్ల కొమ్మలు విలవిలలాడిపోతున్నాయి. మూడు రోజుల నలుసు. ఎలాగ వీణ్ణి వదిలెయ్యటం! పిల్లల కోసం ఎన్నాళ్ళు కలలు కన్నాడో. ఇప్పుడిలా... చివరి సారిగా ముద్దు పెట్టుకుని... గుడ్డ తొలగించి చూస్తే గుండె జారిపోయింది. కుర్రాడి మొహం నీలంగా మారిపోయింది. ఒళ్ళు చల్లగా వున్నది. ఎప్పుడో ప్రాణం పోయినట్టుంది. గుడ్డల్లో చుట్టడంవల్ల వూపిరాడలేదు కాబోలు.

వీణ్ణి యింటికి తీసికెళితే భార్య తట్టుకోలేదు. అనాథ శరణాలయంలో చేర్పిస్తే మాత్రం బతికేవాడని నమ్మకమేమిటి...సమాధి చెయ్యాలిక.

కొడుకు శవాన్ని నేలమీద పెట్టి బిగ్గరగా ఏడ్చాడు. శోకాలు విని దూరాన పొలాల్లో పని చేసుకుంటున్న రైతు కూలీలు వచ్చారు.

"అన్నా, ఒక చాప యివ్వండి. చాపలో చుట్టి నా బంగారు కొండను పాతిపెడతాను." అంటూ నెత్తి కొట్టుకుని రోదించాడు తండ్రి.

కూలీల్లో చాలా మందికి పుత్రశోకం అనుభవమే.

"పేదవాళ్ళకు పిల్లల్నికనే హక్కు లేదురా బాబూ, ఏడిస్తే పోయిన ప్రాణం వస్తుందా ఏమిటి? ఇంకా వయసు మించి పోలేదు. రోజులు బాగుపడితే మరో కొడుకును కందువుగానిలే" అంటో ఓదార్చారు.

ఇప్పుడే యింటికెళితే భార్య కనుమానం వస్తుంది. సాయంత్రం దాకా యిక్కడే గడపాలి. చలికి గడ్డకట్టుకుపోతున్నాడు. తలదాచుకోవాలన్నా కనుచూపు మేరలో ఒక్క గుడిశె కూడా లేదు.

అర్ధరాత్రికి యిల్లు చేరుకుని కూలబడ్డాడు. భార్యకు ఏడ్చిఏడ్చీ కళ్ళు వుబ్బిపోయాయి.

"పడుకోలేదా?"

"నీ కోసమే ఎదురు చూస్తున్నాను" అన్నది రుద్ధకంఠంతో పలకరిస్తే చాలు, దుఃఖం ఆగటం లేదు యిద్దరికీ.

"వాడు క్షేమమేనా?"

"ఆ క్షేమమే"

"అనాథ శరణాలయం బయటే వదిలావా?"

"అనాథ శరణాలయం బయటే వదిలాను"

"వాళ్ళు చూశారా?"

"చూశారు"

"ఇంకా?"

"ఇంకేమిటి?"

"లోపలికి తీసుకెళ్ళారా? ఇంకేం చూశావు? స్పష్టంగా చెప్పరాదూ"

"అబ్బబ్బ ఊరికే ప్రశ్నల్తో చంపకు" అంటో విసుక్కున్నాడు భర్త.

"హమ్మయ్య. వాళ్ళు జాగ్రత్తగా చూసుకుంటే అంతే చాలు. ఇప్పుడు నా మనసు నిమ్మళంగా వున్నది"

"పడుకో యిక"

"రేపు నేను వెళ్ళొచ్చా?"

"ఎక్కడికి?"

"అనాథ శరణాలయానికి చంటి పిల్లాడికి పాలదాయి కావద్దూ"

"ఎందుకు?"

"మరి వాణ్ణక్కడ వదిలిందెందుకు?"

"నీ పిల్లాడికి పాలివ్వటానికి వాళ్ళు నీకూ జీతమివ్వాలా?"

"ఆ"

"వాళ్ళొప్పుకోవద్దూ"

"పాలిచ్చినందుకు తిండి పెట్టి రూపాయో, అర్థో యివ్వకపోతారా!"

"ఏమో నాకేం తెలుసు"

"మంచులో తడిసినందుకు నీ బుర్ర పాడైంది. ఎందుకివ్వరూ" అంటో కసురుకుంది.

అతడు తలపట్టుకుని ఏడ్చాడు.

"రేపు వెళ్ళకు"

"సర్లే. ఎల్లుండి పోతాను"

❖❖❖

అనాధ శరణాలయంలో డజన్లకొద్దీ పిల్లలున్నారుగాని తన కొడుకు కనిపించలేదు.

"వారం రోజుల పిల్లాడొకడుండాలి"

"లేదు. అందరూ నాలుగు నెలలు పై బడిన వాళ్ళే."

ఆశ్చర్యంగా వుంది. పిల్లాడేమైపోయాడు మరి?

అనాధశరణాలయం సెక్రటరీని అడిగింది.

"రెండు రోజుల క్రితం ఓ పిల్లాణ్ణి మీరు చేర్చుకున్నారా?"

"అయితే ఏమిటి?"

"అబ్బే ఏం లేదు. మా యింటి పక్క అమ్మాయి పిల్లాణ్ణి కని యిక్కడ వదిలేసిందని తెలిసింది"

"మగపిల్లాడే కదూ!"

"అవును ఒక్కసారి చూపిస్తారా? ఆ అమ్మాయి గురించి మీకో ముఖ్యమైన విషయం చెప్పాలి"

సెక్రటరీ వెటకారంగా నువ్వుతూ,

"నీకు మతిస్థిమితం లేనట్టుంది. ఊరికే జోక్ చేశాను. ఆడా, మగా, పిల్లా, జెల్లా ఎవరూ యిక్కడ లేరుగాని పోపో. గెటౌట్" అన్నాడు.

పిల్లాడేడి?

"మొన్ననేనని నీకు బాగా తెలుసా? పదిహేను రోజుల క్రితం ఎవర్నో చేర్చుకున్నట్టుంది. అది సరేగాని, ఆ అమ్మాయి గురించిన అతి ముఖ్యమైన విషయమేమిటో చెప్పు".

"ఇంకెందుకులెండి. ఆ అమ్మాయికి పుట్టిన పిల్లాడు చచ్చిపోయాడేమో మరి!"

తనకు పుట్టిన వాళ్ళు కాకపోతేనేం. పిల్లలెందరో వున్నారు. ఎవరికైనా పాలివ్వవచ్చు.

కొన్నాళ్ళకు భర్త వచ్చాడు.

"మనవాడిక్కడ లేడు" అంది గుసగుసగా

"లేడా, ఏమో, నాకు తెలియదు"

"నీకు తెలియక, ఎవరికి తెలుస్తుంది మరి?"

"చచ్చి పొయ్యాడేమో"

"చేర్చుకున్నట్టుగా వీళ్ళ దగ్గర రికార్డు కూడా లేదు" ఇక దాచలేదు.

"చెప్పు..."

"పేదవాళ్ళకు పిల్లల్ని కనే హక్కు లేదని చెప్పారు. బాధపడకు"

"అంటే?"

"దార్లోనే చచ్చిపోయాడు. కొండ దిగువన పాతిపెట్టాను"

ఆమె గుండెలు బాదుకుంటూ ఏడ్చింది.

అందరూ వీళ్ళను ఎగాదిగా చూశారు.

సెక్రటరీ ఆమె మీద పోలీసు కేసు పెడతానన్నాడు.

"నీ పిల్లాణ్ణి చేర్చి, పాలివ్వటానికి రావాలనుకున్నావన్న మాట. క్రిమినల్స్ చీట్స్."

"మాకు పిల్లల్లేన్సార్. ఉన్న ఒక్కడూ చచ్చిపొయ్యాడు. ఇక్కడ మా పిల్లలెవరో చెప్పండి"

"లేకపోతే మాత్రం? చేర్చాలనుకున్నావా లేదా? పోలీస్‌స్టేషన్‌కు పద."

"ఒక్కణ్ణి కంటే వాడూ మిగలకపాయె. పిల్లల్ని కనటంనేరమా? ఏం చేశామని మమ్మల్ని పోలీసులకు పట్టిస్తార్సార్?" అంటూ కుప్పకూలిన ఆమె ఆక్రందనతో అనాధశరణాలయం ప్రతిధ్వనించింది.



# అతడి సమాధి అన్వేషణలో

**ఆంగ్లమూలం : మీనా అలెగ్జాండర్**

**తెలుగులోకి : కె.బి.ఆర్.**

మీనా అలెగ్జాండర్ కవితలు అంతర్జాతీయస్థాయిలో ప్రత్యేక గుర్తింపు పొందిన సామాజిక చైతన్య స్రవంతులు, ఆమె కవితలు పలు భాషల్లోకి అనువాదమయ్యాయి. 2002లో వెలువడిన ఆమె కవితా సంకలనం "ఇల్లిటరేట్ హార్ట్" ఆ ఏడాది ప్రతిష్టాత్మక 'పెన్' ఓపెన్ బుక్ అవార్డుకు ఎంపికైంది. ఆమె జ్ఞాపకాలు "ఫాల్ట్ లైన్స్" పేరుతో 1993లో ప్రచురితమయ్యాయి. ఈ పుస్తకం 2003లో కొన్ని అదనపు భాగాలతో పునర్ముద్రణకు నోచుకుంది. ఆమె మరో కవితా సంకలనం "రా సిల్క్" ఈ ఏడాది రానుంది. గుజరాత్ మారణకాండ నేపథ్యంలో మీనా రాసిన కవితలు గత ఏడాది 'హిందూ' దినపత్రిక ఆదివారం లిటరరీ రివ్యూ సంచికలో ప్రచురితమయ్యాయి. ఈ కవితలు గుజరాత్‌లో సాగిన దాష్టీకాన్ని, దుర్మార్గాన్ని, రుధిరధారల్ని కళ్ళకు కడతాయి. గుజరాత్ ఘోరకలికి మొన్న ఫిబ్రవరి 28కి రెండేళ్ళు పూర్తయిన సందర్భంగా, 'హిందూ'లో వచ్చిన వాటిలో రెండు కవితలకు స్వేచ్ఛానువాదం.

వలీ గుజరాతీ సమాధి
ఏదీ ఎక్కడా?

బంగరు పత్రం
గాలికి కొట్టుకుపోయింది

అతడి కవితలు ఆక్రోశిస్తున్నాయి
పాదాల కోసం, చేతుల కోసం,
గొంతు కోసం,
మర్మాంగాల కోసం, నోటి కోసం

సూరత్ అతడిని మరచిపోయింది
ఆమె అందాలను అతడు
జాబిలమ్మతో పోల్చి గానం చేశాడు

మరి ఇప్పుడో?

నా చర్మం ఎక్కడ,
నా ఎముకలు ఎక్కడ?
సూరీడు *దగ్ధం* చేసిన
వెన్నెలమ్మను చేరాల్సిన
ఒక శిథిల నగరి
కవిని నేను.

నది చెంతనున్న
రెల్లుదుబ్బులు
ఖడ్గాల వేటుకు
తెగిపడ్డాయి.

ఎర్రబారిన గులాబీ నోరు
నా ధూళితో దుమ్ముకొట్టుకుని

(గమనిక : 17వ శతాబ్దికి చెందిన సుప్రసిద్ధ ముస్లిం కవి వలీ గుజరాతీ (వలీ దక్కనీ పేరుతోనూ ప్రముఖుడు) సమాధిని అహ్మదాబాద్ చీకటి రోజుల్లో హిందూ మతోన్మాదులు ఆనవాలు లేకుండా తుడిచిపెట్టారు. సమాధిని సమూలంగా పెకలించి అక్కడ రోడ్డుపై తారుపూత పూశారు. ఆయన సమాధి కనుమరుగైన చోట స్మారక చిహ్నం కోసం దేశవ్యాప్తంగా సాహితీ గొంతుకలు ఒక్కటై ఎలుగెత్తాయి. సూరత్‌పై వలీ గుజరాతీ రాసిన కవిత అద్భుతమైన అక్షర శిల్పం.)

### "నరోదా-పాటియా"లో

నల్లటి కళ్ళు
కాలిన బాదంకాయల రంగు,
పదునైన ఆయుధంతో చెక్కేసిన మొహం
కొంత దిగువకెళ్ళి చూస్తే
కళ్ళను భీతిల్లజేస్తూ
అడ్డంగా చీరేసిన
పచ్చి పచ్చిగాయం.

ముగ్గురు సాయుధ ముష్కరులు
ఆమె గుండెతో కలిసి
కొట్టుకుంటున్న
ఒక చిన్ని హృదయాన్ని
కర్కశంగా బయటకు తోడేశారు.

రోదనలు ఏమీ
వినిపించలేదు.

ఆలయద్వారంపై
పిచ్చుకలు సైతం
పాటను మింగేశాయి



# పెట్టుబడి సర్పం కాటేసిన సోవియట్ సోషలిజం

*నాజీయిజం ఈ శతాబ్దానికి యిచ్చిన గొప్ప ప్రదానం ప్రచారకళే. గోబెల్స్ దాని కర్త. ఈ కళ ద్వారా సత్యాన్ని అసత్యాలుగా, అసత్యాన్ని సత్యంగా ప్రజలు నమ్మేలా చేయవచ్చు. ఆధునిక సాంకేతిక విజ్ఞానం మూలంగా వచ్చిన రేడియో, టెలివిజన్, శాటిలైట్, వార్తాపత్రిక ఈ నాలుగు సాధనాల. ఈనాడు ఈ రాక్షసశక్తి వున్న సాధనాలు. ప్రభుత్వాల చేతుల్లో నేరుగా గానీ లేక వాటి నిర్మాతలైన ధనిక వర్గాల చేతుల్లోగానీ వున్నాయి. సాధారణ ప్రజలు కేవలం ప్రచార హస్తగత జీవులుగా మార్చి వేయబడ్డారు. ఇవన్నీ రష్యన్ ప్రజల మీద ప్రయోగించబడ్డాయనుకోవచ్చు. సామదానభేద దండోపాయాల్లో మధ్య వున్న రెండు ఉపాయాల్ని అమెరికా చాలా భారీ ఎత్తున వాడి వుంటుంది.*

**గుంటూరు శేషేంద్ర శర్మ**

చరిత్రలో ప్రథమ శ్రామికవర్గ ప్రభుత్వం స్థాపించిన మహానేత లెనిన్ 1924లో మరణించాడు. స్టాలిన్ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ జనరల్ సెక్రటరీ అయ్యాడు. 1936 లెనిన్ రాజ్యాంగ చట్టాన్ని విస్తరించి మరో యు.ఎస్.ఎస్.ఆర్. రాజ్యాంగ చట్టాన్ని ప్రవేశపెట్టాడు. ఆనాడు పాశ్చాత్య దేశాలు పారిశ్రామికంగా సైనిక శక్తిపరంగా అత్యున్నత స్థాయిలో ఉన్నాయి. సోవియట్ యూనియన్‌ను దెబ్బకొట్టే అవకాశం ఉంది. అంతకంటే ముఖ్యమైనది దేశంలో ఆర్థిక స్థితి అతిశీఘ్రంగా పటిష్టం చేయకపోతే. ప్రజాజీవనం అతి దుష్కరం కావడమే కాక కమ్యూనిస్టు సమాజ స్థాపన సుదూర స్వప్నమయిపోతుంది. కనక స్టాలిన్ మీద ఒక మహత్తర చరిత్రాత్మక బాధ్యత ఏర్పడింది. ఆనాటి సోవియట్ యూనియన్‌లో ఉన్న 15 రిపబ్లిక్కులు యూనియన్ నుంచి ఎప్పుడయినా విడిపోయే హక్కు రాజ్యాంగ చట్టంలో ఉంది. ఆనాటి సోవియట్ అధ్యాయంలో ఇది ఒక బ్రహ్మాండమైన విషయం అని గుర్తించాలి. రాజకీయ అధికార చెలాయింపులో అగ్రనేతల్లో వచ్చే వైషమ్యాలు దేశాల్ని చీలుస్తాయి. రాజ్యాంగ చట్టంలో 72వ నిబంధన మూలంగా ఇవ్వబడిన ఈ విడిపోయే హక్కు యూనియన్లో ఉన్న విచ్ఛిన్నకర శక్తుల్లో ఒక నిరంతర ప్రేరేపక వాంఛను బీజప్రాయంగా వేసి పెట్టింది. కానీ నిన్న మొన్నటి వరకూ అలా విడిపోయే శక్తులు తల ఎత్తలేదు. కారణం, సోవియట్ యూనియన్లో అన్ని రిపబ్లిక్కుల ప్రజల్లోనూ కమ్యూనిజం మీద అకుంఠిత విశ్వాసం ఉండడం, తాను నిర్మించిన అపూర్వ ప్రక్రియ అయిన పంచవర్ష ప్రణాళికల ద్వారా 10 సంవత్సరాల్లో స్టాలిన్ సోవియట్ యూనియన్‌ను పారిశ్రామికంగా, సైనికంగా పాశ్చాత్య రాజ్యాలతో సంపూర్ణంగా సమాన స్థాయికి తీసుకురావడం, సోవియట్ ప్రజలు ఎప్పుడూ ఎరగని అత్యున్నత జీవన స్థాయిని అనుభవించడం, హిట్లర్ నాజీయిజాన్ని ఘోరపరాజయానికి గురి చేయడం, ఇత్యాది అద్వితీయ ఐతిహాసిక విజయాల మూలంగానూ సోవియట్ యూనియన్లో రిపబ్లిక్కుల ప్రజలు ఉన్నత అంతర్జాతీయ హోదాను అనుభవించడం చేతా రిపబ్లిక్కులు విడిపోయే సమస్యే రాలేదు. స్టాలిన్ విజయాల్ని పేర్కొంటూ చివరకు బ్రిటిష్ చరిత్రకారుడు డెరెక్ ఫుడ్ ఇలా అన్నాడు "1939 కల్లా స్టాలిన్ ఒక దేశంలో సోషలిజం నిర్మించడమనే తన లక్ష్యాన్ని చాలా వరకు సాధించారు. రష్యన్ ఆర్థిక వ్యవస్థ, సమాజం రూపురేఖలు పూర్తిగా మార్చివేయబడ్డాయి.

వాస్తవంగా చూస్తే 1936 సోవియట్ రాజ్యాంగ చట్టం కూడా ఫెడరల్ కాన్‌స్టిట్యూషన్ కాదు, ఇప్పుడు కూడా కాదు (1977) ఫెడరేషన్‌లో భాగాలకు విడిపోయే హక్కులేదు. సార్వభౌమత్వంలేదు. కానీ సోవియట్ రాజ్యాంగ చట్టంలో అన్ని రిపబ్లిక్కులకూ విడిపోయే హక్కు ఉంది. సార్వభౌమత్వం ఉంది. ప్రతి రిపబ్లిక్కుకు ఒక జెండా, ఒక జాతీయ గీతమూ, ఒక ప్రత్యేక రాజ్యాంగ చట్టమూ, మాస్కోలో ఒక దౌత్య కార్యాలయమూ, ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం పొందే హక్కు, (జైలో రష్యా, ఉక్రయిన్ స్టాలిన్ కాలం నుంచీ ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం కలిగి ఉన్నాయి), విదేశీ వ్యవహారాలు నిర్వహించే హక్కూ ఉన్నాయి. రాజకీయ శాస్త్ర రీత్యా ఫెడరేషన్ అనరు. కాన్‌ఫెడరేషన్ అంటారు. ఇలాంటి చిత్రమైన "కప్పల తక్కెడ" లాంటి సోవియట్ యూనియన్ని ఏకతాటి మీద నడపడం ఎంత కష్టమైనా వహించాలి. అలాంటి అద్వితీయ చరిత్రాత్మక దక్షత స్టాలిన్‌ది. హిట్లర్ని పరాజితుడ్ని చేసింది సోవియట్ యూనియన్, అమెరికా పెర్ల్ హార్బర్ల్ పేల్చిన ఆటంబాంబు కాదు అన్న సంగతి తెలుసుకుంటే ఎంత తప్పుడు చరిత్ర రాయబడిందో ఆశ్చర్యం కలుగుతుంది. జపాన్ తెల్లజెండా ఎత్తిన తరువాత ఆటంబాంబు పేల్చారు. అమెరికా తరతరాల జపాను పౌరుల్ని హత్య చేసింది. రష్యా విజయాలన్నిటినీ స్టాలిన్ నడిపాడు. ఇదంతా స్టాలిన్ ఏకైక రాజకీయ ప్రతిభ, మార్క్సిజం మీద ఆయనకున్న అచంచల విశ్వాసం, ఒక దేశాన్ని ఒక నూతన అపూర్వసమాజాన్ని నిర్మించడానికి కావలసిన ద్రష్టత్వము మూలాన్నే సాధ్యమయింది. స్టాలిన్ పాత్ర చరిత్రలో క్యాపిటలిస్టు రాజ్యాల కుతంత్రపూరిత దుర్వ్యాఖ్యల మూలంగా వక్రీకరింపబడడం న్యాయరహిత చర్య.

అత్యంత విమర్శనాత్మక దృష్టితో పరిశీలిస్తూ సోవియట్ విప్లవాన్ని గురించి రాసిన బ్రిటిష్ చరిత్రకారుడు డెరెక్‌ఫుడ్ స్టాలిన్ సాధించిన విజయాల్ని గురించి ఇలా అన్నాడు. "చాలా తేలిగ్గా చెప్పాలంటే తన స్వంత శక్తి సామర్థ్యాలతో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలను ఎదుర్కొనేందుకు సోవియట్ చేసిన ప్రయత్నమిది." ఆ కాలంలో సోవియట్ ప్రజలు ఉన్నత జీవన స్థాయి అనుభవించారంటూ ఆయన అంటాడు. "పారిశ్రామికాభివృద్ధి రంగంలో పంచవర్ష ప్రణాళిక విజయాలు దిగ్భ్రాంతిగొల్పుతాయి. రష్యన్ ప్రజలు అంత ఉన్నత స్థాయి జీవన ప్రమాణాలు ఎన్నడూ అనుభవించలేదనడం నిర్వివాదాంశం. ఆయన

49

అన్న మాటలు గుర్తించదగినవి. "పారిశ్రామికంగా వెనుకబడిన స్థితి నుంచి కేవలం దశాబ్దకాలంలో బయటి దేశాల సహాయం లేకుండా అత్యంత ముఖ్యమైన ప్రపంచ శక్తిగా మార్చివేయబడింది."

మన దేశం మనకిచ్చిన మహామేధావుల్లో ఒకడైన జవహర్‌లాల్ నెహ్రూ తన చరిత్ర గ్రంథంలో స్టాలిన్ విజయాల్ని ప్రశంసిస్తూ ఇలా అన్నారు. "పంచవర్ష ప్రణాళిక రష్యా రూపురేఖలను పూర్తిగా మార్చివేసింది ఒక భూస్వామ్యదేశంగా వున్నది అకస్మాత్తుగా అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశంగా రూపొందింది. సాంస్కృతిక రంగంలో గొప్ప అభివృద్ధి జరిగింది. అక్కడ సమాజసేవ, సామాజిక ఆరోగ్య పరిరక్షణ, ప్రమాద బీమా వంటి సదుపాయాలు ప్రపంచంలోనే అత్యంత విస్తృతమైనవి. ఉపయోగకరమైనవి. ఇతర దేశాల కార్మికులపై గల ఆకలి, కష్టాలు, నిరుద్యోగం వంటి ఎగిరిపోయాయి. ప్రజలలో ఆర్థికభద్రత గురించిన కొత్త భావన ఏర్పడింది."

సోవియట్ యూనియన్ మానవ జాతి ప్రతి దేశంలో సాధించవలసి ఆదర్శం అనడానికి ఇంత కంటే ప్రామాణిక వాక్యాలు అక్కరలేదు. మహానేత స్టాలిన్ ఈ లక్ష్యం కోసం సృష్టించిన అపూర్వ సాధనం 'పంచవర్ష ప్రణాళిక' రష్యన్‌లో దాన్ని 'పియాటిలేట్కా' అంటారు.

సోవియట్ యూనియన్ మహానైతికశక్తిగా నిలబడిన తర్వాత ప్రపంచ రాజకీయాల్లో చరిత్రాత్మకమైన మార్పులు వచ్చాయి. తత్పూర్వం అమెరికా, బ్రిటన్‌లాంటి బలశాలి దేశాలు ఆసియా, ఆఫ్రికా దేశాల్ని కొల్లగొట్టేవి, బానిస దేశాలుగా చూసేవి. ఇప్పుడు సోవియట్ యూనియన్‌ను చూసి బెదిరి అలాంటి దుష్కార్యాలు చెయ్యలేకపోయారు. డేరిక్‌పుడ్ ఇలా రాశాడు. "మన ఆధునిక యుగంలోని రెండు మహత్తర దేశాలలో ఒకటిగా సోవియట్ యూనియన్ నిలబడింది. (రెండవది అమెరికా) ఇతర దేశాలు కూడా అణు ఆయుధాలు చేసినప్పటికి, సోవియట్, అమెరికాలు ఇంకా ప్రధాన అణ్వాయుధాలలో దాదాపు గుత్తాధిపత్యం కలిగి వున్నాయి. ఈ రెండు దేశాల సైనిక, ఆర్థిక పాటవం విలువ ఎంత గొప్పదంటే రెండవ ప్రపంచ యుద్ధ పరిసమాప్తి తర్వాత అంతర్జాతీయ సంబంధాల స్వరూపమే మారిపోయింది." సోవియట్ విప్లవ ప్రతిధ్వనులు దశదిశల వ్యాపించి సోవియట్ శక్తి ప్రభావం మూలంగా, కలోనియలిజం నుంచి ముక్తి పొందిన ఆసియా, ఆఫ్రికా ఖండాల దేశాలకు క్యాపిటలిస్టు రాజ్యాల బెదిరింపులు, ఒత్తిళ్ళకు లొంగకుండా స్వతంత్ర పంథాలో నడిచే ధైర్యం వచ్చింది. అలీన రాజ్యాల ఉద్యమం ఈ కారణంగానే ప్రపంచ వ్యాప్తంగా ఘనవిజయం సాధించింది. అనేక కమ్యూనిస్టు రాజ్యాలు ప్రపంచంలో అవతరించాయి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ దేశాలన్నీ శాంతి కోసం మహత్తర ఉద్యమం నిర్వహించేలా ఒక భూగోళవ్యాప్త ఆందోళన సోవియట్ యూనియన్ ప్రారంభించింది. దాని ప్రభావం క్యాపిటలిస్టు రాజ్యాల్ని భయభ్రాంతుల్ని చేసింది. సోవియట్ విప్లవం మూలంగా ఆ రోజుల్లోనే తూర్పు ఐరోపా రాజ్యాల్లో కమ్యూనిస్టు ప్రభావం వ్యాపించింది. రెండవ ప్రపంచ సంగ్రామం ఉత్తరార్థంలో ఆ రాజ్యాల్లో విక్రమించిన కమ్యూనిజానికి స్టాలిన్ సోవియట్ సైన్యాలు అండగా నిలిచాయి. ఫలితంగా ఆ దేశాల్లో ఉన్న క్యాపిటలిస్టు రాజ్యాలన్నీ కూలిపోయాయి. కమ్యూనిస్టు రాజ్యాలు వచ్చాయి. సోవియట్ యూనియన్‌కూ పశ్చిమ ఐరోపా క్యాపిటలిస్టు రాజ్యాలకూ మధ్య బలిష్టమైన కోటగోడలా నిలిచాయి. ఇలా ఎన్నో గొప్ప మార్పులు వచ్చాయి. ప్రపంచ రాజకీయాల్లో అయితే కుహనా ప్రజాస్వామ్యవాదులు సోవియట్ యూనియన్‌ది నిరంకుశత్వ రాజ్యాంగం, దాని రాజ్యాంగ చట్టం 6వ నిబంధన ప్రకారం కమ్యూనిస్టు పార్టీయే దేశాన్ని నడుపుతుందని నిర్దేశించబడి ఉంది. అన్య పార్టీలు నిషేధించబడ్డాయి. కనక అక్కడ మానవ స్వాతంత్ర్యం లేదు. "మనిషి జీవించడానికి కేవలం తిండి మాత్రమే చాలదు." అంటూ ఊకదంపుడు ఉపన్యాసాలు చెబుతారు. కానీ వాళ్ళు రష్యాది శ్రామికవర్గ ప్రభుత్వం అన్నమాట మర్చిపోతారు. అనేక పార్టీలు వుండటమంటే శ్రామికవర్గ విరుద్ధ పార్టీలు కూడా ఉండాలి అన్నట్లే. ఇంత రక్తపాతంతో శ్రామికవర్గ ప్రభుత్వాన్ని సాధించడం, మళ్ళీ దాన్ని క్యాపిటలిస్టు వర్గం చేతుల్లోకి పోనిచ్చే అవకాశం కల్పించడానికేనా? ఎంత హాస్యాస్పదం! అదే ప్రజాస్వామ్య వాదంలో ఉన్న గొప్ప ధూర్తత. మెక్స్‌బెలాఫ్ అనే రాజకీయ శాస్త్రవేత్త ఈ విషయాన్ని చర్చిస్తూ తన "లా అండ్ గవర్నమెంట్ ఇన్ యు.ఎస్.ఎస్.ఆర్." అనే వ్యాసంలో ఇలా రాశాడు: "రాజ్యాంగ ముసాయిదా ప్రకటించిన తర్వాత, దాన్ని చట్టంగా తుదిరూపం ఇవ్వడానికి ముందు 1936 మార్చిలో ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో స్టాలిన్ మాట్లాడుతూ ఒకపార్టకి ప్రతిగా మరో పార్టీ ఉనికిలో లేదని చెప్పారు. అనేక వర్గాలు లేవు కనుక అనేక పార్టీలు వుండజాలవని, పార్టీ కూడా వర్గంలో భాగమని అన్నారు." బహుళపక్ష రాజకీయాలనే దుర్నినాదానికి ఇది ఒక్కటే వజ్రాయుధం లాంటి శాస్త్రీయ సమాధానం.

**కుతంత్ర వలయం**

దేశంలో ప్రజలు ఆర్థిక క్లేశం అనుభవిస్తున్నారనీ, రాజకీయంగా ప్రభుత్వ యంత్రాంగ భారం కింద వ్యక్తి నలిగిపోతున్నడనీ కారణం చెప్పి, ప్రజలు రక్తం ధారబోసి నిర్మించిన వ్యవస్థను విధ్వంసం చెయ్యడానికి ప్రజాహితాభిలాషి అయినవాడు ఎవ్వడూ పూనుకోడు. పొరపాట్లు సరిదిద్దాలి, సమస్యలుంటే పరిష్కరించాలి. సోవియట్ యూనియన్‌లోనే కాదు, ప్రపంచంలో రెండు మూడు తప్పిస్తే అన్ని దేశాల్లోనూ సోవియట్ యూనియన్‌లో వున్నాయనే సమస్యలూ, క్లేశాలు అన్నీ వున్నాయి. ఈనాడు మూడే ప్రపంచ అగ్రశక్తులున్నాయి. ఒకటి అమెరికా (యునైటెడ్ స్టేట్స్), రెండు జర్మనీ (యూరోపియన్ కమ్యూనిటీ), మూడు జపాను. ఈ మూడు ప్రపంచంలో పేదరికంతో, సాంకేతిక విజ్ఞానరీత్యా వెనుకబడిన తనంతో అలమటిస్తున్న అనేక మూడో ప్రపంచ దేశాల్ని తమ మార్కెట్లుగా, సేవకులుగా చేసుకుని అగ్రత్వ హోదా అనుభవిస్తున్నాయి. వీటి మధ్య మార్కెట్ల విషయంలో కీచులాట రాకతప్పదు. అదే మార్కెట్ విధాన లక్షణం. కనక ఎప్పుడో ఒకప్పుడు అమెరికా ఆధిపత్యం పోకనూ తప్పదు. అమెరికాలో విదేశాల పెట్టుబడులకంటే విదేశాల్లో అమెరికా పెట్టుబడులు అధికమయ్యాయి.


............ ★ ............

***ఈనాడు మూడే ప్రపంచ అగ్రశక్తులున్నాయి. ఒకటి అమెరికా (యునైటెడ్ స్టేట్స్), రెండు జర్మనీ (యూరోపియన్ కమ్యూనిటీ), మూడు జపాను. ఈ మూడు ప్రపంచంలో పేదరికంతో, సాంకేతిక విజ్ఞానరీత్యా వెనుకబడిన తనంతో అలమటిస్తున్న అనేక మూడో ప్రపంచ దేశాల్ని తమ మార్కెట్లుగా, సేవకులుగా చేసుకుని అగ్రత్వ హోదా అనుభవిస్తున్నాయి. వీటి మధ్య మార్కెట్ల విషయంలో కీచులాట రాకతప్పదు. అదే మార్కెట్ విధాన లక్షణం. కనక ఎప్పుడో ఒకప్పుడు అమెరికా ఆధిపత్యం పోకనూ తప్పదు.***

............ ★ ............

1990 వచ్చేసరికి అమెరికా వ్యాపారలోటు 101 బిలియన్ల డాలర్లని ఆర్థిక పరిశీలకుల అంచనా. ఆసియా, ఆఫ్రికా దేశాల్లో లాటిన్ దేశాల్లో వున్న పేదరికమూ, వ్యక్తిగత రాజకీయ బానినత్వాలతో పోలిస్తే సోవియట్ యూనియన్ పరిస్థితిలో యింత పెద్ద ఘోరహత్య చెయ్యవలసిన అనివార్యత ఏమీలేదు. ఈ హత్యానంతరం ముక్కలు ముక్కలుగా పడి వున్న మాజీ సోవియట్ రిపబ్లిక్కులు మూడో ప్రపంచ దేశాలతో కలిసి వెనక చెప్పిన మూడు అగ్రశక్తుల మార్కెట్ల వేటకు బలైపోతాయి.

............. ☆ .............

***సోవియట్ యూనియన్ పోయింది. సోవియట్ కమ్యూనిజం పోయింది. కానీ ఏడు తరాల్నించి సోవియట్ ప్రజల్ని ప్రభావితం చేసిన మరణంలేని అగ్నిలాంటి ఆ భావజాలం బాలబాలికల్లో, యువకుల్లో, వృద్ధుల్లో రక్త ప్రవాహాల్లో రగులుకుంటూనే వుంటుంది. రక్త ప్రవాహాల్లో వున్న అగ్నిని రాజకీయాలు ఆర్పగలవా!***

............. ☆ .............

ప్రథమ కమ్యూనిస్టు సమాజ శిశువు జన్మ ఎత్తగానే దాన్ని హత్య చేయడానికి ఎలా క్యాపిటలిస్టు రాజ్యాలు ఆనాడు విప్లవ సంవత్సరంలోనే (1917) అంతర్యుద్ధం లేవదీశాయో, అలాంటి అంతర్యుద్ధాన్నే 74 ఏళ్ళ తర్వాత మరింత చాకచక్యంతో మరింత భారీ ఎత్తున దృశ్యాదృశ్య నిగూఢ చర్యలతో అవే కాపిటలిస్టు రాజ్యాలు లేవదీశాయి. ఇప్పుడు క్యాపిటలిస్టు దేశాల ఏకైక నాయకత్వం అమెరికాదే. రెండవ ప్రపంచ యుద్ధం సమాప్తమైన నాటి నుంచే ఈనాడు మనం చూస్తున్న సోవియట్ యూనియన్‌ను శిథిలావస్థకు తీసుకురావడానికి అమెరికా భూగోళం చుట్టూ వలపన్ని తీవ్రకృషి చేస్తూ వచ్చింది. కారణం రెండవ ప్రపంచ యుద్ధానంతరం సోవియట్ యూనియన్‌ను చూచి బెదిరిపోయిన క్యాపిటలిస్టు రాజ్యాల్లో అమెరికా అగ్రగణ్యం. కనుకనే మరుక్షణమే బిలియన్లు, ట్రిలియన్లు డాలర్లు వెదజల్లి నాటా, సెంటో, సీటా అనే యుద్ధ కూటముల్ని సోవియట్ యూనియన్ చుట్టూ ఏర్పాటు చేసింది. మార్షల్ ఎయిడెడ్ ప్లాన్, కొలంబో ప్లాన్ ఇత్యాది అనేక ప్లాన్లు పన్నింది. కెన్యా, ఓమాన్, సోమాలియా, డిగోగార్షియా ఇత్యాది అనేక స్థలాల్లో నౌకాదళ స్థావరాలు ఏర్పాటు చేసింది. యూరప్‌లోనే అనేక సైన్య స్థావరాలు నెలకొల్పింది. చివరకు ఇంగ్లండులో కూడా అమెరికన్ అణుబాంబు స్థావరం వుంది. యూరప్‌లో అమెరికన్ సైన్యాలు, అమెరికన్ గూఢచారులు నిరంతర భ్రమణం చేస్తున్నారు. ఎందరో ఎన్ని రూపాలతోనో సోవియట్ యూనియన్‌లోకి చొచ్చుకుని పోయి ప్రజల్లో ఎల్ట్సిన్‌లాంటి నాయకుల్లో మెరిసే వస్తువుల్ని లోభం కలిగించే భావాల్నీ ప్రచారం చేశారు. నాజీయిజం ఈ శతాబ్దానికి యిచ్చిన గొప్ప ప్రదానం ప్రచారకళే. గోబెల్స్ దాని కర్త. ఈ కళ ద్వారా సత్యాన్ని అసత్యాలుగా, అసత్యాన్ని సత్యంగా ప్రజలు నమ్మేలా చేయవచ్చు. ఆధునిక సాంకేతిక విజ్ఞానం మూలంగా వచ్చిన రేడియో, టెలివిజన్, శాట్‌లైట్, వార్తాపత్రిక ఈ నాలుగు సాధనాల. ఈనాడు ఈ రాక్షసశక్తి వున్న సాధనాలు. ప్రభుత్వాల చేతుల్లో నేరుగా గానీ లేక వాటి నిర్మాతలైన ధనిక వర్గాల చేతుల్లోగానీ వున్నాయి. సాధారణ ప్రజలు కేవలం ప్రచార హస్తగత జీవులుగా మార్చి వేయబడ్డారు. ఇవన్నీ రష్యన్ ప్రజల మీద ప్రయోగించబడ్డాయనుకోవచ్చు. సామదానభేద దండోపాయాల్లో మధ్య వున్న రెండు ఉపాయాల్ని అమెరికా చాలా భారీ ఎత్తున వాడి వుంటుంది. లేకపోతే సోవియట్ యూనియన్ ప్రెసిడెంట్ అయినాడు ప్రెసిడెంట్ అవుతూనే సోవియట్ యూనియన్నీ, కమ్యూనిజాన్ని ధ్వంసం చేయడానికి ఒక గొప్ప యుక్తియుక్తమైన, నగ్నంగా అర్థంకాని ప్లాను వేసుకుని బయలుదేరాడంటే దాన్ని ఏ విధంగా వ్యాఖ్యానించాలి. గోర్బచెవ్ కార్యక్రమానికంతటికీ యిది ఒక్కటే లక్ష్యం. అసలు గ్లాస్‌నోస్త్, పెరిస్త్రోయికాలు టైం బాంబుల్లాంటివి. వీటిని ప్రారంభించడం చేతనే గోర్బచెవ్‌ని శంకించవలసి వస్తోంది.

ఎంతో కాలం నుంచీ రూపొందించిన విస్తార కుతంత్ర వలయం యిది. అమెరికా తన శాట్‌లైట్ల ద్వారా సోవియట్ యూనియన్‌లో తాను పన్నిన కుతంత్రాల ప్రగతినీ, అక్కడి తదితర సోవియట్ చర్యల్నీ పరిశీలిస్తుంటారని రుజువు చేసే సామాగ్రి కూడా వుంది. జార్జి జె. చర్చ్ అనే కాలమిస్టు 2-9-91 టైం సంచికలో 'కూ'ను గురించి రాస్తూ యిలా అన్నాడు:

"అత్యంత జయప్రదంగా కుట్రలు జరిపిన వారు కూడా విశ్వసనీయమైన దళాలను కీలకస్థానాలలో తరలించడంతో ప్రారంభిస్తారు. అయితే అమెరికా గూఢచారి శాఖ విశ్లేషణ ప్రకారం సోమవారం ఉదయం ఉపగ్రహం తీసిన చిత్రాలన్నిటిని కుప్పవేసి చూసినా, దళాల అసాధారణ కదలిక సూచనలేవీ కనిపించలేదు."

ఈ కమ్యూనిస్టు వ్యతిరేక తంత్రానికంతటికి అమెరికన్ స్టేట్ డిపార్ట్‌మెంట్ మెదడులాంటి కేంద్ర స్థానం, కొన్ని సంవత్సరాల క్రితం లండన్ పత్రికా రిపోర్టు ఒకటి (జనవరి 30) యిలా వుంది. యూరోపియన్ ప్రభుత్వాల్లో పెరుగుతున్న కమ్యూనిస్టు ప్రభావాన్ని నిరసిస్తూ అమెరికన్ ప్రెసిడెంట్ జిమ్మీ కార్టర్ యిచ్చిన వక్తవ్యాన్ని వెల్లడి చేస్తూ అమెరికన్ స్టేట్ డిపార్ట్‌మెంట్ యిలా ప్రకటించింది. "పశ్చిమ ఐరోపా దేశాల ప్రభుత్వాల్లో కమ్యూనిస్టు ప్రభావం బాగా తగ్గాలని అమెరికా అభిప్రాయం. ఇటలీలో ఏర్పడిన క్లిష్ట పరిస్థితి మీద అమెరికా తీవ్ర ఆందోళన చెందుతోంది. కనక ఐరోపా దేశాలు ప్రజాస్వామ్య సంస్థల్ని పెంపొందించుకుని ప్రజాస్వామ్య పద్ధతుల్లో తమ ప్రజల ఆశల్నీ, ఆశయాల్నీ సఫలీకృతం చేసుకోవాలి." జిమ్మీ కార్టర్ యిచ్చిన ఈ వక్తవ్యం మూలంగా ఐరోపాలో తీవ్రమైన ప్రతి క్రియ వచ్చింది. అన్ని దేశాల వారు అమెరికా తమ దేశాల్లో జోక్యం చేసుకుంటోందని ఖండించారు. అసలు పెరిస్త్రాయికా, గ్లాస్‌నోస్తులే టైంబాంబు ల్లాంటివి. వీటిని ప్రారంభించడం చేతనే గోర్బచెవ్‌ని శంకించవలసి వస్తోంది. లండన్ పత్రిక 'డైలీ మెయిల్'లో రాస్తూ (ఫిబ్రవరి 1990) ఆన్ లెస్లీ అనే కాలమిస్టు "గోర్బచెవ్ ఏమి చేయాలని - పథకం వేసినా, ప్రపంచంలో చివరి సామ్రాజ్యం అంతం కావడం చేరువలో వుంది." అని జోస్యం చెప్పింది. నిజమే గ్లాస్ నోస్త్. పెరిస్త్రోయికాలను 'కీ' యిచ్చి విడిచిపెట్టిన తర్వాత జరగవలసింది జరక్క ఎలా తప్పుతుంది.

సోవియట్ యూనియన్ పోయింది. సోవియట్ కమ్యూనిజం పోయింది. కానీ ఏడు తరాల్నించి సోవియట్ ప్రజల్ని ప్రభావితం చేసిన మరణంలేని అగ్నిలాంటి ఆ భావజాలం బాలబాలికల్లో, యువకుల్లో, వృద్ధుల్లో రక్త ప్రవాహాల్లో రగులుకుంటూనే వుంటుంది. రక్త ప్రవాహాల్లో వున్న అగ్నిని రాజకీయాలు ఆర్పగలవా! లోకంలో యింకా ఎన్నో కమ్యూనిస్టు రాజ్యాలున్నాయి. అందరూ జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రపంచంలో ఎక్కడయితే పేదరికం వుంటుందో, ఎక్కడయితే మానవ అసమానత్వం వుంటుందో అక్కడంతా ఎప్పుడయినా కమ్యూనిజం వుంటుంది.

**(సాహిత్యంలో నోబుల్ బహుమతికి గుంటూరు శేషేంద్ర శర్మ పేరు నామినేట్ చేసిన సందర్భంలో 1991 నాటి ఈ వ్యాసం పునర్ముద్రణ)**

51

❖

సుంకోజు దేవేంద్రాచారి




# నేరం

**తూ**ర్పు కొండల చాటు నుంచి సూర్యుడు మత్తుగా వళ్ళు విరుచుకుంటూ పైకి వస్తున్నాడు. రోడ్ల మీద వాహనాల సందడి ప్రారంభమైయింది. ఐదు గంటలకే నిద్రలేచిన టౌన్ బస్సులు రుయా ఆసుపత్రి దగ్గర యాత్రికుల కోసరం అరుస్తున్నాయి. రుయా ఆసుపత్రి నుంచి ఎన్‌జీవో కాలనీకి వెళ్ళే రోడ్డుకు ఇరువైపులా తురాయి చెట్లు పూలతో కళకళలాడుతున్నాయి.

వాటి కింద రాత్రి రాలిన పూలను పిల్లలు ఏరుకుంటున్నారు. హరేరామ హరేకృష్ణ మండపం వరకు కరువుతో పలు ప్రాంతాల నుంచి వలస వచ్చిన వాళ్ళు చెట్లకిందే కాపురముంటున్నారు. ఆడవాళ్ళంతా పొయ్యిల ముందు కూర్చుని వంటతో కుస్తీ పడుతున్నారు. కొంత మంది మగవాళ్ళు నిద్రలేయను బద్ధకించి పడుకొనే బీడీలు కాలుస్తున్నారు. లేచిన వాళ్ళు కాలకృత్యాలు తీర్చుకోవడానికి పక్కన్నే వున్న లింకు బస్టాండు దగ్గర చెట్లల్లోకి వెళుతున్నారు. అక్కడి నుంచి నోట్లో పుల్లతో వచ్చిన రామయ్య, నోట్లోంచి పుల్లను తీసి వుమ్మిని తుపుక్కున వూశాడు.

"ఏంబ్బీ... రామచంద్రా... యింగా పొడుకొనే వుండావే. పనికొస్తావా రావా" అంటూ పడుకోనున్న రామచంద్రను తట్టాడు రామయ్య.

రామచంద్ర వులికిపాటుగా లేచి కూర్చున్నాడు. "అంతా పనికి ఎలబారినారాన్నా" అంటూ గబగబా లేచాడు.

"హ్వా..హ్వా..హ్వా.. ఈయబ్బికి ఏ మాత్రం సూడీ పనంటే, యింగా సరీగా తెల్లార్నేలే. దినాము మాకన్నా బిరీన లేస్ఫాంటివికదా. అందుకని లేపినా" అన్నాడు రామయ్య నవ్వుతూ.

"అందురూ అట్లాయిట్లా తిరుగులాడుతాంటే పనికి టైమయిపోయిందేమో. యింగెప్పుడురాసామీ మనం గెస్ట్‌లైన్ దగ్గరికి పొయ్యేది అని బిత్తర చుట్టుకున్నది" అన్నాడు. రామచంద్ర అంత వరకు తాను పడుకోనున్న గోతం మీద కూర్చుంటూ.

"ఏమప్పా మళ్ళా కుచ్చొంటాండావు. ఈ రోజు శనివారం కదా. కొంచెం ముందుగాల్నే పోవాల" అన్నాడు స్నానం చేయడం కోసం వెళుతున్న నారాయణప్ప.

"రాత్రంతా చానాసేపు నిద్ర పట్టలేదన్నా. అందుకే పద్దన్నే బిన్నే మెలకువరాలా"

"పెండ్లి మీద కలవరం మళ్ళిందప్పా. మా అనంతపురంలో చుక్క మాదిర్తో వుండాది పాప. చేసుకొంటావేమో చెప్పు. పోదాం" అన్నాడు నారాయణప్ప.

"ఆ... ఈ బతుక్కు అదొాగటే తక్కువ. కరువొచ్చి తిండికి లేక అల్లాడతాంటే పెండ్లి కూడానా"

"ఏందబ్బీ అట్లంటావ్. వారం ముందు నేను పులెందలకు పొయ్యొచ్చింది ఎందుకు? పెండ్లికే. మా వూరి శెట్టి కూతురిది. ఎంతగనంగా చేసినాడో. శెట్టికి లెక్క బాకీ వుండా. పెండ్లికి చెప్పినాడు. పోకుంటే బాగుండదని పొయ్యినా" అన్నాడు రామయ్య.

"పదకమిందనే అరుపులు జేస్తాండారా. పనికి పోరా" అరచింది రామయ్య భార్య బియ్యం వార్చుతూ.

"పొద్దెగబడతాండాది. పనికాడికి నడుసుకోని పోవాలంటే గంటసేపు పడతాది." అంటూ లేచి తను పడుకోనున్న గోతాన్ని తీసి మడత బెట్టాడు. రామచంద్ర. జారిపోతున్న లుంగీని నడుముకు గట్టిగా బిగించుకుని "వస్తావాన్నా..." అన్నాడు రామయ్యనుద్దేశించి. అతని నోట్లో వున్న వేప పుల్లను చూసి "నేను పోయెస్తా" అంటూ చెట్లల్లోకి వెళ్ళాడు. అక్కడి నుంచి వేపపుల్లతో పళ్ళుతోముకుంటూ వచ్చాడు. చెట్టు తమరలో వుండే చేతి సంచిని కిందకు దించాడు. వేసుకోనుండే షర్టును తీసి సంచిలో వుంచి అందులో నుంచి బనియన్‌ను, షర్టును బయటకు తీశాడు. టవల్ తీసుకుని భుజం

52

మీద వేసుకుని తిరుమల లింకు బస్టాండు లోపల వున్న కొళాయి వద్దకు స్నానానికి వెళ్ళాడు.

◇◇◇

ఆ రోడ్డు కిరువైపులా దాదాపు వంద కుటుంబాల జీవనం సాగిస్తున్నాయి. కడప, అనంతపురం, చిత్తూరు జిల్లా నుంచే కాక తమిళనాడు, కర్ణాటక నుంచి వలస వచ్చిన వాళ్ళు వున్నారక్కడ. రకరకాల భాషల్లో మాటలు విన్పిస్తున్నాయి. పనికోసరం ఎక్కువ దూరం పోవాల్సిన వాళ్ళు చేతిలో క్యారేజీ పట్టుకుని, భుజం మీద టవల్ వేసుకుని బయలుదేరేశారు. పనిలేనోళ్ళు, పనికోసరం నాలుగ్గాళ్ళ మండలం పద్దకు అందరికన్నా ముందే వెళ్ళిపోయారు.

రామచంద్ర స్నానం చేసి బట్టలు వేసుకుని తానుంటున్న చెట్టు వద్దకు వచ్చాడు. అప్పటికే అన్నం తిని, మిగిలింది కట్టుకొని పనికి పోవడానికి సిద్ధంగా వున్నారు రామయ్య. నారాయణప్ప దంపతులు.

రామచంద్ర ఆరడుగుల పొడవుంటాడు. చామనచాయ. పొడవుకు తగినంత లావులేకపోయినా బలిష్టంగానే వుంటాడు. వయసు తక్కువే అయినా బాధ్యతలు అతడ్ని ముదురు చేశాయి. నూనూగు మీసాలు ముదరకముందే ముఖంలో లేతదనం మాయమయింది.

"మా తిక్కు వానలు పడి ఆరు సమచ్ఛ రాలయింది"

"మా వూర్లో ఒగ మనిసిగూడా లేరు. అందరం కడుపాత్రంతో దేశం మీద పడినాం"

"మాది హోస్‌పేట దగ్గిర. డ్యాం ఎండిపోయిండాది. అరవై ఏండ్లయితాండాది. ఎప్పుడేగాని డ్యాం ఎండిందిలే. యిప్పుడు తాగేకి గూడా చుక్క నీళ్ళు లేవు."

యిలా రకరకాలుగా సాగుతున్నాయి. వాళ్ళ మాటలు.

"మా వూరితిక్కు కరువు పనులు చేపిచ్చినారు. మనసలం చేసింటే యిట్లా బయట వూర్లకు ఎందుకొచ్చిందుము? అంతా మిసన్లతో చేపిచ్చినారు. మా నోట్లో దుమ్ము కొట్టినారు" అన్నాడు కాసేపటి తర్వాత రామయ్య.

"మీ తిక్కే కాదులేప్పా. మా తిక్కూ అంతే" నారాయణప్ప బదులిచ్చాడు.

"అన్ని వూర్లల్లో అంతేలేన్నా" రామచంద్ర తేల్చేశాడు.

"పని కోసరం యింత దూరమొచ్చే, ఎనకమాల్నే మిసన్లొచ్చె" రామయ్య బాధను వ్యక్తం చేశాడు.

"ఎవురు చేసే పని వోళ్ళు చెయ్యాల్లేప్పా. అయ్యి చేసే పని అయ్యి, మనం చేసే పని మనం" అన్నాడు నారాయణప్ప.

"అయితే వూర్లో వుండి నీ పనే చేసుకోనుండేది. ఇరవై ఎకరాల సేద్దిం వుండాదంటివే. ఈడికొచ్చి ఇటికలు మోస్పొండావే. యాల?" ప్రశ్నించాడు రామయ్య.

"యాడిదప్పా పని. ఈ వారమే కదా సక్రమంగా చేస్తాండేది. ఇంతకు ముందు మూడు వారాలు వారానికి రెండు దినాలు గూడాలే పని" అన్నాడు వక్కాకు నములుతూ నారాయణప్ప.

"ఎందుకు లేదు?"

"ఎందుకేముందన్నా. మనమాదిర్తో వలసవచ్చినోళ్ళు ఎక్కువయినారు. అందుకని పనుల్లేవు" అన్నాడు రామచంద్ర.

"ఈ వూర్లో అదేందో ఎర్త్ వైరంట. ఈదీదికి ఏస్పొండారు. గజంలోతు గాడి తొగాలదానికి. ఆ పనులు అప్పుడు జాస్తిగా వున్నేయి. ఎంత మందున్నే పనుంటాన్నింది"

"యిప్పుడా పనిలేదా" అడిగాడు రామచంద్ర.

"కూలోల్లే చేసింటే సమచ్చరం పట్టిండు. మిసన్లొచ్చినాయి. మనం పదైదుమంది రోజంతా చేసే పని అది గంటకే చేసేస్పొండాది. యిప్పుడంతా వాటితోనే పని చేపిస్పొండారు" వివరించాడు రామయ్య.

అందరూ లీలా మహల్ దగ్గర ఎడమ వైపు తిరిగారు. మంగళం రోడ్డులో నడవసాగారు. రామయ్య పదేండ్ల కూతురు రోడ్డు పక్కనున్న మామిడికాయల బండి దగ్గర ఆగిపోయింది. వాళ్ళమ్మ ఆ అమ్మాయి చేతిని పట్టుకుని బలవంతంగా లాక్కు పోయింది.

"టిఫను తినేసివస్తాన్నా. మీరు పొండి" అని టిఫను బండి వద్ద ఆగిపోయాడు రామచంద్ర.

వాళ్ళంతా మాట్లాడుకొంటూ వెళ్ళసాగారు.

రామచంద్ర గబగబా ఐదు రూపాయలకు ఇడ్లీలు తిన్నాడు. ముందు వెళుతున్న వాళ్ళందరినీ కలుసుకోవడానికి వడివడిగా అడుగులు వేయసాగాడు. వాళ్ళు పని చేస్తున్న బిల్డింగు వద్దకు చేరేప్పటికి తనూ చేరుకున్నాడు. అప్పటికే మేస్త్రీ సిద్ధంగా వున్నాడు.

◇◇◇

"ఏమయ్యా, శనివారం పూట గూడా తీరుబాటుగా వస్తారా. ఈ రోజు పేమెంట్ ఇస్తాండ్లా. గంట ముందుగా వచ్చి గంట లేటుగా పనెత్తినామంటే యింటిగలోళ్ళకు సంతోషం. పెండింగ్ పెట్టకుండా మన కూలీలు పారేస్తారు" అన్నాడు మేస్త్రీ.

"రోజూ కన్నా ముందే వచ్చినామప్పా" అన్నాడు నారాయణప్ప.

"సరే... సరే... పొండి. పనిలో దిగండి" అన్నాడు నారాయణప్ప భార్యవైపు వెకిలిగా చూస్తూ.

ఆడవాళ్ళు యిసుక జల్లించడానికి పూనుకున్నారు. మగవాళ్ళు కొందరు జల్లించిన యిసుకను తీసుకుని పై అంతస్తులో వేయసాగారు. కొందరు తట్టల్లో యిటుకలు తీసుకుపోయి బిల్డింగ్ వెనుక వేస్తున్నారు.

రామచంద్ర కాసేపు నిల్చుని తాము పని చేస్తున్న బిల్డింగును పరిశీలనగా చూశాడు. యింతింత పెద్ద బిల్డింగులు కట్టడానికి వీళ్ళకు డబ్బు ఎక్కడి నుండి వస్తా వుంది అనుకొన్నాడు.

"పద్దన్నే వస్తానే నిల్చుకొన్నేవే... యిట్లయితే మేము గుడిసె పోవాల్సిందే. కానీ పని" అన్నాడు మేస్త్రీ.

రామచంద్రకు కోపం వచ్చింది. అక్కడ పని చేసే వాళ్ళెవరూ తనంత పని చెయ్యరు. రోజులు తమవి కావు అనుకొని మౌనంగా పనిలో మునిగిపోయాడు. తాపీ మేస్త్రీలు గంట తర్వాత వచ్చారు. ప్రహరీగోడ పని ఒకవైపు, లోపల గోడలకు పూత పని మరోవైపు జరుగుతోంది. ఒకసారి యింటి ఓనర్స్ వచ్చి వెళ్ళారు. మధ్యాహ్నం ఒకటిన్నరకు పనులాపి అందరూ కిందకు చేరారు. అన్నం తెచ్చుకోనుండే వాళ్ళకు వక్కాక్కు బీడీలకని పది రూపాయలు, అన్నం తెచ్చుకోనోళ్ళకు ఇరవై ఐదు రూపాయలు యిచ్చాడు మేస్త్రీ.

"అందరికీ యిచ్చినా కదా... పైన ఎవరన్నా వుండారా?"

"ఎవురూ లేరన్నా. అందరం ఈన్నే వుండాము" అన్నాడొకతను.

"బిందెతో నీళ్ళు పైకితే" అవి నారాయణప్ప భార్యకు ప

పురమాయించి పైకి వెళ్ళాడు మేస్త్రి.

భర్తముఖంలోకి చూసిందామె. నారాయణప్ప భార్య ముఖంలోకి చూడకుండా తల దించుకున్నాడు. డ్రమ్ములో వున్న నీళ్ళు బిందెతో ముంచుకుని ఆమె పైకి వెళ్ళింది. రామచంద్ర దగ్గర్లో వున్న రోడ్డు వద్దకు వెళ్ళాడు. చెట్టు కిందున్న బండి వద్దకు పోయి నాలుగు ముద్దల సంగటి తిన్నాడు. పది రూపాయలు యిచ్చి, బిల్డింగ్ వద్దకు వచ్చాడు. అందరూ తినేసి కింద యిసుకలో కూర్చొని వున్నారు. కొందు బీడీలు వెలిగించారు. మరికొందరు వక్కాకు నములుత్తున్నారు. ఒకతను వెల్లకిలా పడుకొని గురక పెడుతున్నాడు.

"మీ వూరోడు పోయినోడు పోయినట్టే వుండాడే. రానేలేదే?" అడిగాడు రామయ్య

"నేను గూడా వానికోసరం ఎదురు చూస్తాండా. యింట్లో అమ్మానాయన ఎట్లుండారో ఏమో. మా చెల్లెలు ఈసారి పది. బడికి అంపతాండారో లేదో. నేనేమో చెప్పంపినా బాగా చదివించమని" అన్నాడు రామచంద్ర.

"చదవనీకి లెక్క కావద్దేమప్పా. కరువుతో తిండిగింజలు లేక చస్తాంటే చదువేడ"

"మీ వోళ్ళనందరినీ పిల్సకచ్చింటేబ్బీ" సలహాయిచ్చాడు రామయ్య.

"పిల్సకస్తే యిబ్బందవుతాదన్నా. అమ్మానాయన పని చెయ్యలేరు. చెల్లెల్ని పనికి తీసకరావడం నాకిష్టంలేదు. నా ఒగని సంపాదనతో అంత మంది బతకాలంటే అవతాదా? నేను ఒగన్నే అయితే చెట్టుకింద వుండి పోతాండా. అందరం చెట్టుకింద వుండే దానికి అవతాదా?"



"నిజమేలేప్పా... ఏం జేస్తాం రాత బాగలేనప్పుడు. సహదేవుడట్లాలోడు. గాడిద కాళ్ళు పట్టుకొన్నేడంట. మనమెంత" అన్నాడు వైరాగ్య ధోరణిలో కూర్చున్న తాపీమేస్త్రీలలో ఒకతను.

"యిట్లయితే నేను బాగుపడినట్టే. తొందరగా పనిలో దిగండి" అంటూ హడావిడి చేస్తూ వచ్చాడు మేస్త్రి.

అందరూ గబగబా లేచారు. తాము చేస్తూ వదలిపెట్టిన పనులను తిరిగి ప్రారంభించారు. పని చేస్తున్నాడే కానీ రామచంద్రకు మనసు మనసులో లేదు. అతను తిరుపతికి వచ్చి నెలవుతా వుంది. మొదటి వారం సంపాదించింది తిండికే చాల్లేదు. మిగతా రెండు వారాలకుగాను మూడు వందలు మిగిలింది. తనతోపాటు వచ్చి పని చేస్తా వుండిన రమణ వూరు వెళ్తుంటే ఆ డబ్బు యిచ్చి పంపాడు. అతనొస్తాడు. యింట్లో వాళ్ళ క్షేమసమాచారాలు చెప్తాడు అని రోజూ ఎదురుచూస్తూనే వున్నాడు రామచంద్ర. కానీ రమణ రాలేదు. సాయంత్రం వారం రోజుల కూలిడబ్బు తీసుకుని వూరికి పోవాలనుకున్నారు.

"సాయంత్రం గంటసేపు లేటవుతాది. ఈన్నే వుండండి. వచ్చి పేమెంట్‌లు యిస్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడు మేస్త్రీ.

మేస్త్రీ లేకపోవడంతో అందరూ మాటలు చెప్పుకుంటూ హుషారుగా పని చేయసాగారు. సాయంత్రం ఆరయింది. శనివారం డబ్బు యిస్తారు కదా అని మరో గంటసేపు అదనంగా పని చేశారంతా. ఏడు గంటలకు పని నిలిపి కాళ్ళు చేతులు కడుక్కొని బిల్డింగ్ ఎదురుగా వుండే యిసుకలో కూర్చున్నారంతా. ఒకరి కష్టసుఖాలు మరొకరితో పంచుకుంటున్నారు మాటల్లో.

"బాగా మొబ్బయి పోయిందాది. మేస్త్రీ రాలా. యింగెప్పుడన్నా పొయ్యేది" అంది నారాయణప్ప భార్య వక్కాకు నములుతూ.

అందరూ మాటల్లో వున్నారేగానీ ఆకలి వాళ్ళను ప్రశాంతంగా వుండనివ్వటం లేదు. మధ్యాహ్నం తిన్న చాలీచాలని తిండి ఎప్పుడో అరిగిపోయింది.

ప్లంబర్ మేస్త్రీ, పెయింట్ మేస్త్రీ వచ్చారు. వాళ్ళ వాళ్ళకు డబ్బు పంపకాలు అయిపోయింది. అందరూ ఆనందంగా అక్కడి నుండి వెళ్ళిపోయారు. మిగిలింది. తాపీ పని వాళ్ళే. వాళ్ళందరిలో అసహనం. బలవంతంగా మాటలు సాగుతున్నాయి. తొమ్మిదన్నర అవుతుండగా యింటి ఓనర్స్ కారులో వచ్చారు.

వాళ్ళు కారుదిగి వీళ్ళ వద్దకు వచ్చి "ఏమింకా యిక్కడే వున్నావ్" ప్రశ్నించారు.

"యింగా దుడ్డీలేదుసార్" అన్నాడు రామచంద్ర.

"మధ్యాహ్నమే తీసుకున్నాడే మేస్త్రీ. మీకు యివ్వలేదా?"

"లేదు సామీ" అన్నాడు కంగారుగా రామయ్య.

"యింక రెండు వారాలు రానన్నాడు. ఏదో వూరు పోవాలని చెప్పాడు"

"మాకాడ ఒగరూపాయి గూడా లేదుసార్. తలా నూర్రూపాయలీండి. రేపొరం పట్టిచ్చేస్తాం" అన్నాడు రామయ్య.

"నోనోనో... నా దగ్గర లేదింక. మీ అందరి మస్టర్‌లు లెక్క వేసి, అంతకన్నా తౌజండ్ రూపీస్ ఎక్స్ట్రాగానే తీసుకున్నాడు. డబ్బు కావాలంటే మేస్త్రీ ఇంటికెళ్ళండి. నా దగ్గరేం లేదు..." అంటూ వెళ్ళిపోయారు కారులో.

"మేస్త్రీ యిల్లు ఎవరికీ తెలీదు.

తమకు డబ్బు యివ్వకుండా పోయినందుకు అందరూ మేస్త్రీని తిట్టుకొంటూ బయలుదేరారు.

అంతవరకున్న కాస్త హుషారు కూడా తగ్గిపోయింది. అందరిలో రామచంద్ర నిక్కరు జేబును తడుముకున్నాడు. అంతా చిల్లర. నడుస్తూనే లెక్క వేశాడు. అన్ని రోజులది కలిపి ముప్పై ఐదు వుంది.

"మేస్త్రీ వస్తాడాన్నా..." అన్నాడు రామచంద్ర.

"యాడ... వానేలీ తాడుదెగా... యింత మోసం చేస్తాడనుకోలా" అన్నాడు నారాయణప్ప.

"ఆడ సేద్దెం జేద్దామంటే వాన మోసం జేస్తాంది. ఈడ పనులు జేద్దామంటే మేస్త్రీలు మోసం జేస్తాండారే" అన్నాడు రామయ్య.

అందరూ మాట్లాడుకుంటని తామున్న చెట్ల వద్దకు చేరుకున్నారు. రాత్రి పదిదాటుతున్నా అక్కడ సందడిగానే వుంది. శనివారం కావడంతో చాలా మంది ఆలస్యంగా వచ్చారక్కడకు. అప్పటికే కొంత మందితమ సంపాదనలో చాలా భాగం తాగుడుకు ఖర్చు చేసేశారు. ఆడవాళ్ళు దోబూచులాడుతున్న వీధి దీపం వెలుగులో వంట ప్రయత్నం చేస్తున్నారు. కొందరాడవాళ్ళు చెట్లకింద స్నానం చేస్తున్నారు.

"తినకుండా వచ్చేస్తివేమప్పా..." అన్నాడు నారాయణప్ప రామచంద్రతో

"తినబుద్ది కాలాన్నా"

బాధగా వుండాదా, వచ్చాదిలే లెక్క మన రెక్కల కష్టం బాటికి పోదులే. తినేసి రాపోబ్బీ" అంటూ ధైర్యం చెప్పాడు రామయ్య.

"ఆకలి పోయిందన్నా"

"ఏరా రామచంద్రా... ఈయరవదాకా పని చేస్తాన్నేరా?"

"నువ్వెప్పుడు వచ్చినావురా... మా అమ్మ నాయన చెల్లెలు బాగుండారా రమణా. వానలు పన్నేయా... ఇంట్లో ఏం చెప్పినారు" ప్రశ్నల వర్షం కురిపించాడు రామచంద్ర.

"ఎనిమిది గంటలకు వచ్చినా... నిన్ను మీ నాయన కలవరిస్తాండాడురా. యింగో రెండునూర్లు దుడ్డు గావాలంట" అన్నాడు రమణ.

"మూడు నూర్లు యిచ్చినావుగదా. నెలనెలా అంపతానని చెప్పలా"

"నెలనెలా పంపేది కాదురా. యిప్పుడు అవసరం"

"ఏమవసరం?"

"నేను వూరికి పొయ్యి నానే. దానికి రెండు రోజుల ముందు మీనాయన యిటికి పనికి పొయ్యిన్నాడంట. తట్టతో మన్ను మోస్తాన్నేడంట. బట్టీ కాల్చేదానికి చింతతుండును మేకులు పెట్టి చీలస్తాంటే, కట్టి నుంచి పమ్మెట జారిపోయివచ్చి ఎదుర్రొమ్మున తగిలిందట. నొప్పికి ఆన్నే పడిపాయనంట" అని వివరించాడు రమణ, డబ్బు అవసరాన్ని చెప్పకనే చెబుతూ.

"అవునా... ఎట్లుందిరా... వూరికి పోవాల్నే" అన్నాడు రామచంద్ర ఏడ్పుగొంతుతో.

"కరువు కాలంలో ఏవేమి నంకటాలు వస్తాండాయెా" అన్నాడు నారాయణప్ప.



"బాధపడద్దులేరా. యిప్పుడు బాగానే వుండాది. రెండుమార్లు కల్లూరుకు పోయి పట్టేపించుకోని వచ్చినాడు. నీకు చెప్పద్దన్నేడు. నేనే... చెప్పేసినా"

యింకా వూరిలోని అందరి గురించి చెప్తానే వున్నాడు రమణ. రామచంద్ర అతని మాటలను పట్టించుకొనే స్థితిలో లేడు. ఎట్లాన్నాగానీ. వూరికి పోవాల. నాయన్ను చూడాల అనుకొన్నాడు. చేతిలో నలభై రూపాయలు కూడా లేవు. ఎవరినన్నా అడగదామంటే మిగిలిన వాళ్ళ స్థితి తనకన్నా అధ్వాన్నం. పొద్దున్నే పనికిపోయి ఆ డబ్బుతో రాత్రికి పల్లెకు పోవాల అనుకొన్నాడు. లింకు బస్టాండులోకి వెళ్ళి, కొళాయి వద్ద నీళ్ళు తాగేసి వచ్చి గోతం పట్ట పరచుకుని పడుకున్నాడు. అతని పక్కనే చోటు చేసుకున్నాడు రమణ.

◇◇◇

పదకొండు గంటలవుతుండటంతో రుయా బస్సుల సందడిలేదు. అప్పుడొకటి అప్పుడొకటి స్కూటర్లు మాత్రం పోతున్నాయి. లింకు బస్టాండులోకి తిరుమల బస్సులు వచ్చిపోతున్నాయి. కొండ మీద నుంచి దిగుతున్న బస్సుల హారన్‌లు విన్పిస్తున్నాయి. చెట్లకింద పడుకున్న పిల్లల్ను దోమలు కుట్టడంతో లేచి కూర్చుని ఏడుస్తున్నారు. పెద్ద వాళ్ళు వాళ్ళను గదమాయించి పడుకో బెట్టుకుంటున్నారు. నిద్రపట్టని మగవాళ్ళు బీడీలు ముట్టించారు.

రాత్రంతా రామచంద్ర పొర్లుతూనే వున్నాడు. కడుపు ఖాళీగా వుండటం, నాన్నకు ఆరోగ్యం బాగలేదని తెలవడం, మేస్త్రీ డబ్బు యివ్వకపోవడం అతడ్ని స్థిమితంగా వుండనివ్వలేదు. తెల్లవారు ఝామున ఎప్పటికో నిద్రపట్టింది.

వేసవి కాలం కావడంతో సూర్యుడు ఆరుగంటలకంతా కొండ మీదకు చేరాడు. రుయా ఆసుపత్రికి వచ్చే టౌన్ బస్‌ల బెడద ప్రారంభమయింది. వాటి కన్నా ముందే తిరుమల లింకు బస్టాండులో యాత్రికుల కోలాహలం మొదలయింది. తిరుమల కొండకు రాత్రి ఎవరో పెట్టిన అగ్గి, యింకా పొగలు చిమ్ముతూనే వుంది. రామచంద్ర వులికిపాటుగా లేచి కూర్చున్నాడు.

"అప్పుడే తెల్లారిపోయిందా" అంటూ ఆదరాబాదరా లేచి నిల్చున్నాడు.

"ఆదివారమే గదాన్నా... యాడికిపోవాల" అంది నారాయణప్ప భార్య వక్కాకు నములుతూ.

"పనికి పోవాలమ్మా..." అన్నాడు లుంగీని నడుముకు బిగించి కడుతూ.

"మేస్త్రీ లెక్కే ఈలా.. పనేదుంది" అన్నాడు రామయ్య.

"వూరికి పోవాలన్నా... దుడ్డుకావాల. మంటపం కాడికి పోతా. పని దొరకతాది. ఆట్నించట్లే మా వూరికి పోయెస్తా. ఈపాటికి ఆడికి పోయింటే బాగుండు" అంటూ గబగబా నడచుకుంటూ చెట్లల్లోకి వెళ్ళాడు. పది నిముషాల్లో స్నానం కూడా చేసేసి వచ్చాడు. అప్పటికి రమణ నిద్రలేచి కూచ్చోనున్నాడు.

"యాడికిరా... పద్దన్నే లేసేసినావు" అడిగాడు రమణ.

"పనికి..."

"ఆదివారం కదా.. యాడుంటాది పని"

"మంటపం కాడికి పోతారా" అంటూ చెట్టులోనుంచి చేతి సంచి తీసి షర్టు వేసుకున్నాడు.

"వారమంతా పని చేసినావు కదా. ఒగరోజన్నా గమ్మునుండరా"

"గమ్మునుండే... నాయన్ను చూడాలని వుందిరా... దుడ్డుగావద్దా"

"అందుకే మీ నాయన చెప్పద్దన్నేడు. చెప్పకుండా వున్నే బాగుండు" అన్నాడు ఆవులిస్తూ.

"ఫోన్ చెయ్యప్పా" సలహా యిచ్చాడు నారాయణప్ప.

"మా వూర్లో ఎవురికేగాని ఫోన్ లేదన్నా" సమాధానం చెప్పాడు రమణ.

"సరే... నేను పోతారా... పని దొరికితే చేసి, రాత్రికి అట్లే వూరికి పోతా. రేపోమన్నాడో వస్తా" అంటూ చేతి సంచిని సంకలో పెట్టుకుని బయలుదేరాడు రామచంద్ర.

◇◇◇

నడచుకుంటూ గాంధీరోడ్డు దగ్గరున్న నాలుగ్గాళ్ళ మండపం వద్దకు చేరేప్పటికి ఏడుగంటలయింది. అప్పటికే అక్కడ పనికొరకు కొన్ని వందల మంది కాసుకోనుండారు. కొందరి చేతుల్లో కరిణెలు, మట్ట పలకలూ వున్నాయి. కొందరి దగ్గర పెయింట్ డబ్బాలు, అరటి బ్రష్‌లు వున్నాయి. కొందరి వద్ద పార పలుగులు ఉన్నాయి. గుంపులు, గుంపులుగా కూర్చొని, నిల్చొని మాట్లాడుకొంటున్నారు. అక్కడెవరైనా వాహనం ఆపినా, మనిషి నిలచి మాట్లాడినా అతని చుట్టూ మూగిపోతున్నారు. పని దొరికిన వాళ్ళు పోతున్నారు. రోడ్ల మీద జన సంచారం తక్కువగా వుంది.

తొమ్మిది గంటలు దాటింది. సూర్యుడు తన ప్రతాపం చూపిస్తున్నాడు. రామచంద్రకు పని దొరకలేదు. ఎండకు తాళలేక కొంత మంది మంటపం వద్ద నీడలో చేరారు. రామచంద్ర రోడ్డు మీదే

ఎదురుచూస్తున్నాడు పని కొరకు. రాత్రి తినకపోవడంతో పొద్దున్నే విపరీతమయిన ఆకలిగా వుందతనికి, తింటే డబ్బయిపోతాది.

"మేమొచ్చి ఆర్నెల్లయితాండాది. అప్పుడు యింత యిదిగా లేదు. పని దొరకతాన్నింది"

"అవునవును. ఈ రెండు మూడు నెళ్ళ నుంచీనే పని దొరకంది"

"కరువు కరువని మీరంతా టౌనుకొచ్చి మా కడుపులు కొడతాండారు"

"మేమేం చేస్తాండామప్పా మిమ్మల్ను. దొంగతనం చేస్తాండామా... రౌడీయిజమా."

మేము ఈ వూర్లో ఇరవై ఏండ్లగా వుండాము. మంటపం కాడికొచ్చి రోజూ పనికి పోతాండాం. పెండ్లాం బిడ్డలుండారు. బాడుక్కు యిల్లు తీసుకోనుండాది. యింతకు ముందు యింటి పనికి పోతే డెబ్బైఎనభై యిస్తాండిది. మీరంతా వచ్చి నలభైకి యాభైకి చేస్తాంటే మమ్మల్నెవరు పనికి పిలుస్తారు. తక్కువకు పోదామంటే మనసొప్పదు. తక్కువకు పోవాలన్నాదినమ్మో పనుండద్దా. మార్కెట్ కాక, మామిడి కాయల మండీకాడ, బైరాగి పట్టెడ, అలిపిరి, కపిలతీర్థం, బాలాజీ కాలనీ... యాడ జూసినా మీ మాదిర్తో వచ్చిండే వాళ్ళే.

"అవున్నిజమే... ఏం చేసేదప్పా. మా పక్క చూస్తే తెలస్తాది మేమెంత హీనంగా బతకతాండామో... ఈ వూర్లో పనిదొరక్క పోయినా తాగేకి నీళ్ళయినా వుంటాండాయి. మావూర్లో వుంటే గొంతెండి సావాల్సిందే".

రామచంద్ర వాళ్ళందరి మాటలు వింటూ వచ్చిపోయే వాళ్ళను గమనిస్తున్నాడు. యింతలో ఒకతను స్కూటర్ మీద వచ్చాడక్కడకు. అందరూ మాటలాపి అతని చుట్టూ మూగారు.



"నాక్కావలసింది ఒక్క మనిషేనయ్యా. యింత మంది అవసరంలేదు" అన్నాడతను.

"ఏం పని సారూ" ప్రశ్నించాడొకతను.

"ఏంపనా... చెప్తా" అంటూ అక్కడ నిల్చున్న అందరినీ పరిశీలనగా చూసి ఒడ్డూ పొడవూ వున్న రామచంద్రతో "వస్తావా" ఉన్నాడతను.

"వస్తాసార్" అన్నాడు కాళ్ళ దగ్గరుండే సంచిని చేతికి తీసుకుంటూ.

"సెప్టిక్ ట్యాంక్‌కు గుంత తొగాల. కొంచెం తొగిండారు. రేపు మేస్త్రీలు వచ్చాలకు రెడీగా తొగిస్తానన్నా" అన్నాడతను.

"పార పనయితే భయమేలేదుసార్. తొగేస్తాను" అన్నాడు వుత్సాహంగా రామచంద్ర.

అతను స్కూటర్ స్టార్ట్ చేశాడు.

"పనేడ సార్ సాయంత్రం మావూరికి పోవాల. బస్టాండుకు రావల్ల"

"ఏవూరికి పోవాల"

"పీలేరుకు"

"అయితే యిబ్బంది లేదులే. ఎర్రమిట్టలో మేముండేది. బస్సులన్నీ మాయింటి దగ్గర బైపాసెంటే పోతాయి. పనయిపోతానే నువ్వు అన్నే బస్సు ఎక్కేయచ్చు"

రామచంద్ర అతని వెనక కూర్చున్నాడు. స్కూటర్ వేగంగా వెళ్ళసాగింది. తను అప్పుడే తమ వూరికి పోయినంత సంతోషంగా వున్నాడు.

స్కూటర్ ఎర్రమిట్ట చేరుకుంది. యిద్దరూ దిగారు.

"యిదే గుంత... ఎంత... రెండడుగుల లోతు తవ్వాలంతే, నాలుగ్గంటలకంతా ఐపోతాది. పనయిపోతానే ఎలబారిపో కూలియిచ్చేస్తా" అన్నాడతను.

గుంత ఏడడుగుల పొడవు, ఐదడుగుల వెడల్పు వుంటుందని కళ్ళతోనే అంచనా వేశాడు రామచంద్ర. అప్పటికది నాలుగడుగుల లోతు తవ్వించారంటే సాయంకాలానికి కాదేమో అనుకున్నాడు. అది తప్పితే వేరే పనిలేదు. పనిలేకపోతే వూరికి పోలేడు.

"చెంబులో నీళ్ళిండి సార్"

రాత్రి నుంచి తినకపోవడంతో కడుపు వీపుకు అతక్కుపోయింది. ప్లాస్టిక్ బిందెలో నీళ్ళను అంచులు పగిలిన స్టీలుగ్లాసుతో ముంచుకుని తాగాడు. ఐదుగ్లాసుల నీళ్ళు తాగితే కానీ అతని కడుపు శాంతించలేదు.

"సాయంత్రం పనయిపోతానే దుడ్డు యిచేస్తావుగదాసార్" అన్నాడు రామచంద్ర గుంతలోకి దిగుతూ.

"నా సంగతి నీకు తెలీదు. మాయింటి పని చేసిన మేస్త్రీలుగానీ, ఆచార్లుగానీ, పెయింటర్లుగానీ జీవితాంతం తలచుకోవాలనన్ను. చానా కరెక్ట్ మనిషిని అన్నాడతను.

రామచంద్ర గడ్డపారను చేత్తోతాకి కళ్ళకద్దుకున్నాడు. దాన్ని రెండు చేతులతో పట్టుకుని పైకెత్తి బలంగా వేశాడు. ఐదంగుళాలకు మించి దిగలేదు భూమిలోకి.

"రాత్రి నీళ్ళు పోసింటే బాగుండుసార్" అన్నాడు తవ్వుతూనే రామచంద్ర.

"మా వాచ్‌మేన్‌కు చెప్పినా వాడు పట్టినట్టులేదు. రోజూ పడతాందే కదా. తెగతాదిలే"

కొంతసేపు గడ్డపారతో తవ్వాడు. తవ్విన మట్టిని పారతో ఎత్తి తట్టలో వేసి పైకి విసరివేశాడు. అలా ఆపకుండా పని చేయసాగాడు. అతను కుర్చీ వేసుకుని కూర్చుని మాటలు చెబుతూనే వున్నాడు. రామచంద్ర వింటున్నాడో లేదో కూడా గమనించలేదు. రెండు గంటలు తవ్వింతర్వాత మంచినీళ్ళ కోసం పైకి వచ్చాడు రామచంద్ర. అప్పటికే చెమటతో తడచిపోయాడు.

"టీ అలవాటుందా" అన్నాడతను నీళ్ళు తాగుతున్న రామచంద్రతో. కాని ఆశగా ఔను అన్నాక మా ఇంట్లో తాగం అని చెప్పేశాడు.

మధ్యాహ్నం రెండు గంటలయింది.

"అన్నం తినేసిరాపో..." అంటూ రామచంద్రకు పది రూపాయలు యిచ్చాడతను. గుంతలోంచి పైకి వచ్చి కాళ్ళు చేతులు కడుక్కొన్నాడు.

"రోడ్డుపైన్నే వుండాది హోటలు. సంగటి, కుష్కా, బిర్యానీ... ఏది కావాలంటే అది వుంటాది. తినేసిరాపో. యిప్పుడే చెప్తాండా. సాయంత్రం గొడవ పడొద్దు. ఈ పది రూపాయలు నీ కూలిలో పట్టుకుంటా."

"ఇంత కష్టం చేస్తాండా... పది రూపాయలు ఎగస్టా ఈండి సార్"

"లేదులేదు... లెక్కంటే లెక్కే... తొందరగా వచ్చెయ్"

"వచ్చేస్తా సార్" అంటూ రోడ్డు మీదకు వెళ్ళాడు రామచంద్ర. రోడ్డు మీదకు అడుగుపెట్టగానే పీలేరు బస్సు ఎదురయింది. బస్సు ఎక్కేద్దామా అని వూగిసలాడింది అతని మనసు.

వూరికి చార్జీలు లెక్క వేశాడు. 'పీలేరుకు ఇరవైఏడు. అక్కడి నుంచి తొమ్మిది. పొయ్యేదానికి ముప్పై ఆరు. పోనూరాను డెబ్బైరెండు. చేతిలో ముప్పై ఐదు వుంది. అరవై కూలేసుకున్నా, యిప్పుడు పదిపోయినా, సాయంత్రం యాభై వస్తాది. మొత్తం ఎనభై ఐదవు తాది. పదమూడు రూపాయలు వుంటాది. నాయనకు జాంగ్రీ అంటే యిష్టం. మిగిలిన దుడ్డుకు తీసకపోవాల' అనుకొన్నాడు.

హోటలు దగ్గరకు పోయాడు. మళ్ళీ ఆలోచించాడు. ఒక వేళ్ల సాయంత్రం కూలి యాబయ్యేయిస్తే యిప్పుడు సంగతి తినేస్తే సాయంత్రం చేతికి నలబయ్యే వస్తాది. ఛార్జీలకు సరిపోతాది నాయనకు జాంగ్రీ తీసకపోలేడు. యిప్పుడు తినేది వద్దులే. సాయంత్రం ఆయన అరవై యిస్తే ఏదన్నా తినే బస్సు ఎక్కచ్చు' అనుకున్నాడు.

హోటలు నిండుకు జనం వున్నారు. చికెన్, మటన్, బిర్యానీల వాసనలు ముక్కు పుటాలను అదరగొడుతున్నాయి.

"నీళ్ళు..." అన్నాడు రామచంద్ర.

"ఆడుండాయి చూడు" అంటూ హోటల్ కుర్రాడు ఒక మూలకు చేయి చూపించాడు.



అక్కడకు వెళ్ళి రెండు చెంబుల నీళ్ళు తాగాడు. ఖాళీ కడుపులోకి ఎక్కువ నీళ్ళు పోవడంతో వాంతి వచ్చేలా అనిపించిందతనికి. గబగబా బయటకు వచ్చేశాడు. కొంతసేపు ఫుట్‌పాత్ మీద చెట్టునీడన కూర్చున్నాడు. పీలేరు, మదనపల్లి బస్సులు వస్తున్నాయి పోతున్నాయి. నాయునకెట్లుందో ఏమో తొందరగా పోవాల అనుకొన్నాడు. పని వద్దకు వెళ్ళాడు. యింటి ఓనర్ అప్పటికే తినేసి వచ్చి కుచ్చోనున్నాడు.

ఒక నిముషం కూడా ఆపకుండా పని చేయసాగాడు. చెమటతో ముద్దయిపోయాడు. రెండుసార్లు నీళ్ళు తాగాడు. మసక చీకట్లు కమ్ముకుంటున్నాయి. వీధి దీపాలు వెలిగాయి. అక్కడ కూడా ఒక బల్బు వెలుగుతోంది.

"యింగ చాలా సార్" అన్నాడు రామచంద్ర నుదుటనున్న చెమటను తుడుచుకొంటూ.

"ఏదీ...వుండు" అంటూ అతను జేబులోంచి మెజర్‌మెంట్ టేప్ తీసి కిందకు విడిచాడు. "యింకా ఒకడుగు తెగాల" అన్నాడు.

"పొద్దు పోయింది సార్. మా వూరికిపోవాల"

"అందుకు నేనేం చేసేది నీకు ముందే చెప్పినా కదా, పనయిపోతానే పొమ్మని. తొందరగా తవ్వి యింకా ముందుగా పొయ్యిండేది. నేనేమన్నా వద్దనందునా. పద్దన్నే మేస్త్రీలు వస్తారు. పని పంచేటవుతాది యింకెంత ఒకడుగే కదా. తొగెయ్" అన్నాడతను.

రామచంద్రకు నీరసంగా వుంది. కళ్ళు తిరుగుతున్నట్టున్నాయి. తిరిగి పని ప్రారంభించాడు. గంట, రెండుగంటలు, మూడు గంటలు.. ఏకధాటిగా తవ్వాడు. రాత్రి పదిగంటలు కావస్తోంది. శరీరం సహకరించడంలేదు.

"యింగ నానింటి కాదుసార్. నువ్వు చెప్పిందానికన్నాన ఎక్కువే తొగినాను" అన్నాడు రామచంద్ర.

అతను గుంతను పరిశీలనగా చూశాడు.

"ఆ... సరిపోతుందిలే.. అదో.. ఆ పక్కన చూడు కొంచెం వుబ్బుగా వుంది. అది కొంచెం తొగు. ఈ పక్క క్రాసుగా వుండాది సక్కగా తొగెయ్. టేపు పట్టుకోని చూడు. చూసినావా. ఆ పక్కకు ఈ పక్కకు అరడుగు తేడా వుంది. ఆ కొంచెం తొగెయ్" అంటూ మరో గంట సేపు పని చేపించాడు.

గుంతలోతు పెరగడంతో మట్టిని పైకి విసరడం రామచంద్రకు శక్తికి మించిన పనయింది. పళ్ళు బిగువున పని చేశాడు.

"యింగ చాల్లేయ్యా. పొద్దుపోయింది. యింకేమన్నా కొరవ వుంటే మేస్త్రీలు చేసుకుంటార్లే పైకిరా" అన్నాడతను.

అతి కష్టం మీద గడ్డకు చేరాడు. కాళ్ళు చేతులు కడుక్కొన్నాడు. సంచిలోంచి షర్టుతీసి వేసుకున్నాడు. కళ్ళు మూతలు పడుతున్నాయి. అడుగులు కదలమంటున్నాయి. ఏదో ఒక విధంగా, వూరికి పోతే చాలు నాయన్ను చూస్తేచాలు అనుకొన్నాడు.

"యిందో" అంటూ పది రూపాయల కాగితాలిచ్చాడతను.

రామచంద్ర వాటిని తీసుకుని లెక్కపెట్టాడు. నలభై వుందంతే.

"సరిపోయింద్లా" అన్నాడతను.

"పద్దన్నే వచ్చినా. రాత్రి పన్నెండవుతాండాది కదాసార్. రెండు రోజుల కూలి యివ్వాల"

"బళేవానివే... ఎంత పనిది. నీనింటికాలా అంతే. నువ్వు పనిలో దిగిందే మధ్యానాలకు కదా. అట్లలెక్కేసినా ఒగరోజు పని చేసినావంతే. మధ్యానం అన్నానికి యిచ్చిన పదిపోతే నలభై యిచ్చినాను" అన్నాడతను నవ్వుతూ.

"ఇంగో నలబయ్యన్నా ఈసార్"

"లేదు... లేదు... నీకివ్వాలని కరెక్ట్‌గా యాబయి రూపాయలు జేబులో పెట్టుకోనున్నే. యింగోసారి పనికి వచ్చినప్పుడు పది రూపాయలు యిస్తాలే".

అతన్తో ఎక్కువ సేపు మాట్లాడే ఓపిక కూడా లేకపోవడంతో మౌనంగా బయలుదేరాడు రామచంద్ర.

"యిప్పుడు బస్సులుండవు. రోడ్డు పక్కన చెట్లకింద పడుకో, చల్లగా వుంటాది మొబ్బుతోనే బస్సెక్కేయి" అన్నాడతను.

అతని మాటలు విన్నాడో లేదో. మౌనంగా వచ్చి రోడెక్కాడు రామచంద్ర. వీధి దీపాలు కాంతివంతంగా వెలుగుతున్నాయి. బాగా నీరసంగా వున్నట్లుంది. అడుగులు తడబడుతున్నాయి. రోడ్డు డివైడర్ మీదున్న పచ్చికలో వెళ్ళకిలా పడుకున్నాడు. చేతిసంచిని తలకింద పెట్టుకున్నాడు. ఆకలి... పేగులు చుట్టకపోతున్నట్లుండడంతో పక్కకు తిరిగి కాళ్ళు ముడుచుకుని పడుకున్నాడు. 'నాయన కెట్లుందో ఏమో... నాయన్ను చూడాల" అనుకుంటున్నాడు. నిద్రో, కళ్ళు తిరగడమో అర్థం కాలేదు రామచంద్రకు. అలా ఎంతసేపున్నాడో కూడా తెలీలేదు. తొడమీద చురుగ్గా తగలడంతో మగతగా కళ్ళు తెరిచాడు. ఎదురుగా పోలీసులు, జీపు. వాళ్ళేమడుగుతున్నారో, తనేం చెబుతున్నాడో తెలీలేదు.

"ఫుల్‌గా తాగేసి పడుకోనుండాడు నా కొడుకు. ఏసకపోండి జీపులో" అన్నాడొక పోలీసు పిచ్చికుక్కను ఈడ్చినట్లు ఈడ్చి జీపులో వేశారు. 'నాయనకు ఎట్లుందోఏమో... నాయన్ను చూడాల" అని కలవరిస్తున్నాడు రామచంద్ర.

పెట్రోలింగ్ జీపు ముందుకు కదిలింది. ❖

57

# పోస్ట్‌మాడర్న్ స్వగతం

యార్లగడ్డ రాఘవేంద్రరావు



ఒక్క క్షణం
మట్టికొట్టుకుపోతున్న
పుట్లకొద్దీ గాలివాటు క్షణాల్లో
ఒక్క దాన్నైనా వెన్నుతట్టే వరంగా అందుకుని
చారెడంతైనా చైత్రాన్ని ఒంపుకోవడానికి
ఎన్ని రాత్రిళ్ళ కంపల్ని నరుక్కుంటూ పోయానో

ఒక్కపూట
పగ్గాలిడిసిన దూకుడులా
పదును పెట్టుకున్న ఒక్కపూటైనా
పూటకూటి కట్టడి నుంచి, వెన్ను విరుపుల్నించి
నెనరుతేలిన నిండాకాశం కింద
గాలిమేనాలో పిట్టల ఊరేగింపు కావడానికి
గొంగడి ముసుగులో
అలుగుకట్టిన ఎన్ని ఆశల్ని పిండుకున్నానో

ఒక్క జ్ఞాపకం
కావిళ్ళ బరువుకు కావలి కాసి కాసి
సెగబారిన ఊపిరి నీడల కింద
నిద్రలేచిన ఒక్క జ్ఞాపకాన్నైనా
విజయపతాకగా ఎగరేసుకోవడానికి
కాలం పంగల మీద
అచ్చుకట్టిన ఎన్ని మరణాల్ని
అరచేతుల్లోకి దించుకున్నానో

ఒక్క బతుకు
కొర్రుకోత కోసిన
ఒకే ఒక్క బతుకు చాలు బిక్కమొగం వేస్తే
సరస తడి ఊరడింపుల కోసం
ఎగర్చే పొద్దుకు చూపులు జోడించి
ఎన్ని యుద్ధాలతో సంధి చేసుకున్నానో
న్ను నేను ఎన్ని సవరింపులై అల్లుకున్నానో

◇◇◇

వును కదూ
దంతా భ్రమే కదూ
డుపుగాదె చుట్టూ
ఈ పరిభ్రమణల యాగం తప్పుకదూ
లతలు, లోతులూలేని అవధుల్ని ఈది
క్కుపడ్డ చీలికలకు
పిడి తీసిన బాటల్లో
దిలమైన దృశ్యం కావాలనుకోవడం

పిచ్చిభ్రమేకదూ
నేను విశ్వమానవుణ్ణయ్యాక
విపణి పౌరోహిత్యానికి పట్టాపొందాక
సార్వత్రిక కర్మ సృష్టిలో భాగస్వామినైపోయాక
నేనేమిటి? నాకంటూ వేరే ఉనికేమిటి?

ఊరించే గ్లోబల్ సాలభంజిక చుట్టూ
మనోవేగాన్ని మించిన సైబర్ విహారాలు
చిక్కనవుతున్న ఊసరవెల్లిరంగులతో
ఇన్ఫో-టెక్-టైన్‌మెంట్ ఇంద్రధనుస్సులు
మిలమిలలాడే వీధుల నిండా
మిసమిసలాడే సౌఖ్యాల రాసులు
అన్నీ నా కోసమే కదా
సప్త సముద్రాలకు ఊడల ఉయ్యాలకట్టి
ఎక్కడెక్కడి పగటి చుక్కల్నీ తోడితోడి
దారి పక్క విరగబూయించుకుంటున్న
ఈ వెలుగులన్నీ నా సొంతమేకదా

నేను-దేహము-మనసు-లోకము-యుగము
అన్నీ సాపేక్షాలైనప్పుడు
సంకల్పితమనేదే లేనప్పుడు
అసంకల్పితాన్ని, అందునా పోస్ట్‌మాడర్న్‌ని
ప్రశ్నించడం నేరం కదా

హద్దులన్నీ ఆకాశంలోకి ఇంకిపోయి
గ్రహాలకు కాంక్రీటు రోడ్లు పడుతుంటే
అంతరిక్ష కాలనీల్లో కాపురానికి
మూటాముల్లె సర్దుకోక

స్వాభిమానం చూరుకు
ఉడుం పట్టేసుకుని వేళ్ళాడటం
చెరువులో అలల మొద్దు నిద్రలా
మిగిలిపోవడమే కదా

అహంబ్రహ్మాస్మి!
ఆ మాత్రం పురాతన సూత్రం తెలియకపోతే
అస్తిత్వమంతా ఆధునిక చవటాయితనం కాదా
జీన్ మ్యాపులన్నీ
ఇంత తేటతెల్లంగా ఆవిష్కృతమయ్యాక
అంటుకట్టే అంట్లతనం నుంచి ఎగబాకి
క్లోనింగ్ కాంతుల చిద్విలాసంలో
చీకటి తెరలెరగని ధ్రువదీపంలా మెరిసిపోక
గుండె చరియల్లోనే ఇంకా తచ్చాడడం
గాలి తిరుగుడు కాదా

అవును కదూ-
పొదుగులేని పాలను పితుక్కోవలసిన
నేనిప్పుడు ఆనవాళ్ళ వెంట
అడుగుల్ని లెక్క పెట్టుకోకూడదు కదూ
కాస్మిక్ వనాల్లో
శాటిలైట్ కోయిల కావల్సిన నేను
పులిస్తరాకు పొదల్లో
కాకిలా వాలకూడదు కదూ
విత్తనం లేకుండానే
మహావృక్షంలా విస్తరిల్లాల్సిన నేను
సగటు బోన్సాయి తనంలో
చతికిలబడడం నిష్కృతి లేని నేరమే కదూ!

## కొంగర జగ్గయ్య



ప్రసిద్ధ తెలుగు చలనచిత్ర నటుడు, కవి, జర్నలిస్టు కొంగర జగ్గయ్య 76వ ఏట కన్నుమూశారు. బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరుపొందిన జగ్గయ్య 1928 డిసెంబరు 31న గుంటూరు జిల్లా మోరంపూడి గ్రామంలో జన్మించారు. గుంటూరు ఎ సి కళాశాల ఎన్.టి.ఆర్. ప్రభృతులతో లా చదువుతూ రంగస్థల ప్రదర్శనలు నిర్వహించారు. 1944లో విద్యకు స్వస్తి చెప్పిన ఆయన దేశాభిమాని దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా పని చేశారు. అనంతరం శోభ పేరుతో చేతి రాత పత్రికను కొన్నాళ్ళు నిర్వహించారు. ఆకాశవాణి వార్తా వ్యాఖ్యాతగా కొన్నేళ్ళు కంచుకంఠం వినిపించారు. చలన చిత్రరంగంలో 500కు పైగా చిత్రాల్లో వైవిధ్యభరితమైన విద్యలు పోషించారు. భారత ప్రభుత్వం ఆయన్ను పద్మ విభూషణ్ బిరుదుతో గౌరవించింది. ఢిల్లీ సంస్కృత విశ్వవిద్యాలయం ఆయన్ను కళావా చస్పతిగా సన్మానించింది. సాహితీ రంగంలో కూడా జగ్గయ్య ప్రతిభను చూపారు. విశ్వకవి రవీంద్రుని గీతాంజలి కావ్యాన్ని ఆయన తెలుగు ప్రజలకు అందించారు. రవీంద్రుని రచన 'త్యాగం' నాటికను బలిదానం పేరుతో తెలుగులో అనువదించి పలు ప్రదర్శనలు ఇచ్చారు. ఆత్రేయ ట్రస్టు ద్వారా ఆయన రచనలు ప్రచురించడమేగాక పలువురిని గౌరవించారు.

## కె. రాజేశ్వరరావు



జర్నలిస్టుగా, కవిగా, రచయితగా కృషి చేసిన కాగితాల రాజేశ్వరరావు ఫిబ్రవరి 18న కన్ను మూశారు. ఆయన వయస్సు 56 ఏళ్ళు. కొంత కాలంగా రాజేశ్వరరావు అస్వస్థులుగా వున్నారు.

1948లో విజయవాడలో కమ్యూనిస్టు కుటుంబంలో జన్మించిన రాజేశ్వరరావు ఎస్సెల్సీ వరకూ చదివి కంపోజిటరుగా జీవితం ప్రారంభించారు. 1970 నుంచి ఆయన మాత్రాబద్ధ ఛందస్సులో గేయాలు రాయడం ప్రారంభించారు. ఆ ఏడాది హైదరాబాద్‌లో జరిగిన ప్రపంచ యువజనోత్సవాల కవితా పోటీలో ఆయన కవిత "ఎవ్వరిదీ వసుంధర"కు బహుమానం లభించింది. తర్వాత కాలంలో కూడా ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి కోసం ఆయన రచించిన గేయాలు బహుళ ప్రాచుర్యం పొందాయి. 1973లో "ప్రగతి" వారపత్రికలో బాలసాహిత్య రచయితగా రంగప్రవేశం చేశారు. 1978-81 చిన్నారి లోకం మాసపత్రికకు పదేళ్ళు సంపాదకులుగా పని చేశారు. జాతీయస్థాయిలో అవార్డులు స్వీకరించారు. విశాలాంధ్ర మరికొన్ని పత్రికల్లో పని చేయడంతోపాటు టీవీ సీరియల్స్‌కు సంభాషణలు, పాటలు రాశారు. "ఛాయాగీతం", "వెలుగు తుప్పురులు" అనే నవలల్ని కూడా ఆయన రచించారు. సామ్రాజ్యవాదాన్ని నిరసిస్తూ నెరూడా రాసిన "దే మస్ట్ బీ పనిష్డ్" గీతం అనువాదం (వాళ్ళను శిక్షించాలంటున్నా) ఇటీవలే మోహన్ కార్టూనులతో అత్యంత ఉత్తేజకరంగా వెలువరించారు.

## మిరియాల రామకృష్ణ



కవి, విమర్శకుడు, సాహితీవేత్త డా॥ మిరియాల రామకృష్ణ మీరా, సుధాకిరణ్, ఆనందవర్ధన్ అన్న కలం పేర్లతో ప్రగతిశీల కవిత్వాన్నీ, విశ్లేషణాత్మక వ్యాసాల్నీ రచించిన రామకృష్ణ 1934 ఏప్రిల్ 5న తూర్పు గోదావరి జిల్లాలో పుట్టారు. 'శ్రీశ్రీ కవిత్వంపై' పరిశోధన చేసి పి.హెచ్.డి. పట్టా పొందారు. అకడమిక్‌గా అలాటి పరిశోధన అదే ప్రథమం. తెలుగు, సంస్కృత భాషల్లో భాషా ప్రవీణ పూర్తి చేశారు.

బాలాభిరామం (1965), రంగురంగుల రత్నదీపాలు (1970), స్నేహ దేహళి (1972), ముత్యాల గొడుగు (1978), విద్యుద్వీణలు (1981), దేశం మేలుకుంది (1989), సువర్ణ స్వప్నం (1997), వివేక పట్టణం (1998) మొదలైన కవితా సంపుటాలను మిరియాల రామకృష్ణ ప్రకటించారు.

శ్రీశ్రీ కవిత్వం -వస్తుసంవిధానం (1980), శ్రీశ్రీ కవితా వైభవం (1980), భావయిత్రి-కారయిత్రి పేరిట సోమ సుందర్ కవితా పరిణామం (1996), సినారె కవితాబింబం (2002) సాహిత్య పదకోశం (తెలుగు అకాడమి వారి ప్రచురణ-1976), తెలుగువాచకం (1984), దీపస్తంభాలు (1984), శ్రీశ్రీగారితో నా అనుబంధం (1986), పర్యాటకుడి డైరీ (1993) మొదలైన విమర్శ, వచన గ్రంథాలను రచించిన డా॥ మిరియాల రామకృష్ణ వివిధ పత్రికల్లో సాహిత్య శీర్షికలు నిర్వహించారు. శ్రీశ్రీ ప్రపంచం స్వాతి వారపత్రికలో సాహితీ క్విజ్ (1989), రచన - రసన శీర్షిక, నానా గాథలు - ప్రజాశక్తి (2002), అరుద్రాక్షరం - ఎపి గ్రామ్స్ వెలువరించారు. అనేక అవార్డులు పొందారు.

## తొక్కుడుబండ కృష్ణమూర్తి యాదవ్



ప్రగతిశీల కవి టి. కృష్ణమూర్తి యాదవ్ (63) ఫిబ్రవరి 25న నిమ్స్ ఆసుపత్రిలో మరణించారు. తెలంగాణా మాండలిక భాషలో 'తొక్కుడుబండ' కవితా సంపుటిని ప్రకటించిన కృష్ణమూర్తి యాదవ్ గత సంవత్సరమే 'శబ్నం' కవితా సంపుటిని వెలువరించాడు. తన మూడో పుస్తకం 'పిల్లల ఆకాశం' ఆవిష్కరణ ఫిబ్రవరి 10న ఏర్పాటు చేసుకుని, ఆహ్వాన పత్రాలు పంచుతూ రోడ్డు ప్రమాదంలో తీవ్రంగా గాయపడ్డాడు. అప్పట్నించి ఇరవై అయిదో తేదీ వరకు నిమ్స్‌లోనే చికిత్స పొందుతూ తుదిశ్వాస విడిచారు. వివిధ పత్రికల్లో నిరంతరం కవితలూ, గ్రంథ సమీక్షలు ప్రకటించిన కృష్ణ మూర్తియాదవ్ నిరాడంబరుడు. స్నేహజీవి, జంటనగరాలలో జరిగిన అనేక సాహితీ, సాంస్కృతిక సమ్మేళనాల్లో చురుకుగా పాల్గొన్న కృష్ణమూర్తి యాదవ్ రాష్ట్ర ప్రభుత్వ కార్మిక సంక్షేమ శాఖలో పని చేసి, ఉద్యోగ విరమణ చేశాడు. సాహితీవేత్తలందరితోనూ స్నేహసంబంధాలు వున్నాయి. మార్చి 8న హైదరాబాద్‌లో సంస్మరణ సభ, 'పిల్లల ఆకాశం' ఆవిష్కరణ జరిగింది.

59



ఉదయగీతిక
యాంగ్ మో
వెల : రు.70
ప్రచురణ : పర్ స్పెక్టివ్స్



డాలర్ చలి
యం. శ్రీనివాస్
వెల : రు.20
ప్రచురణ : జనసాహితి



ొడ్నాల సూర్య కవితలు
ొడ్నాల సూర్య
ల : రు.50
చురణ : విశాల సాహిత్య అకాడమి



50 ఏళ్ళ తెలుగు కథ తీరు తెన్నులు
బి.ఎస్. రాములు
వెల : రు.250
ప్రచురణ : విశాల సాహిత్య అకాడమి



ఎండమావి
యెన్నం ఉపేందర్
వెల : రు.60



జీవన స్పర్శ
నల్లూరి రుక్మిణి కథలు
వెల : రు.50
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం



కలితో వ్యాపారం
న్ మెడెలే
: రు.50
చురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్



తెలంగాణం-తెలుగు మాగాణం
డా॥ గుమ్మనగారి బాలశ్రీనివాసమూర్తి
వెల : రు.60



తంత్రం
అశోక్ కుమార్
వెల : రు.15
ప్రచురణ : ఆలోచన-సాహిత్యవేదిక



కరువు కథలు
పి. సాయినాథ్
వెల : రు.8
ప్రచురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్

# సృజనాత్మకతపై దాడి




**నిజానికి ఫాసిజం మొరటుతనంలోనే ప్రతిభను చూస్తుంది. నేడు కేంద్ర ప్రభుత్వం అట్టహాసంగా నిర్వహిస్తున్న 'భారత్ వెలిగిపోతోంది' అన్న ప్రచారం దీన్నే సూచిస్తుంది. ఫాసిజం తన ప్రచారంలోని డొల్లతనం గురించి ఎల్లప్పుడూ భయపడుతుంది. అలా తన బూటకత్వం బయట పడినపుడు అది ఇతరులపై విరుచుకుపడుతుంది. మేధావులు, మీడియా తన అభిప్రాయాలను వక్రీకరిస్తున్నాయని వాస్తవాలను తప్పుగా చిత్రీకరిస్తున్నారని ఆరోపిస్తుంది. అంతటితో ఆగకుండా ఎదురు దాడికి సైతం పాల్పడుతుంది.**

**నరేష్ నదీమ్**

"మొరటుతనం, సృజనాత్మకతపై దాడి చేయడం ఫాసిజంలో ఒక లక్షణం" అని ప్రముఖ ఆర్థికవేత్త, ప్రొ॥ ప్రభాత్ పట్నాయక్ అన్నారు. దేశంలోని వివిధ ప్రాంతాలలో కళ, సంస్కృతి, చరిత్ర, ఇంకా ఇతర వ్యవస్థలపై జరిగిన విధ్వంసాన్ని దృష్టిలో ఉంచుకొని ఆయన ఈ వ్యాఖ్య చేశారు. గత ఫిబ్రవరి 21వ తేదీన న్యూఢిల్లీలోని కాన్స్టిట్యూషన్ క్లబ్‌లో జరిగిన రచయితల, కళాకారుల, మేధావుల సదస్సునుద్దేశించి ఆయన ప్రసంగించారు.

జనవాది లేఖక్ సంఘ్ (జె.ఎల్.ఎస్), ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ (పి.డబ్ల్యు.ఎ), జన సంస్కృతిమంచ్ (జె.ఎస్.ఎం), సఫ్దర్ హష్మిమెమోరియల్ ట్రస్ట్ (సహ్మత్), జననాట్యమంచ్ (జనమ్), యాక్ట్‌వన్, జన సంస్కృతి సంయుక్తంగా ఈ సదస్సును నిర్వహించాయి. ఉద్భవన, సమయాంతర్, హాన్స్, కమ్యూనలిజం కంబాట్ పత్రికలు కూడా దీనిలో పాలు పంచుకున్నాయి. సంస్కృతిపై, భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడిని ప్రతిఘటించడమే ఈ సదస్సు తన ముఖ్యోద్దేశ్యంగా ప్రకటించింది.

ప్రొ॥ నమర్‌సింగ్, డా॥ అశోక్‌మిత్రా, గీతా హరిహరన్, ప్రొ॥ సుధీర్ చంద్రలతో కూడిన అధ్యక్షవర్గం సదస్సు కార్యకలాపాలను నిర్వహించింది.

పూనె, సూరత్, భోపాల్, ఉదయ్‌పూర్, ఇంకా కొన్ని ఇతర చోట్ల సృజనాత్మక మేధోపరమైన రచనలపైన కళాఖండాలపైన జరిగిన దాడులను ప్రొ॥ ప్రభాత్ పట్నాయక్ తన ప్రసంగంలో ప్రస్తావించారు. ఈ దాడులు ఓ రకంగా చూస్తే నిరంకుశత్వానికి, మతోన్మాదానికి ప్రతిబింబాలని, మరో రకంగా చూస్తే సృజనాత్మకతపై మొరటుతనం పాల్పడిన దాడి అని ఆయన పేర్కొన్నారు. నిజానికి ఫాసిజం మొరటుతనంలోనే ప్రతిభను చూస్తుంది. నేడు కేంద్ర ప్రభుత్వం అట్టహాసంగా నిర్వహిస్తున్న 'భారత్ వెలిగిపోతోంది' అన్న ప్రచారం దీన్నే సూచిస్తుంది. ఫాసిజం తన ప్రచారంలోని డొల్లతనం గురించి ఎల్లప్పుడూ భయపడుతుంది. అలా తన బూటకత్వం బయట పడినపుడు అది ఇతరులపై విరుచుకుపడుతుంది. మేధావులు, మీడియా తన అభిప్రాయాలను వక్రీకరిస్తున్నాయని వాస్తవాలను తప్పుగా చిత్రీకరిస్తున్నారని ఆరోపిస్తుంది. అంతటితో ఆగకుండా ఎదురు దాడికి సైతం పాల్పడుతుంది.

ప్రొ॥ పట్నాయక్‌కు ముందు జె.ఎల్.ఎస్. ప్రధాన కార్యదర్శి చంచల్ చౌహాన్ ఆహ్వానోపన్యాసం చేశారు. ఆ తర్వాత ప్రముఖ ఛాయాచిత్రకారుడు, కళాకారుడు రామరహమాన్ గత నెల రోజుల కాలంలో కళాఖండాలపై జరిగిన దాడులను వివరించారు. ఈ దాడుల్లో కొన్ని అమూల్యమైన కళాఖండాలు శాశ్వతంగా ఎ[...] నాశనమయ్యాయో ఆయన తెలిపారు. [...] విధమైన హాని కేవలం అద్భుత కళాఖండాల[...] ధ్వంసం చేయడంవల్లనే జరగలేద[...] భారతదేశానికి చెందిన అనేక కళాఖండా[...] విదేశాల్లో ఉన్నాయి. వాటిని భారతదేశా[...] తీసుకురావచ్చు, ప్రదర్శించవచ్చు. కాని ఇక[...] పరిస్థితిని గమనించిన విదేశీయులు వా[...] అక్కడే అమ్మేసుకున్నారు. 1992 డిసెంబరు [...] తేదీన బాబ్రీమసీదు నేలమట్టం చేయబ[...] సమయంలో పాత్రికేయులను లక్ష్యం[...] చేసుకొని కాషాయ మూకలు జరిపిన దాడు[...] ఆయన గుర్తు చేశారు. అలాంటి దాడు[...] అప్పుడే మరిచిపోవటంపట్ల ఆయన విచా[...] వ్యక్తం చేశారు.

"భారత్ వెలిగిపోతోంది" [...] ప్రచారాన్ని ప్రజాధనంతో ప్రభుత్వం ఆర్భాట[...] నిర్వహించడాన్ని ప్రముఖ కాలమి[...] పరంజయ్‌గుహ నిశితంగా విమర్శించా[...] అమెరికా అధ్యక్షుడు బుష్ తన హయా[...] ఉపాధి కల్పన గొప్పగా జరిగిందని, [...] వ్యవస్థ అద్భుతంగా ఉందని చేసుకుం[...] ప్రచారాన్ని ఇది పోలి ఉందని అం[...]

# ఖమ్మం జిల్లా సాహితీ స్రవంతి అయిదవ వార్షికోత్సవం



ప్రధానోపన్యాసం చేస్తున్న జ్వాలాముఖి

మానవత్వం నుంచే కవిత్వం పుడుతుందని కవి, విమర్శకులు జ్వాలాముఖి అన్నారు. ఖమ్మంలోని సీక్వెల్ రిసార్ట్స్‌లో ఫిబ్రవరి 29న సాహితీ స్రవంతి పంచమ వార్షికోత్సవంలో ఆయన ప్రధాన ప్రసంగం చేశారు. ప్రపంచంలో రోజురోజుకు యాంత్రీకరణ పెరిగిపోతుందని, దీనివల్ల సమాజంలో విలువలు పడిపోతున్నాయని అన్నారు. సాహిత్యం ఒక నిరంతర ప్రక్రియ అని, దానికి ముగింపు ఉండదని, సమాజంలో ప్రజలు ఇబ్బందులు, సమస్యలు ఉన్నంత కాలం గొప్ప సాహిత్యం పుడుతూనే ఉంటుందని అన్నారు.

మన సంస్కృతి, సాహిత్యంపై ప్రపంచీకరణ ప్రభావం అదేపల్లి రామ్మోహనరావు వివరించారు. ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి ప్రస్తుతం ఫీల్‌గుడ్ సంస్కృతిలో ఉన్నామని, అంతా బాగుందని ప్రతివారితో బలవంతంగా అన్పించేందుకు ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయని వ్యాఖ్యానించారు. ఈ వార్షికోత్సవాలకు ముందు జిల్లాలోని యాభై కాలేజీలలో కవితా పోటీలు నిర్వహించారు. వారికి బహుమతులుగా పుస్తకాలు అందజేశారు.

యువకవులను వెలికి తీసేందుకు భవిష్యత్‌లో మరిన్ని కార్యక్రమాలు నిర్వహించనున్నట్లు జిల్లా సాహితీ స్రవంతి కార్యదర్శి ఆనందాచారి చెప్పారు. ఈ సందర్భంగా యువ కవయిత్రి షాజహాన మాట్లాడుతూ అనేక ప్రతిఘటనల నేపథ్యంలో స్త్రీవాద సాహిత్య చరిత్ర వివరించారు. డాక్టర్ హరీష్ ప్రారంభోపన్యాసం చేశారు. ఈ సందర్భంగా నిర్వహించిన యువకవి సమ్మేళనం పలువురిని అలరించింది. సాహితీవేత్తల చిత్ర ప్రదర్శనను పొట్లూరి వెంకటేశ్వరరావు ప్రారంభించారు.

---

పేర్కొన్నారు.

నేడు మనం ఒక భయానక పరిస్థితి మధ్య ఉన్నామని సుప్రీంకోర్టు సీనియర్ న్యాయవాది రాజీవ్ ధావన్ తన ప్రసంగంలో చెప్పారు. ఇది ''రాజ్యాంగ విధ్వంస'' కాలం అని ధావన్ అభిప్రాయపడ్డారు. ప్రస్తుత పాలకులు రాజ్యాంగ మౌలిక సూత్రాలనే కాలదన్ను తున్నారని ఆయన విమర్శించారు. కేంద్ర ప్రభుత్వంతోపాటు మతోన్మాద రాష్ట్ర ప్రభుత్వాలు భిన్నాభిప్రాయాన్ని, సృజనాత్మకతను నిర్మూలించడానికి చట్టపరమైన, చట్టానికి విరుద్ధమైన చర్యలకు పాల్పడుతున్నాయని ఆయన తెలిపారు. ఈ సమస్య కేవలం కళాకారులకు మాత్రమే కాకుండా అందరికీ సంబంధించిందని అన్నారు.

ఉదయ్‌పూర్‌లో షెయిఖ్ చోయల్ అనే కళాకారుని చిత్రాల ప్రదర్శన కూడా జరగకుండానే ఆ కళాకారుని వెంటాడి వేధించిన వైనాన్ని ప్రముఖ హిందీ కవి ప్రయాగ్ శుక్లా వివరించారు.

మతోన్మాదం, ఫాసిజాలకు సమాజంలో ప్రతిఘటన సన్నగిల్లటంపట్ల జె.ఎల్.ఎన్. కార్యనిర్వాహక అధ్యక్షుడు, జెహన్-ఎ-జదీద్ ఎడిటర్ జుబాయిర్ రిజ్వి విచారం వ్యక్తం చేశారు. సమర్థవంతమైన ప్రతిఘటన ఒక నిరంతర ప్రక్రియగా అభివృద్ధి చెందాల్సిన ఆవశ్యకతను ఆయన వివరించారు. జె.ఎస్.ఎం. కార్యదర్శి అజయ్‌సింగ్, జనం కార్యకర్త సుధన్వ దేశ్‌పాండె, సీనియర్ సోషలిస్ట్ పాత్రికేయుడు మస్త్ రాంకపూర్, యూనివర్శిటీ టీచర్స్ అసోసియేషన్ నాయకుడు మురళీ మనోహర్ ప్రసాద్‌లు కూడా సదస్సులో ప్రసంగించారు.

అధ్యక్ష వర్గంలోని ఇంగ్లీషు రచయిత్రి గీతా హరిహరన్ ప్రసంగిస్తూ రచయితలపైన కళాకారులపైన, కళారంగ కార్యకర్తలపైన జరుగుతున్న దాడులను ఖండించడానికి ఒక నిశితమైన వైఖరిని గైకొనాలని ఉద్ఘాటించారు.

ఇదే అంశాన్ని ప్రొ॥ సుధీర్ చంద్ర కూడా పేర్కొన్నారు. 1946-47లో దేశం మతోన్మాద మంటల్లో చిక్కుకున్నప్పుడు మహాత్మగాంధీ తన ప్రార్థనా ప్రసంగంలో ప్రతి ఒక్కరు తనను తాను పరిశీలించుకోవాలని చెప్పిన విషయాన్ని ఆయన గుర్తు చేశారు. తమ అభిప్రాయాలతో విభేదించే వారిపట్ల మతోన్మాద విధ్వంసకులకు ఎలాంటి విలువ, గుర్తింపులేదని వారి చర్యలు నిరూపిస్తున్నాయని అన్నారు.

ప్రసిద్ధ ఆర్థికవేత్త, డా॥ అశోక్‌మిత్రా ప్రసంగిస్తూ నేడు దేశంలో 1933-45 నాటి జర్మనీ పరిస్థితులు పునరావృతమవుతున్నాయని చెప్పారు. ఇప్పటి వరకు మనం లౌకికతత్వానికి తప్పుగా భాష్యం చెబుతూ, తప్పుగా అమలు చేస్తున్నామని ఆయన అన్నారు. మన పాలకులకు సెక్యులరిజం అంటే రాజకీయాలను, మతాన్ని విడివిడిగా ఉంచడంకాదని, అన్ని మతాలను సమానంగా బుజ్జగించడం అని ఆయన పేర్కొన్నారు. ఈ రకమైన 'సహనం' మతోన్మాద శక్తులకు ఉపయోగపడుతున్నదని ఆయన చెప్పారు.

హిందీ సాహిత్య విమర్శకుడు ప్రొ॥ నమవర్‌సింగ్ సదస్సులో చివరిగా ప్రసంగించారు. ప్రజల జీవితాలను అదుపు చేసే ప్రయత్నాలు ముమ్మరమైనాయని ఆయన చెప్పారు. గతంలో ఎన్నడూలేని విధంగా మతోన్మాదులు బరితెగించి వ్యవహరిస్తున్నారని విమర్శించారు. హిట్లర్‌ను పొగడటానికి సైతం వారు వెనుదీయడం లేదని అన్నారు.

ఈ సందర్భంగా కొన్ని పుస్తకాలు ఆవిష్కరించబడ్డాయి. గత ప్రపంచ పుస్తక మహోత్సవాలకు భిన్నంగా ఈ ఏడాది పుస్తకమహోత్సవంలో ముందుగా అనుమతి తీసుకోకుండా ఏ పుస్తకాన్ని ఆవిష్కరించరాదన్న వైఖరిని నేషనల్ బుక్‌ట్రస్ట్ గైకొంది. రచయితల మెడలు వంచడానికి ఇది ఒక ప్రయత్నమే. ఈ పుస్తక మహోత్సవంలో ఆవిష్కరించబడిన ముఖ్యమైన గ్రంథం ప్రధాన మంత్రి కవిత్వం మాత్రమే. అందువల్లనే కొన్ని పుస్తకాలను ఈ సదస్సులో ఆవిష్కరించవలసి వచ్చింది. గోరఖ్‌పూర్‌కు చెందిన సమాంతర్ పబ్లిషర్స్ ప్రచురించిన ఏడు హిందీ పుస్తకాల సెట్‌ను ప్రొ॥ సుధీర్ చంద్ర ఆవిష్కరించారు. నందకిషోర్ నందన్ రచించిన హిందీ కథల సంపుటిని ప్రొ॥ నమవర్‌సింగ్ ఆవిష్కరించారు.

ఈ సందర్భంగా సహ్మత్ 'బార్బేరియన్స్ ఎట్ ది గేట్' అనే టైటిల్‌తో ఒక పోస్టర్‌ను, బుక్‌లెట్‌ను విడుదల చేసింది. ❖

## "ముద్రబల్ల" ఆవిష్కరణ

కాకినాడ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో యు.టి.ఎఫ్. హోమ్‌లో జనవరి 13వ తేదీన జరిగిన సాహితీ సభలో కవి దాట్ల దేవదానంరాజు రచించిన 'ముద్రబల్ల' దీర్ఘ కవితను ప్రముఖ సాహితీవేత్త సత్యనారాయణ బోధి ఆవిష్కరించారు. జిల్లా కన్వీనర్ నందూరి దత్తు స్వాగతం పలికారు. ప్రముఖ కవి జి.సుబ్బారావు ముఖ్య వక్తగా పాల్గొని 'ముద్రబల్ల'ను సమగ్రంగా విశ్లేషించారు. ఆయన మాట్లాడుతూ దాట్ల దేవదానం రాజు వ్యవసాయ కుటుంబం నుండి వచ్చిన కవిగా రైతు సమస్యలను సజీవ చిత్రణ గావించి సాంప్రదాయ వ్యవసాయంపట్ల కొనసాగుతున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఉదాశీనతను, ప్రపంచీకరణ, వాణిజ్య ఒప్పందాల దుష్ఫలితాల్ని అద్భుతంగా కవిత్వీకరించినందుకు అభినందించారు. సభకు అధ్యక్షత వహించిన కృతి స్వీకర్త డా॥ అద్దేపల్లి రామమోహనరావు దీర్ఘ కవిత పద చిత్రాలతో కవితాధారతో రైతు నేపథ్యంగా వచ్చిన కావ్యాలలో ఎన్నదగినదిగా ప్రశంసించారు.



దాట్ల దేవదానం రాజు రచించిన 'ముద్రబల్ల' దీర్ఘ కవితను ఆవిష్కరిస్తున్న సత్యనారాయణ బోధి. ఫొటోలో కృతి స్వీకర్త డా॥ అద్దేపల్లి రామమోహనరావు, జి. సుబ్బారావు, దాట్ల దేవదానం రాజు, శిరీష

## పాలపిట్ట పరిచయం

ఆదివారం డిసెంబర్ 21న తేదీన, కరీంనగర్‌కు పదికిలోమీటర్ల దూరంలో గల ఎలగందల ఖిలాపైన ఆర్. రత్నాకర్‌రెడ్డి (ఆర్ర్యూబ్) రాసిన "పాలపిట్ట" పుస్తక పరిచయ కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమానికి సిద్దిపేట, సిరిసిల్ల, కరీంనగర్, హుస్నాబాద్ ప్రాంతాల నుండి కవులు, రచయితలు హాజరయ్యారు. ఈ సభలో నందిని సిద్ధారెడ్డి మాట్లాడుతూ అచ్చమైన పల్లెపదాలతో కూడిన కవిత్వం పల్లె వాతావరణాన్ని, జీవనాన్ని చిత్రిక పట్టిందన్నారు. తాజాదనము, సూటిదనము మేళవించిన వ్యక్తీకరణతో కొత్తసాలు తీస్తున్న కవి రత్నాకర్ అని దర్భశయనం శ్రీనివాసాచార్య అభినందించారు. పుస్తకంలోని పలు కవితల్ని ఉటంకిస్తూ "పాలపిట్ట"లోని కవిత్వాన్ని నలిమెల భాస్కర్ ఆవిష్కరించారు. జూకంటి జగన్నాథం, లక్ష్మణరావు మొదలగువారు ప్రసంగించారు.

వేదిక, మొదలు, తుది, మధ్యలో, అధ్యక్షులు లాంటి సంప్రదాయాలకు భిన్నంగా సాగిన ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి, సాహితీ గౌతమి సభ్యులే కాక ఎలగందల గ్రామ ప్రజలు కూడా పాల్గొనడం విశేషం. ఖిలాపైన గల ఆహ్లాదకరమైన వాతావరణానికి తోడు దేశపతి శ్రీనివాస్ పాడిన పాటలు జత కావడంవల్ల కార్యక్రమ శోభ ఇనుమడించింది.

-బి.వి.ఎన్. స్వామి

## పులికంటి అభినందన

నాలుగు దశాబ్దాలుగా సాహితీ రంగంలో వివిధ ప్రక్రియల్లో నిరవధిక కృషి చేస్తున్న పులికంటి కృష్ణారెడ్డి ప్రతిష్ఠాత్మకమైన గోపీచంద్ అవార్డు రావడంతో ఆయన అభిమానులు తిరుపతిలోని ఓ ప్రైవేటు హోటల్లో జనవరి 4న అభినందన సభను ఏర్పాటు చేశారు. రాష్ట్రీయ సేవా సమితి కార్యదర్శి గుత్తా మునిరత్నం పర్యవేక్షణలో జరిగిన ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన చిత్తూరు జిల్లా ఎస్పీ రామచంద్రరాజు మాట్లాడుతూ భారతీయ కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమవుతోందని, పులికంటి లాంటి రచయితల వలన ఈ వ్యవస్థ తిరిగి చిగురించగలదని ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. రాయలసీమ మాండలికంలో రచనలు చేసిన మొదటి వ్యక్తి అని, వీరి రచనలన్నింటా అట్టడుగు ప్రజల ఆవేదనలే పేరుకున్నాయన్నారు.

ఐఎఎస్ రామిరెడ్డి అధ్యక్షత వహించారు.

పులికంటి మాట్లాడుతూ 73 ఏళ్ళ తన జీవితంలో కష్టాలు కన్నీళ్ళు భాగమైనాయని, అయినా తానేనాడు కృంగిపోకుండా సాహిత్యమే జీవితంగా బతుకుతున్నానన్నారు. ప్రతి ప్రాంతానికి, వ్యక్తికి మాండలికం వుంటుందని తనరచనల్లో దీన్ని స్పష్టంగా ప్రతిబింబించానన్నారు. యూనివర్సిటీ జిరాక్స్ అధినేత జి. శ్రీధర్ సన్మాన పత్రాన్ని సమర్పించారు.

సభ సుమధుర గాయని ద్వారం లక్ష్మి ప్రార్థనాగీతంతో ప్రారంభమైంది.

-దేవేంద్ర, తిరుపతి

## చర్ల "సాహితీ స్రవంతి" ఆధ్వర్యంలో ఆరుద్ర జీవితం సాహిత్యంపై సభ

ఆధునిక సాహితీయుగానికి కొత్త రూపును సరికొత్త ఒరవడిని అందించి అందరి హృదయాల్లో సుస్థిర స్థానం సాధించిన ఘనత "ఆరుద్ర"కే సొంతం అని కొత్తగూడెంకు చెందిన ప్రముఖ సాహితీవేత్త - విమర్శకులు మండవ సుబ్బారావు (ఎమ్మెస్సార్) అన్నారు. ప్రస్తుత యాంత్రిక యుగంలో మానవీయ విలువలు కాపాడడానికి యువతరం తప్పకుండా సాహిత్యం గురించి ఆలోచించి అందులోని మాధుర్యాన్ని విలువలను సొంతం చేసుకుని నూతన సాహితీశకానికి నాంది పలకాలని ఆయన పేర్కొన్నారు.

సాహితీస్రవంతి చర్ల శాఖ ఆధ్వర్యంలో స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఏర్పాటు చేసిన ఈ సభలో కళారవళి అధ్యక్షులు కడెం మురళీ మనోహరరావు. గౌతమి నవ్య సాహితీ అధ్యక్షులు పి.వి.ఆర్. స్వామి. సాహితీ స్రవంతి (చర్ల) అధ్యక్షులు అమ్మిన శ్రీనివాసరాజు, విద్యావేత్త బి.వి.ఎస్.ఆర్. నర్సింహరావు పాల్గొని సాహితీ వాతావరణం అంతంత మాత్రంగా వున్న ఈ సమయంలో ఇలాంటి సాహిత్య సభలు మారుమూల ప్రాంతాల్లో నిర్వహించడం సాహసోపేతమైన చర్యగా అభివర్ణించారు. ఆరుద్ర సినీ సాహిత్యతంపై మురళీ మనోహరరావు ఆలపించిన గీతాలు సభికులను, విశేషంగా అలరించాయి.

మాల్యశ్రీ అధ్యక్షత వహించిన ఈ సభకు సాహితీస్రవంతి (చర్ల) ప్రధాన కార్యదర్శి ఆడెపు ముత్యాలరావు స్వాగతం పలుకగా కోశాధికారి బండారు దుర్గాప్రసాద్ వందన సమర్పణ చేశారు.

-అమ్మిన శ్రీనివాసరాజు

63

# ఈ రచనలు ఎవరివి? ఎందులోవి?

ఇదో తమాషా అయిన అదే సమయంలో ఆసక్తికరమైన పరీక్ష లాటిది. ఇది మన అవగాహనను మనం తెలుసు కోవడానికి మాత్రమే కాక అంతగా తెలియని కోణాలు తెలుసుకోవడానికి కూడా ఉపయోగ పడుతుంది.

ప్రస్థానం అన్ని తరగతులు సాహిత్య మిత్రుల కోసం ఉద్దేశించింది కనక ఈ విషయాలు ఎవరికి తెలియవు అని పెదాలు చప్పరించకండి. ముందుగా మీరే చెప్పేసి ఔత్సాహికులకు పని లేకుండా చేయకండి. వాళ్లను తెలుసుకోనివ్వండి. చదువుకోనివ్వండి.

ఈ ప్రశ్నలకు జవాబులు తెలిసినా తెలియక పోయినా ఆ సంగతి ప్రస్థానంకు రాయండి. వాటిని ప్రచురిస్తాము. అదే సమయంలో ఇందులో ఇచ్చే అంశాలపై మీ అభిప్రాయాలు తెలియజేయండి. అలాగే దీనికి అంశాలను కూడా పంపవచ్చు. ఆ విధంగా సాహితీ మిత్రుల భాగస్వామ్యంతో ఈ శీర్షిక కొనసాగుతుంది. చర్చగానూ వుంటుంది.

మేం నవీనులం!
మేం భావుకులం !
పాతకలోకపు గుండెలో శతఘ్నిపగిలించి
భావికాలం చంద్రశిలలు కరగించి
పాటపాటకి సోకు స్వర్గంలాగ
మాటమాటకి దూకు సింహంలాగ
మేం నిలుస్తాం !
మేం పిలుస్తాం !

మేం మనుష్యులం !
మేం మహస్సులం !
మాకు శాస్త్రంలేదు
మాకు దాస్యంలేదు
మాకు లోకం ఒక గీటురాయి.
మాకు కరుణ చిగురుతురాయి
మేం దివ్యత్వం నటించం !
మేం పరపీడన సహించం !

## ఇది కవిత్వ కాలం

ఇంతకుముందు మానవ చరిత్రలో ఏదుస్సంఘటన జరిగినా అసలు మానవుని ఉనికికే ప్రమాదం వచ్చే పరిస్థితి ఎన్నడూ ఏర్పడలేదు. మరఫిరంగికంటే మల్లెమొగ్గకే ఎక్కువ విలువ వున్నదని మానవులంతా అంగీకరించేవారు. కాని, నేడు మన నాగరికతకొక సుస్థిరమైన ప్రాతిపదికలేదు. ఇప్పుడు విలువలు, విశ్వాసాలు, వ్యవస్థలు - అన్నిటిలో కల్లోలం ఏర్పడింది. ప్రశ్న తలఎత్తింది. మానవుడు ఈ కల్లోలం నుండి బయటపడి, తన స్వరూపాన్నే ఒక మహత్తరాదర్శంతో, ఒక వినూత్నాకృతితో నిర్మించుకోవలసిన అవసరం కలిగింది. కవిత్వంలోనూ ఇంతే, నేటి విజ్ఞానం, సాహిత్యం అన్నీ, మానవుల నిత్యకృత్యాల్లో, చింతనలో చేస్తున్న తపస్సుకు ఫలితాలే...

... ... ...

ఇదే నేటి మానవునిలో కన్పించే అస్పష్టమైన అంతరంగిక వేదన. మారుపడిన పసిబిడ్డలాగ దారీ తెన్నూ కన్పించని ఈ జీవితపు తిరునాళ్ళలో ఏకాంతంగా సంచరిస్తున్నాడు. అంతే కాదు. అతను కల్పించుకున్న ముక్తి సాధనాలే ఒక దశ తర్వాత అతనిని బంధాలై కలవర పరుస్తున్నాయి. మేధావుల వాదోపవాదాలకు, రాజకీయ నాయకుల వివిధ పథకాలకు, శాస్త్రజ్ఞుల పరిశీలనా పద్ధతులకు కేంద్రంఆ వుండవలసిన మానవాత్మయే వీటివల్ల మరుగుపడి పోతున్నది. మానవుని భౌతిక ఆధ్యాత్మిక వ్యక్తిత్వాల మధ్య సమన్వయం కుదరడం లేదు. ఈ విచిత్ర వేదనే నేటి సాహిత్య రూపాలలో, ముఖ్యంగా కవిత్వంలో గోచరిస్తున్నది...

... ... ...

కవి వేదనాత్మకమైన ఈ పరిశోధనలో జీవితంలోని అంతర్గర్భిత సత్యాలను బహిర్గతం చేస్తాడు. ఉత్తమ కళాసృష్టికి ఈ యుగంలో కవికున్నంత అవకాశం మరెప్పుడూ కనుపించదు...

## వివాహం... సహజీవనం

ఈనాడు స్త్రీ స్వేచ్ఛ పొందడానికి వున్న ఆటంకాలన్నీ తీసివేసినా, సంసారాలు వొదులుకొని వెళ్ళే వాళ్ళు ఎక్కువ మంది వుండరు. క్రమంగా స్వేచ్ఛకి అలవాటుపడి కొందరు కాలం గడిచినకొద్దీ బైటపడవొచ్చు. స్నేహం, పిల్లలు, అలవాట్లు, సుఖం, ఒకరికొకరు అలవాటు కావడం, సుఖ దుఃఖాలు పంచుకోవడం, యివన్నీ కాపరాల్లో మనుషుల్ని ఆకర్షించి స్వేచ్ఛగా బంధించి వుంచుతాయి. వివాహమనేది వున్నా లేకపోయినా, సంబంధాలు అస్తమించవు కదా? స్త్రీ పురుషులు వుత్త మోహం చేతనేగాక, పెళ్ళికానీ, కాకపోనీ కొంత కాలం కలిసి జీవితం గడపడంచాత స్థిరంగా అతుక్కు పోతారనే సంగతి మానవ స్వభావంలోనే వుంది. ఏదీ, ఎవరూ మార్చలేరు.

... ... ...

ఎన్ని వ్యాసాలు ఎవరు ఎంత ఆకర్షవంతంగా రాయనీ, ఏ డిక్టేటరో వివాహమనేది వుండకూడదని శాసించనీ, ప్రజలు జతకావడం మానరు. భర్తల నించి లేచిపోయే వాళ్ళు కూడా, ఏ మూలనో కొంచెం విశ్వాసం కలవాళ్ళతో ఎవరితోనో స్థిరపడతారు. నేను వాంఛించే మార్పు యీ వివాహంలో వున్న అక్రమాలు అన్యాయాలు పోవాలని...

అక్టోబర్-డిసెంబర్ 2003 సంచికలో ఇచ్చిన వచనం శ్రీశ్రీ అనంతంలోది. 30 ఏళ్ళ కిందట రాసిన ఆయన ఆత్మకథలో బ్రాహ్మణాధముడూ, శుద్రోత్తముడు లాటి ప్రయోగాలను చూడొచ్చు. భాష-భావాలకు సంబంధించిన సంఘర్షణ పరికించవచ్చు.

అదే శీర్షికలో ఇచ్చిన కవిత కనపర్తి వరలక్ష్మమ్మది. దేవులపల్లి కృష్ణశాస్త్రి భావ కవితల్లోని ఊహా ప్రేయసిని ప్రశ్నిస్తూ ఆనాడే రాసిన కవిత.

Printed and Published by Sri **V. Krishnaiah** On behalf of Sahiti Sravanti
1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500 020. Editor **T. Ravindranath**.
Printed at Prajasakti Daily Printing Press. 1-1-60/2, M.B. Bhavan, R.T.C. 'X' Road, Hyderabad.

# జిల్లా తాగునీటి మరియు పారిశుద్ధ్య యంత్రాంగము

## సంపూర్ణ పారిశుద్ధ్య పథకము

## వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం

### వరంగల్ జిల్లా, ఆంధ్రప్రదేశ్



యన్. శివశంకర్ ఐ.ఎ.ఎస్.
జిల్లా కలెక్టర్ మరియు చైర్మన్
డిస్ట్రిక్ట్ వాటర్ & శానిటేషన్ కమిటీ,
వరంగల్



కె. వెంకటేశ్వర్‌రావు
పర్యవేక్షక ఇంజనీర్
ఆర్.డబ్ల్యు.ఎస్. (పి.ఆర్)
సర్కిల్, వరంగల్

## సమగ్ర పారిశుద్ధ్యం అంటే 7 ప్రధానాంశాల కలయిక

| | | | |
|---|---|---|---|
| 1. | తాగునీటి వాడకం | – | కాచి వడపోసిన నీరు వాడాలి |
| 2. | మురికినీటి పరిష్కారం | – | ఇంకుడు గుంతలు లేదా కాల్వలు నిర్మించి, శుభ్రంగా ఉంచాలి. |
| 3. | మానవ మల మూత్రముల పరష్కారం | – | మరుగుదొడ్లనే వాడాలి. |
| 4. | చెత్తా చెదారం పరిష్కారం | – | చెత్తను ఎరువుగా మార్చుకోవడానికి వీలుగా పెరట్లో చెత్తగోతిని నిర్మించాలి. |
| 5. | గృహ పారిశుద్ధ్య, ఆహార శుభ్రత | – | ఇంట్లో గాలి వెలుతురు ఉండాలి, పొగరాని పొయ్యి వాడాలి. శుభ్రత అవసరం. |
| 6. | వ్యక్తిగత పరిశుభ్రత | – | క్రమం తప్పక స్నానం, ఆహారం తీసుకొనే ముందు, తర్వాత సబ్బుతో చేతులు శుభ్రపరచాలి. |
| 7. | గ్రామ పరిశుభ్రత | – | గ్రామంలోని చెత్తా చెదారం, మురుగు నీరువల్ల వచ్చే కలుషిత గాలి, దోమల నుండి తప్పించుకోగలమా! అందుకే మన ఇల్లే కాదు, గ్రామ పరిశుభ్రత కూడా అవసరమే! |

ఆరోగ్యం! ఆనందం!! అభివృద్ధి!!

## రండి సాధించుకుందాం

- ✦ గ్రామీణ మహిళలకు వరం - వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం
- ✦ ఆరుబయట మలమూత్రాదులు -గ్రామాలకు విషతుల్యమైన కాలుష్యాలు
- ✦ పరిశుభ్రత లేని గ్రామము - భూమి మీద ఉన్న నరకము
- ✦ నీరు ప్రాణికి జీవనాధారం - అన్ని నీటి వనరులను రక్షించుకోవడం, పొదుపుగా వాడుకోవడం మన తక్షణ కర్తవ్యం

జి. ఎల్లయ్యగౌడ్
ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, ఆర్.డబ్ల్యూ.యస్. (పి.ఆర్)
డివిజన్ : హన్మకొండ, వరంగల్

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | PRSVM02A111 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |